# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వైకోట్ల బంగారం

రచన: వసుంధర

## డబ్బుకోసం దారుణం!

రచన: వి. యస్. రావ్

## యువ చోరులు

రచన: బొమ్మిడి అచ్చారావు

రాక్షస వేట — రెండవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—172
ఏప్రిల్, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1,

# ఇరవైకోట్ల బంగారం

## వసుంధర

హోటల్ నటరాజ్ — రూమ్ నంబర్ పదిహేడు —

డిటెక్టివ్ కిల్లర్ మంచంమీద పడుకుని పైన తిరుగుతున్న ఫ్యాను వంకే చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. అతడి ఆలోచనలనిండా బ్లూ హార్సెస్....

బ్లూ హార్సెస్ అంటే అదో సంస్థ. చాలా ప్రమాదకరమైన సంస్థ. ఆ సంస్థలో పనిచేసే వారందరూ ఇండియన్సు. సంస్థకు డబ్బు అమెరికానుంచి వస్తుంది. ఆదేశాలు పాకిస్తాన్ నుంచి వస్తాయి. దేశంలోని యువత మనసును కలుషితంచేసి — తమకనుకూలంగా ప్రభావితం చేయడం ఆ సంస్థ ఆశయం.

అణ్వస్త్రప్రయోగంవల్ల దేశాలు నాశనమైపోతాయి. భవనాలు కూలిపోతాయి. మనుషుల ప్రాణాలు పోవడమటుంచి మిగిలినవారిని శతాబ్దాలపాటు జాడ్యాలు పట్టుకుంటాయి. ఒక దేశం మరో దేశాన్నేలాలనుకుంటే అణ్వస్త్రాలు పనికిరావు. ఒకదేశం మరో దేశాన్ని

శాసనం చేయాలనుకున్నప్పుడే అణ్వస్త్రాలు కావాలి.

భారతదేశం విశాలమైనది. విశిష్టమైనది. భారతదేశంపై ఏదేశం సర్వాధికారాలూ సంపాదించుకుంటుందో—ఆ దేశం ప్రపంచ దేశాలన్నింటినీ సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ, సైనిక పరంగా శాసించగలదు. అందుకే అగ్రదేశాలన్నింటికీ భారతదేశమంటే ఆకర్షణ.

కానీ భారతదేశం స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి వుంది. అగ్రదేశాలకు తను దూరంగా ఉండడమే కాక—బడుగు దేశాలకు తనే నాయకత్వం వహించి—వాటిని కూడా అగ్రదేశాలకు దూరంగా అలీనంగా వుంచుతోంది. భారతదేశంలో కల్లోలం సృష్టించడానికే—అగ్రదేశాలు భారతానికి పొరుగున వున్న దేశాలకు — అమితంగా ఆయుధాలను సరఫరా చేస్తూంటాయి. పొరుగు దేశపు ప్రజలకు నోరు లేకుండా చేయడానికి—ఆయా దేశాలలో ప్రజారాజ్యం లేకుండా చేస్తూంటాయి.

ఆ విధంగా ఎంతోకాలంగా భారతానికి పొరుగు దేశమైన పాకిస్తాన్ మిలిటరీ పాలనలో మగ్గుతోంది. పాలకులు తమ పరిపాలనా దౌష్ట్యం కొనసాగించడానికీ, అసమర్థతను కప్పిపుచ్చుకోవడానికి — పాకిస్తాన్ ప్రజలలో పొరుగుదేశంపట్ల ద్వేషం పుట్టే ప్రచారాలు చేస్తూ భారతదేశంలో అల్లకల్లోలం పుట్టించడానికి సర్వదా ప్రయత్నిస్తూంటారు. అలాంటి ప్రయత్నాల ఫలితాల్లో ఒకటి బ్లూ హార్సెన్.

బ్లూ హార్సెన్ సంస్థలోని సభ్యులు పద్దెనిమిది. వారి ధనబలం అంతులేనిది కావడంవల్ల—ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు—ఎక్కడ కావాలనుకుంటే అక్కడ—

ఎలా కావాలనుకుంటే అలా అల్లకల్లోలాన్ని సృష్టించ గల్గుతున్నారు. ప్రభుత్వానికి తమ ఉనికి తెలియకుండా ఆ సంస్థ సభ్యులు తమ మకాం తరచుగా మార్చేస్తూ ఉంటారు. ఆ సభ్యుల ధనబలం—రాజకీయ ప్రభావానికి లోబడి పోలీసు బలగాన్ని నిర్వీర్యుల్ని చేస్తోంది.

భారతీయ గూఢచారులు బ్లూ హార్సెన్ గురించి అన్వేషిస్తున్నారు. బ్లూ హార్సెన్‌కు కొందరు స్వార్థపరులైన రాజకీయ నాయకులు సాయపడుతూండడంవల్ల—వారి అన్వేషణ ఫలించడం కష్టంగా వుంది. అలా కష్టపడుతున్న వారిలో ఏజంట్ 127 ఒకడు.

అతడు బ్లూ హార్సెన్ గురించి కొంత సమాచారం సేకరించగలిగాడు. ఆ ప్రకారం బ్లూ హార్సెన్ విశాలపురంలో ఉన్నట్లు అతడికి తెలిసింది. ఏజంట్ 127 ఒక పోలీసినస్పెక్టర్ ద్వారా డిటెక్టివ్ కిల్లర్‌కి ఓ కవరందజేశాడు. ఆ కవర్లోని ఉత్తరంలో—

"డియర్ డిటెక్టివ్ కిల్లర్! నీ శక్తిసామర్థ్యాలనిప్పుడు యావద్భారతదేశం గుర్తించింది. దానికి తోడు నీకు నియమాల శృంఖలాలు లేవు. మన దేశానికి ప్రమాదకరంగా తయారైన బ్లూ హార్సెన్ సంస్థ గురించి నాకు కొంత పనికివచ్చే సమాచారం దొరికింది. ఇప్పుడా సంస్థను బట్టబయలు చేయగలననే నేనాశిస్తున్నాను. అందుకు నేను ప్రభుత్వ సహాయంకాక నీ సహాయం తీసుకోదల్చుకున్నాను. ఈ ఉత్తరమందిన వెంటనే నీవు విశాలపురం బయల్దేరి వెళ్ళు. హోటల్ నటరాజ్‌లో రూం నంబర్ 17 నేను నీ పేరున బుక్ చేసి ఉంచుతున్నాను.

అందులో మకాం పెట్టు. నేను నిన్ను కంటాక్ట్ చేస్తాను—

నీ స్నేహితుడు-ఏజంట్ 127."

కిల్లర్ వెంటనే విశాలపురం చేరుకుని హోటల్ నటరాజ్‌లో మకాం చేశాడు. అతడిక్కడకు వచ్చి మూడు రోజులయింది. ఏజంట్ 127 జాడలేదు.

ఈలోగా కిల్లర్ ఊరికే కూర్చోలేదు. నగరంలో సంఘవిద్రోహక శక్తులేమున్నాయోనని విచారించి పరిశోధనలు చేశాడు. అతడి పరిశోధనల్లో వెంటనే బయట పడింది సంస్థ. దాని పేరు "మాస్టర్ కీ."

మాస్టర్ కీ ఒక అంతర్జాతీయ సంస్థ. భారతదేశంలో దాని హెడ్డాఫీసు ఢిల్లీలో వుంది. దేశంలోని అన్ని రాష్ట్రాల ప్రముఖ నగరాల్లోనూ దానికి అనుబంధ సంస్థలున్నాయి. వివిధ అంతర్జాతీయ నేరస్థుల సంస్థలకు స్థానికంగా అవసరమైన సేవచేసే సంస్థ అది.

కిల్లర్ ఆ సంస్థ సభ్యుల గురించి కొన్ని వివరాలు సేకరించగలిగాడు. వారందరూ నగరంలోని ప్రముఖ వ్యక్తులు. వారివంక తేరిపార చూడ్డానికి స్వయాన—ఆ భగవంతుడే వచ్చినా—ధైర్యం చేయలేడు.

"మాస్టర్ కీ" సంస్థ "బ్లూహార్స్"కి సహాయపడుతూనే ఉండివుండాలి. ఆ రెండు సంస్థలనీ సమూలంగా నాశనం చేయగలిగితే — దేశానికి పట్టిన పీడ వదిలి పోతుంది. కానీ అదంత సులభంకాదు.

మాస్టర్ కీ సంస్థ గురించి చాలా సులభంగా తను వివరాలు సేకరించగలిగాడు. అంటే ఆ సంస్థ కార్యకలాపాలు చాలా వరకూ బహిరంగంగానే జరుగుతున్నాయి. అందులో ఆశ్చర్యంలేదు.

బొంబాయి రైల్వేస్టేషన్ వద్ద కొన్ని కిలోమీటర్ల పొడవున — స్మగుల్డు వస్తువులు అమ్మకానికి లభిస్తాయి. ఏళ్ళతరబడి జరుగుతున్న చట్టవిరుద్ధమైన విశేషమిది! అది పోలీసులకు తెలియదనిగానీ — వారు చట్టవిరుద్ధంగా స్మగుల్డు వస్తువులమ్మేవారని పట్టుకుని శిక్షించేందుకు ప్రయత్నిస్తున్నారని గానీ — భావించలేం కదా! ఈ స్మగుల్డు వస్తువుల అమ్మకం బొంబాయి నగరానికే పరిమితంకాదు. ఢిల్లీ, కలకత్తా, మద్రాసువంటి మహానగరాల నుంచి ఆలమూరువంటి చిన్న పట్టణాలవరకూ విస్తారంగా వ్యాపించి వున్న బహిరంగ నేరమది!

బ్లూ హార్సెస్ గురించి విశాలపురంలో ఆకడికే విధమైన సమాచారం లభించలేదు. ఏజంటు 127 ఆ సమాచారం తెలియజేయగానే బ్లూహార్సెస్‌కీ మాస్టర్‌కీకీ ఉన్న సంబంధాల్ని పట్టుకోవాలని ఆలోచిస్తున్నాడు కిల్లర్.

ఆ సమయంలో మంచం పక్కనే ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడు కిల్లర్ రిసీవర్ తీసి.

"కిల్లర్‌గారేనా? నేను — రమణను మాట్లాడుతున్నాను. మా యింట్లో దొంగలు పడ్డారు. అర్జంటుగా మీరు రావాలి. మా యిల్లు గాంధీనగర్‌లో వడియాల వారి వీధిలో ఉంది. ఆ వీధిలో పచ్చరంగు డాబా అదొక్కటే. మీరు సులభంగా గుర్తుపట్టగలరు...." అందవతెలి గొంతు.

"రమణగారూ? మీరెవరో నాకు తెలియదు...."

"మా యింటి నంబరు నూటయిరవై ఏడు. కానీ వడియాలవారి వీధిలో నంబర్లు సరిగ్గా ఉండవు. మీరు మాత్రం పచ్చరంగు డాబాను చూసుకునిరండి. మీకోసం

ఎదురు చూస్తూంటాను. మిగతా విశేషాలు మనం కలుసు కున్నాక మాట్లాడుకుందాం....” అందవతలిగొంతు.

ఫోన్ చేసింది ఏజంటు 127 అని కిల్లర్ కర్థమయింది. అతడు వెంటనే మంచంమీంచి లేచాడు.

## 2

పచ్చరంగు డాబాను సులభంగానే కనుక్కున్నాడు కిల్లర్. ఇంటిముందో చెక్కగేటుంది. అతడా గేటు తీసు కుని ఇంటి గుమ్మందాకా వెళ్ళాడు. కాలింగ్ బెల్ ప్రయోగించాలనుకునేలోగా తలుపులు తెరుచుకున్నాయి.

“కమాన్ డిటెక్టివ్—” అన్నాడో ఆజానుబాహువు.

కిల్లర్ అతణ్ని పరీక్షగా చూశాడు.

సన్నగా పొడవుగా వున్నాడతడు. మీసాలు లేవు. చురుకైన కళ్ళు, సూటిముక్కు. చూడగానే అంద గాడనిపిస్తుంది. కానీ మనిషిలో యేదో నిర్లక్ష్యముంది.

“ఇంటి నంబరు 127....అవునా?” అన్నాడు కిల్లర్.

“అవును....లోపలకు రా”—అన్నా డతడు.

కిల్లర్ లోపలకు వెళ్ళాడు.

విశాలమైన హాల్లో మధ్య సోఫాలున్నాయి. ఇద్దరూ సోఫాలో పక్కపక్కనే కూర్చున్నారు.

“ఈ యిల్లు ప్రభుత్వ గూఢచారి శాఖది. ఇక్కడ చాలా సదుపాయాలున్నాయి. శత్రువులు నన్ను కని పెట్టారు. ఎలాగో ఈ యింట్లో ప్రవేశించాను. అది నా అదృష్టం. నేనిందులోంచి బయటకు రావడమెలాగో తెలియడంలేదు. చివరకు నీకు ఫోన్ చేశాను..” అన్నాడు ఏజంటు 127.

“ఈ యింట్లోంచి నీవెందుకు బైటకు రాలేవు?” అడి గాడు కిల్లర్.

"శత్రువులు వేయి కళ్ళతో యీ ఇంటిని గమనిస్తున్నారు...." అన్నాడు ఏజంటు 127.

"ఎలా తెలుసు నీకు?"

"ఈ యింటికి వేయుగజాల ఆవృతంలో ఏం జరుగుతున్నదీ నేను తెలుసుకోగలను ......" అన్నాడు ఏజంట్ 127.

"ఈ యింట్లో యింకెవరూ లేరా?"

"ప్రస్తుతం నేనే వున్నాను. మా గూఢచారి శాఖ మనుషులు — ఈ యింట్లోకి యెప్పుడు కావాలంటే అప్పుడు రాగలరు. ఈ యింటి తలుపులను కోడ్ వర్డ్సతో తెరవ్వచ్చు...."

"సరే—ఇంతకీ నాతో పనేమిటి?"

"ఇప్పుడు నావద్ద అత్యంత ప్రమాదకరమైన సమాచారముంది. అది నేను అర్జంటుగా మా చీఫ్‌కు అందజేయాలి. కానీ...."

"ఊఁ" అన్నాడు కిల్లర్.

"శత్రువులు నన్ను కనిపెట్టారు. వాళ్ళు నన్ను వేటాడతారు. వాళ్ళనుంచి తప్పించుకుని నేను సమాచారాన్ని చీఫ్‌కందజేయాలి...."

"నిన్ను కనిపెట్టిన శత్రువులు—నీకోసం ఈ ఇంట్లో ప్రవేశించి నిన్నెదుర్కోలేరా?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

"అదే ఈ యింటి ప్రత్యేకత. కొన్ని మీటలు నొక్కడంవల్ల—ఈ యింటి చుట్టూ కనిపించని కాంతికిరణాలు ప్రసరిస్తూంటాయి. అవి మనిషి మెదడుపై విచిత్రమైన ప్రభావాన్ని చూపించడం కారణంగా మనిషికి గేటు దాటి రాగానే వెనక్కు తిరిగి వెళ్ళిపోవాలనిపిస్తుంది.

కారణం ఆ మనిషి ఊహించలేదు...."

"అయితే నేనెలా రాగలిగాను?"

"చెప్పానుగా — ఇంటికి వేయిగజాల అవృతంలో జరిగేవన్నీ నేను తెలుసుకోగలను. నీ రాకను గమనించి కాంతికిరణాలలో చిన్న మార్పు తీసుకుని వచ్చాను. అందువల్ల నీ వొక్కడివీ మాత్రం లోపలకు రాగలిగావు. నిన్నెవరైనా అనుసరించి వస్తూంటే వాళ్ళు లోపలకు రాలేరు...."

"నేను నీకు తెలుసా?"

"నీవు నాకు తెలియడమే కాదు. నీవే కిల్లర్ వనడానికి కూడా ఋజావు — నీవీ యింట్లోకి రాగలగడం!" అన్నాడు ఏజంట్ 127.

"అంటే?"

"నేను కాంతికిరణాలలో యెలాంటి మార్పు తీసుకుని వచ్చానంటే—అవి కేవలం నీ శరీరాన్ని మాత్రమే లోపలకు రానిస్తాయి. నీ వేషంలో మరో వ్యక్తి వచ్చినా లోపలకు రానివ్వవవి..."

"అదెలా సాధ్యం?"

"డియర్ కిల్లర్! సైన్సు సాధిస్తున్న ప్రగతి గురించి నీకు తెలియదా? ఏ యిద్దరు మనుషుల శరీరాలూ—ఈ ప్రపంచంలో సరిపోలడం అసాధ్యమని నీకు తెలియదా? కాంతికిరణాల ప్రభావం ఒకో శరీరంపై ఒకోవిధంగా ఉంటుందని నీ వూహించలేవా? అన్నీ కలిపి కొందరు సైంటిస్టులు సృష్టించిన పరికరాలీయింట్లో అమర్చబడి వున్నాయి...."

"వెరీగుడ్!"

"అందుకే నేను కావలసిన వాళ్ళందర్నీ—ఇక్కడే

కలుసుకుంటాను...." అన్నాడు ఏజంట్ 127.

"అంటే నా శరీరం గురించిన సమాచారమంతా నీ వద్ద ఉన్నదన్నమాట! మరి అలా సమాచారం లేని వాళ్ళను లోపలకెలా రానిస్తావు?"

"చాలా సింపుల్........తాత్కాలికంగా కాంతికిరణాలనుపసంహరించగలను...." అన్నాడు ఏజంట్ 127.

"ఇన్ని సదుపాయాలుండీ — మన దేశ ప్రజలకు న్యాయం జరగడంలేదు. వారికి సరైన రక్షణలేదు...." అన్నాడు కిల్లర్ విచారంగా.

"అవును. కానీ అందుక్కారణం చాలావరకూ ప్రజలే!"

"ఎలా?"

"తాము సుఖపడతూ—తమ ప్రజల నా సుఖాలకు దూరం చేస్తున్న నాయకుల నెన్నుకున్న దెవరు? ఆ ప్రజలే కదా...."

"అవును—కానీ వారు—అమాయకులు...."

"వాళ్ళు అమాయకులు కాదు. అవకాశవాదులు. దూరదృష్టి లేకుండా తాత్కాలిక ప్రయోజనాల కాశపడి తమ గొయ్యి తామే తవ్వుకునేవారు....సరే—అదంతా మనకెందుకులే కానీ—ఇప్పుడు నువ్వే నాకు సాయపడాలి "

"చెప్పు...."

"మనదేశంలో అయిదు ప్రాంతాల పాకిస్తాన్ ప్రభుత్వం ఆయుధాల కర్మాగారాలు నెలకొల్పింది. వాటిలో తయారయ్యే ఆయుధాలు — టెర్రరిస్టులకు చేరుతున్నాయి...." అన్నాడు ఏజంట్ 127.

"అదెలా సాధ్యం?"

"ఎలా సాధ్యపడిందన్న విషయం తర్వాత ఆలోచించాలి. ముందు వెంటనే ఆ కర్మాగారాలనైడింటిఫై చేయాలి...."

"అందులో కష్టమేముంది?"

"డియర్ డిటెక్టివ్! మనదేశంలో సాధారణ ప్రయోజనాలకు పనికివచ్చే ఆయుధాలను తయారుచేసే కర్మాగారాలు చాలా వున్నాయి. వాటిలో ఓ అయిదు పాకిస్తాన్ ప్రభుత్వానివని యెవరికీ తెలియదు. నాకూ అనుకోకుండా ఈ ఊరొచ్చాకే తెలిసింది...."

"ఎక్కడున్నా యవి?"

"ఆ విషయం తెలియలేదు. కానీ వాటికి ఆదేశాలు పంపుతూ కానిస్తున్న వ్యక్తి గురించి నేను తెలుసుకున్నాను. ఆ వ్యక్తి ప్రభుత్వ రంగంలో ప్రముఖుడుగా చెలామణీ అవుతున్నాడు. విషయం బైటపడితే అతడిట్టే తప్పించుకోగలడు. తన విషయమై సాక్ష్యాలు, రుజువులు లేకుండా చేసి నన్నే తుదముట్టించగలడు...."

కిల్లర్ ఆశ్చర్యంగా—"ఎవరా వ్యక్తి?" అన్నాడు.

"అతడి పేరు చెప్పడం శ్రేయస్కరం కాదు...."

"వివరాలేం తెలుసుకోకుండా నేనేం చేయగలను?"

"నువ్వు చేయాల్సిం దీ పనికాదు—మరొకటి...."

"ఏమిటది?"

"రేపుదయం ఏనిమిది గంటలకు—నిర్ణీత స్థలంలో—సుమారు ఇరవైకోట్లు విలువచేసే బంగారం—విదేశాల నుంచి వస్తుంది....ఆ సమాచారం బ్లా హార్సెస్‌కంటే ముందుగా నేను తెలుసుకున్నాను...."

"ఎలా?"

"బ్లా హార్సెస్‌కు సంబంధించిన ఓ వ్యక్తికి ఆ సమా

చారం అందజేయబడింది. ఆ వ్యక్తిని నేను పట్టాను. అతడు ప్రమాదకరమైన వ్యక్తి కావడంవల్ల నేనతణ్ని తుదముట్టించాల్సి వచ్చింది. అతడి వద్దనే నాకు ఆయుధ కర్మాగారాల విశేషం కూడా తెలిసింది. అది తెలియగానే నాకు కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఈలోగా కొందరు వ్యక్తులు నన్ను వెంటాడారు. నేను పారిపోయి ఈ ఇంట్లో చేరాను. వాళ్ళు లోపలకు రాలేక నాకోసం బయట కాపలా వేశారు. నేను నీకు ఫోన్ చేశాను. ఇప్పుడు నేను ఆ కర్మాగారాల విషయం చూస్తాను. నువ్వు బంగారం పని చూడాలి—" అని ఆగాడు ఏజంటు 127.

కిల్లర్ ఉత్సాహంగా — "ఇరవై కోట్ల బంగారం అంటే—చాలా థ్రిల్లింగ్ వ్యవహారమే...." అన్నాడు.

"థ్రిల్లింగ్ కాదు. ప్రాణాలు పోతాయి. జాగ్రత్తగా ఉండాలి....బ్లూ హార్సెస్‌తో వ్యవహారం...." హెచ్చరించాడు ఏజంటు 127.

"తెలుసు—అందులోనూ వాళ్ళు పాకిస్తాన్ గూఢచారులు కదా!"

"డియర్ డిటెక్టివ్! బ్లూ హార్సెస్ పాకిస్తాన్ గూఢచారి సంస్థ కాదు. అది కేవలం స్మగ్లింగ్ వ్యవహారాలకు సంబంధించిన సంస్థ. ఆ సంస్థకు దళారీలుగా వ్యవహరిస్తున్న మరో సంస్థ మాస్టర్ కీ వుంది."

"నాకు తెలుసు. ఈ ఊళ్ళో మాస్టర్ కీ గురించి నేను కొంత సమాచారం కూడా సేకరించాను...."

"ఎప్పుడు?" అన్నాడు ఏజంటు 127 ఆశ్చర్యంగా.

"విశాలపురం వచ్చేక నీనుంచి కబురులేదు. ఊరికే కూర్చోలేక రంగంలోకి దిగాను. బ్లూ హార్సెస్ గురించి

సమాచారం లేదుగానీ మాస్టర్ కీ గురించి బోలెడు సమాచారం లభించింది. ఆ సంస్థకు సంబంధించిన ప్రముఖులు, సామాన్యులు కూడా కొందరు నాకు తెలిశారు...."

"వెరీగుడ్ వర్క్...." అభినందించాడు ఏజంట్ 127 "అయితే నేనిప్పుడు నీకో ముఖ్య సమాచారం అందిస్తున్నాను. మాస్టర్ కీ ఒక అంతర్జాతీయ సంస్థ. ఆ సంస్థ అవినీతికి పాల్పడినప్పటికీ దేశవిద్రోహకరచర్యలకు పూనుకోదు. ఇంకా చెప్పాలంటే మాస్టర్ కీ సంస్థ వివిధ దేశాల ప్రభుత్వాల మధ్య అంతర్జాతీయంగా రహస్య అవగాహనలకూ, ధనం మార్పిడికీ సహకరిస్తూంటుంది. అందువల్లనే ఆ సంస్థ అన్నిదేశాల్లోనూ విజయవంతంగా నడుస్తోంది.

బ్లూ హార్సెస్ సంస్థ మాస్టర్ కీ నుంచి కొంత సహకారాన్నీ, సహాయాన్నీ పొందింది. కానీ మాస్టర్ కీ సంస్థకు-బ్లూ హార్సెస్ అసలు స్వరూపం తెలిసిపోయింది. దాంతో ఆ సంస్థ బ్లూ హార్సెస్‌కు సాయపడనని చెప్పేసింది. ఫలితంగా రెండింటికీ అభిప్రాయభేదాలు వచ్చాయి. బ్లూ హార్సెస్ తన దళారీలను వేరే నియమించుకోవలసివచ్చింది.

ఆ దళారీలు తమ పనులు చూసుకోవడమేకాక— మాస్టర్ కీకి కూడా యిబ్బంది కలిగించసాగారు. ఉదాహరణకు—ఇప్పుడు నేను చెప్పిన ఇరవైకోట్ల బంగారం మాస్టర్ కీ సంస్థ గురించి వస్తోంది. ఆ సమాచారం అందుకున్న మాస్టర్ కీ సభ్యుణ్ని బ్లూ హార్సెస్ వ్యక్తి హత్య చేశాడు. ఆ బంగారం బ్లూ హార్సెస్‌కి స్వాధీనంచేయాలని అతడి అభిమతం. అతణ్ని నేను పట్టుకున్నాను. హత్య చేశాను. అతడివద్ద అనుకోకుండా ఆయుధ కర్మాగారాల

విశేషం తెలిసింది...."

"చాలా తమాషాగా వుంది ..."

"తమాషాకాదు—ప్రమాదం! ఇప్పుడు నేను నీకు ఇరవైకోట్ల బంగారం చేరే నిర్ణీత ప్రదేశం—అక్కడ చెప్పాల్సిన కోడ్—అన్నీ నీకు చెబుతాను. ఆ బంగారాన్ని నువ్వు స్వాధీనం చేసుకుని ప్రభుత్వానికి అప్పగించాలి. ఈలోగా నేను నా పనిలో ఉంటాను. నీవల్ల నాకు రెండు ప్రయోజనాలు. ఒకటి బంగారం ప్రభుత్వపరం కావడం. రెండు—నా శత్రువుల దృష్టిని తాత్కాలికంగానైనా నానుంచి మళ్ళించడం...."

"అంటే నువ్వీ యింట్లోనే వుండిపోతావా?"

"అవును. నేను బైటకు సందేశాలు పంపుకుని అన్ని యేర్పాట్లూ చేసుకోడానికి కొంత వ్యవధి కావాలి. ఈలోగా నువ్వు బంగారం స్వాధీనం చేసుకోవడం అయిపోవాలి...."

"మళ్ళీ నేను—నిన్నెప్పుడు కలుసుకోను?"

"మనమిద్దరం ప్రమాదకరమైన పనులకు పూనుకున్నాం. ఇద్దరిలో యే ఒక్కరైనా మిగలకపోవచ్చు. ఇద్దరిలో యే ఒక్కరు మిగిలినా—రెండోవారి ఆత్మశాంతికై ప్రార్థనలు జరుపుకుందాం. ఇద్దరూ మిగిలితే—మనమెలా కలుసుకుంటామో నేను నీకు చెబుతాను. ఈ రోజు నుంచి వారంరోజుల తర్వాత నానుంచి నీకే కబురు అందకపోతే నేను లేనట్లే లెక్క........" అన్నాడు ఏజంట్ 127.

"అయితే నాకా ఆయుధ కర్మాగారాల విషయం కూడా చెప్పు. ఎటువంటి ప్రమాదాలనుంచైనా నేను ప్రాణాలతో బైటపడగలనని నా నమ్మకం-" అన్నాడు

కిల్లర్.

"నువ్వు భయపడకు. నా ప్రాణంపోయినా సరే ఆ వార్త చేరవలసిన చోటుకు చేరుకుంటుంది. ఇక నేను చెప్పేది విను—" అన్నాడు ఏజంటు 127.

కిల్లర్ అతడు చెప్పిన వివరాలన్నీ నోట్ చేసుకున్నాడు. ఒకటికి రెండుసార్లు ఏజంటు 127 పోలీసుల సహాయం యేవిధంగా తీసుకోవాలో కూడా చెప్పి—

"పోలీసుల్లో కూడా అందర్నీ నమ్మడానికి లేదు. అందుకే నీకన్నీ చెప్పాల్సి వస్తోంది—" అన్నాడు.

"సరే—ఇక నేను బయల్దేరుతున్నాను...."

"నీవిక్కడికి కాలినడకన వచ్చావు కదూ!"

"అవును ..."

"నీ మొబైల్ వ్యాను గురించి నాకు తెలుసు. అయితే ఈ ప్రయత్నంలో నీకోసం వేరే కారుంది. హోటల్ నటరాజ్ వద్ద పార్కు చేసి ఉంటుందది. నెంబరు APB 127. రంగు నీలం. తాళాలు రిసెప్షనిస్టునడిగి తీసుకో. అది మామూలు కారు కాదు. ఆ వివరాలన్నీ రిసెప్షనిస్టు తాళాలిచ్చినప్పుడు నీకిచ్చే కవర్లో వుంటాయి...."

"సరే—వెడుతున్నాను...." అన్నాడు కిల్లర్.

"ఈ యింటి గేటు దాటిన మరుక్షణం నుంచీ నీకు అడుగడుగునా ప్రమాదం. జాగ్రత్త...." అన్నాడు ఏజంటు 127 హెచ్చరికగా.

# 3

డిటెక్టివ్ కిల్లర్ గేటు దాటి బయటకు వచ్చి చుట్టూ చూశాడు.

ఎక్కడా యెవరూ కనబడలేదు. వీధిలో జనం

మసలుతున్నట్లే లేరు. అయినా అజాగ్రత్తగా లేకుండా వెయ్యి కళ్ళతో పరిసరాలను గమనిస్తూ ముందడుగు వేశాడు కిల్లర్. అయితే అతడినెవ్వరూ అనుసరించికూడా వచ్చినట్లు లేదు.

అలా కొంత ముందుకు వెళ్ళేక కిల్లర్‌కి ధైర్యం పెరిగింది. అతడు సుమారు ఇరవై నిమిషాలు నడిచి హోటలు చేరుకున్నాడు. అక్కడ రిసెప్షనిస్టును పలకరించి— "నాకోసం సందేశాలేమైనా ఉన్నాయా?" అనడిగాడు.

రిసెప్షనిస్టతడికి కారు తాళాలు, కవరు ఇచ్చాడు.

కిల్లర్ కారు తాళాలను పాంటుకున్న రహస్యపుటరలోకి తోసేశాడు. కవరు విప్పి లోపలి ఉత్తరం తీసి చదివాడు. అందులో APB 127 కారుకల్ల సాధించగల బహుళ ప్రయోజనాలు వివరించబడ్డాయి. కిల్లర్ ఆ వివరాలన్నీ తన కంప్యూటర్ బుర్రలోకి పంపించేసి ఉత్తరాన్ని లైటర్‌తో అంటించి నల్లగా మాడిపోయిన కాగితాన్ని పక్కనే వున్న డస్టుబిన్‌లోకి జారవిడిచాడు.

రిసెప్షనిస్టతడి వంక నువ్వుతూ చూసి— "మీరు ఉత్తరాలను కాలుస్తూంటారా?" అన్నాడు.

కిల్లర్ తలూపి— "నాకు ప్రమాదకరమైన ప్రతిదాన్నీ అది ఉత్తరమైనా, మనిషైనా కూడా కాల్చడం నాకలవాటు—" అని అక్కణ్నించి కదిలాడు.

"డైలాగు బాగుంది కానీ ఇది మంచి మనిషి నోట రావలసింది కాదు—" అంటూ అస్పష్టంగా గొణిగాడు రిసెప్షనిస్టు. అతడి గొణుగుడు పూర్తయ్యేసరికి కిల్లర్ రూం నంబర్ పదిహేడులో ప్రవేశించి మంచంమీద వాలాడు.

"ఇప్పుడు తనేం చేయాలి?" అన్నదతడి ఆలోచన.

కిల్లర్ మొత్తం జరిగినదంతా ఆకళింపు చేసుకుని తన కార్యక్రమాన్ని రూపొందించుకుంటున్నాడు. మార్గ మధ్యంలో యెక్కడా ఆటంకం రానిపక్షంలో తను తిన్నగా ఏజంటు 127 సూచించిన పోలీసాఫీసర్ని కలుసుకోవాలి. ఆయన సాయంతో ఇరవైకోట్ల రూపాయలు విలువచేసే బంగారాన్ని స్వాధీన పర్చుకుని ప్రభుత్వపరం చేయాలి

కిల్లర్ ఆలోచిస్తున్నంతసేపూ కళ్ళు మూసుకునే వున్నాడు. ఆలోచన పూర్తికాగానే అతడు కళ్ళు తెరిచాడు. అప్పుడతడి కళ్ళకు కనిపించాడో వ్యక్తి.

ఆయిదడుగుల ఆరంగుళాల ఎత్తు—ఎత్తుకు తగ్గ లావు బుగ్గమీసాలు—క్రూరంగా చూసే కళ్ళు — చేతిలో రివాల్వర్ ....

"బ్రతికే ఉన్నావన్నమాట ...." అన్నాడతడు.

"ఎవరున్నువ్వు?" అంటూ లేవబోయాడు కిల్లర్.

"ఆబ్బే—నువ్వు కదలకూడదు. అలాగే పడుకో. నేనడిగే ప్రశ్నలకు బుద్ధిగా జవాబు చెప్పు—...." అన్నాడు.

"ఎవరున్నువ్వు? లోపలకెలా వచ్చావు?"

"ఇప్పుడు ప్రశ్నించే హక్కు నాకేగానీ నీకు లేదు. అయినా నీ ప్రశ్నల్లో తప్పేంలేదు కాబట్టి చెబుతున్నాను. నా పేరు బ్లూ రాస్కెల్. నేను లోపలకు నాకు మాత్రమే సాధ్యపడే శక్తిసామర్థ్యాలతో వచ్చాను—" అన్నాడతడు.

"ఏమిటి నీకు నాతో పని!"

"రేపీ ఊరు కిరవైకోట్లు విలువచేసే బంగారం

వస్తోంది. దాన్ని స్వాధీనం చేసుకునేందుకు— ఒక్క కోడ్ వర్డ్ కావాలి. అదేమిటో చెప్పు...."

"తర్వాత?"

"బంగారం స్వాధీనం చేసుకునేందుకు నిర్ణీతస్థల మెక్కడ?"

కిల్లర్ నవ్వి— "నా సమాధానం నీకిరవైకోట్ల విలువ చేస్తుంది. మరి నాకేం ప్రయోజనం?" అన్నాడు.

"నీ ప్రాణాలు నిలబడడం...."

"నీవంటివాడి రివాల్వర్ చూసి భయపడి—ఇరవై కోట్ల రూపాయల రహస్యాన్ని కక్కేవాడినే అయితే- నా ప్రాణాలు నిలబడడం అనవసరం...."

"నువ్వు బ్లూ రాస్కెల్‌తో మాట్లాడుతున్నావు.... తెలుసుకో!"

"పేరుకాస్తే విలువ నివ్వను. ఇచ్చేనంటే దెబ్బ తింటావు. నీ పేరు రాస్కెల్ అయితే నా పేరు కిల్లర్ ...."

"నీ పేరు కిల్లర్ కావచ్చు. కానీ నా చేతిలో రివాల్వర్ నన్నే కిల్లర్ని చేస్తుంది...."

"రివాల్వర్ చేతిలో వున్నవాళ్ళంతా కిల్లరయితే— నేను కిల్లరని పేరెందుకెట్టుకున్నట్లు?" అని నవ్వాడు కిల్లర్.

"ని ధైర్యానికి అభినందిస్తున్నాను. కానీ ధైర్యంతో ప్రాణాలు నిలబెట్టుకోలేవు. అనుభవంమీద చెబుతున్నాను. నా మాటను కాదంటే—ఇవే మాటలు నువ్వు కామరాజు, సలీం, ఎడ్వర్డ్‌లనుంచి కూడా వినాల్సి ఉంటుంది...."

"వాళ్ళెవరు?"

"నా మాటలు అడ్డుపెట్టకుండా ధైర్యం చేసిన కారణంగా ప్రస్తుతం స్వర్గంలో ఉన్న వాళ్ళు...."

కిల్లర్ అదోలా అతడివంక చూసి — "మైడియర్ బ్లూ రాస్కెల్! నీ గురించి నీకు తెలిసిందంతా నాకు చెప్పావు. నా గురించి యేమైనా నానుంచే తెలుసుకోవాలనుందా లేక సుబ్బారాయుడు, అల్లాఉద్దీన్, థామస్‌ల నుంచి వినాలనుందా?" అన్నాడు.

"వాళ్ళెవరు?"

"అంతర్జాతీయ నేరస్థులమని అంతు లేని గర్వం వాళ్ళకి. అభివృద్ధి చెందిన అమెరికావంటి దేశాలనే గడగడలాడించిన వాళ్ళిప్పుడు టీహార్ జెయిల్లో ఉన్నారు-"

బ్లూ రాస్కెల్ కిల్లర్ వంక తీక్షణంగా చూశాడు.

కిల్లర్ అతడికి చూపులతోనే బదులిస్తూ లేచి కూర్చున్నాడు.

"కదలొద్దని చెప్పాను.." అన్నాడు బ్లూ రాస్కెల్ కోపంగా.

"రహస్యం తెలుసుకోకుండా నన్ను చంపలేవని నాకు తెలుసు...."

"క్రమశిక్షణ ముఖ్యం నాకు. చెప్పినమాట వినకపోతే రహస్యం గురించి ఆలోచించకుండా కాల్చేయగలను..."

"నీ క్రమశిక్షణ యేమిటో—నీ పేరునుబట్టే తెలుసుకున్నాను...."

"మిస్టర్! ఇక డైలాగ్స్ కట్టిపెట్టి నేనడిగిందానికి చెప్పు. నాకా్కవలసిందల్లా స్థలం పేరు—కోడ్ వర్ ...."

"స్థలం పేరు నేతాజీ పార్కు. కోడ్ వర్డు—"దేశానికి భోజనం కాదు—దేశాన్ని భోజనం చేయడం నా అలవాటు....—"

బ్లూ రాస్కెల్ చిరాగ్గా — "కోడ్‌వర్డు అంటే ఒక్కటే పదం. నువ్వు చెప్పింది కోడ్ సెంటెన్స్...." అన్నాడు.

"నాకు తెలిసింది నేను చెప్పాను — ఆపైన నీ యిష్టం...."

"అంత సులభంగా నేను నిన్ను వదలను. రేపు ఇరవై కోట్ల రూపాయల బంగారం స్వాధీనం చేసుకునేదాకా నిన్ను నాకూడా ఉంచుకుంటాను...."

"ఉంచుకుంటానంటే మాత్రం నేను రావద్దూ?"

"ఈ రివాల్వర్ నిన్ను నాకు బానిసను చేసింది. కాదంటావా?"

"అంటాను—" అంటూ మెరుపు వేగంతో కదిలాడు కిల్లర్. క్షణాలమీద రాస్కెల్ చేతిలోని రివాల్వర్ క్రిందపడింది.

"నా దగ్గర ధైర్యం చేయడం ప్రమాదమని ముందే చెప్పాను. బుద్ధిగా రివాల్వర్ తీసి నాకివ్వు-నా బానిసవు కదూ!" అన్నాడు బ్లూ రాస్కెల్.

కిల్లర్ రివాల్వర్ అందుకుని—"ఇప్పుడు నువ్వు నా బానిసవు. కాదంటావా?" అన్నాడు.

బ్లూ రాస్కెల్ తల అడ్డంగా ఊపి—"వెర్రివాడా! ఆ రివాల్వర్లో బులెట్లు లేవు. కావాలంటే పేల్చిచూడు" అన్నాడు.

కిల్లర్ తెల్లబోయి—"ట్రిక్ చేశావన్నమాట— అయినా నీబోటివాణ్ని లొంగదీసుకునేందుకు నాకు ఆయుధాల అవసరంలేదు. నా చేతుల పస చూపిస్తాను" అన్నాడు.

"చూడు—ఈ గదిలో నాతోపాటు నా మనుషులు

మరో నలుగురున్నారు. ఈ గదిలోంచి నువ్వు బయటపడకుండా కాపలాకాయడమే కాదు—వాళ్ళ రివాల్వర్లు నీవైపే గురిపెట్టబడి ఉన్నాయి. అన్నట్లు—ఆ రివాల్వర్స్‌లో తూటాలున్నాయి...."

కిల్లర్ చుట్టూ చూశాడు. ఎవరూ కనిపించలేదు.

బ్లూ రాస్కెల్ చాలా తెలివైనవాడిలాగున్నాడు. తన సామర్థ్యమతడికి తెలిసే ఉండాలి. లేకుంటే తూటాలులేని రివాల్వర్‌తో తన్ను బెదిరించడు. తను మెరుపుదాడిచేసి రివాల్వర్ లాక్కున్నా బ్లూ రాస్కెల్‌కు ప్రమాదం లేదు.

ఇప్పుడు గదిలో నిజంగా మరో నలుగురు మనుష్యులున్నారా? బ్లూ రాస్కెల్ దబాయిస్తున్నాడా?

"నీ అనుమానం నాకు తెలుస్తోంది. అనవసరపు రక్తపాతం తప్పించడానికి నీ సందేహం తీరుస్తాను. ఈ గదిలోని ఒక వస్తువు పేరు చెప్పు. ఏం జరుగుతుందో చూడు...." అన్నాడు బ్లూ రాస్కెల్.

కిల్లర్ వెంటనే—"అదిగో ఆ టీపాయ్‌మీద యాష్ ట్రే పేరు చెబుతున్నాను...." అన్నాడు.

అంతే—మరుక్షణం అది పేలిపోయింది.

కిల్లర్ అదిరిపడ్డాడు. బ్లూ రాస్కెల్ కదలలేదు. కానీ యాష్‌ట్రే పేలిపోయిందంటే అతడు చెప్పింది నిజమేనన్నమాట....

"మావాడి ఉనికికి ఋజువు చూశావు. వాడి గురి కూడా తెలుసుకున్నావు కదా—ఇక నీ మొండితనం కట్టిపెట్టి నా ప్రశ్నలకు బదులు చెప్పు...." అన్నాడు బ్లూ రాస్కెల్.

"చెప్పకపోతే?"

"మిస్టర్! నా సమయం వృథా చేయకు. మేమంతా నీకంటే ఎన్నో రెట్లు శక్తిమంతులం. అయినా చిన్న పాముకైనా పెద్ద కర్రతో కొట్టాలనీ పిచ్చుకమీదకైనా బ్రహ్మాస్త్రం వేయాలనే అనుకునే తత్త్వం మాది. మాకు అహంకారం లేదు. అందుకని మా శక్తిని తక్కువ అంచనా వేయకు. దెబ్బతింటావు. నీవు నా రివాల్వర్ని పడగొట్టే అవకాశముందని నాకు తెలుసు. నీవీ గదిలోంచి పారిపోతావనీ నాకు తెలుసు. అన్నింటికీ యేర్పాట్లు చేసి ఉంచుకున్నాను.

నీకోసం ఒకటికాదు—రెండుకాదు....కొన్ని వందల వలలు వేసి వుంచాను. నువ్వు తప్పించుకోలేవు. నువ్వు తప్పించుకునే అవకాశాలన్నింటినీ ఊహించివేసిన మా పథకం అద్భుతమైనది. కాబట్టి మర్యాదగా మాతో రా—మాకు సహకరించు...."

"అందువల్ల నాకు ప్రయోజనం...."

"నీ ప్రాణాలు నీకు దక్కుతాయని ముందే చెప్పాను. నీ ప్రాణాల విలువ నీకు తెలిసినట్టులేదు కనుక—తోడుగా ఓ లక్షరూపాయలు కూడా బహుమతిగా యిస్తాను...." అన్నాడు బ్లూ రాస్కెల్.

"లక్షరూపాయలా—అంటే కోటికి అయిదు వేలన్న మాట!"

"మరి ప్రాణాలో—వాటి విలువ కట్టలేదు నువ్వు?"

"నీ దృష్టిలో నా ప్రాణాలెంత విలువ చేస్తాయి?"

బ్లూ రాస్కెల్ నవ్వి—"నా దృష్టిలో నీ ప్రాణాలు పైస విలువ కూడా చేయవు! నేను చెప్పే విలువ నీ దృష్టిలో! ఇక కబుర్లు కట్టిపెట్టి మాతో రా—" అన్నాడు.

"వచ్చాను. బాత్ రూం...." అన్నాడు కిల్లర్.

"బాత్ రూంలో మా మనిషున్నాడు. త్వరగా వెళ్ళి రా!"

"మనిషుంటే ఎలా?" అన్నాడు కిల్లర్.

బ్లూ రాస్కెల్ గట్టిగా—"మైడియర్ బాత్రూం! నువ్వు బయటకు రా—" అన్నాడు.

అప్పుడు బాత్రూం తలుపులు తీసుకొని ఓ వ్యక్తి బయటకు వచ్చాడు. అతడు నల్లగా నీగ్రోలా వున్నాడు. ఎత్తు. బలం సమతూకంగా ఉన్నాయి. చేతిలో రివాల్వరుంది.

"బాత్రూంలోంచి బైటకుపోయే దారేమీ లేదు...." అన్నాడతడు బ్లూ రాస్కెల్ నుద్దేశించి.

"సరే—నువ్వు వెళ్ళు. అయిదంటే అయిదు నిమిషాల్లో వెనక్కి రావాలి.." అన్నాడు బ్లూ రాస్కెల్.

"రాకపోతే?"

బ్లూ రాస్కెల్ నవ్వి—"కొన్ని ప్రశ్నలకు సమాధానాలుండవు. ఊహించుకోవాల్సిందే!" అన్నాడు.

"సరే—నాకు అయిదునిమిషాలు కూడా అవసరం లేదు. మూడంటే మూడు నిమిషాలు చాలు...." అంటూ కిల్లర్ బాత్రూంలో ప్రవేశించి లోపల్నుంచీ తలుపులు వేసుకున్నాడు.

అక్కడ అతడు క్షణం కూడా వృథా చేయలేదు. తిన్నగా టాయిలెట్ బౌల్ వద్దకు వెళ్ళాడు. దాన్నోసారి పట్టుకుని యెడమనుంచి కుడివైపుకి తిప్పాడు. వెంటనే పక్కగోడలో మనిషి పట్టేటంత కంత యేర్పడింది. కిల్లర్ ఆ కంతలోనికి వెళ్ళాడు. అందులోంచీ క్రిందకు

మెట్లున్నాయి.

అతడా మెట్లు దిగేసరికి గోడలోని కంత మూసుకు పోయింది. టాయ్‌లెట్ బౌల్ యథాప్రకారం వెనక్కి తిరిగింది. మెట్లు కిల్లర్ని ఓ చిన్నగదిలోకి చేర్చాయి. ఆ గది తలుపులు తీసుకుని బయటకు వచ్చేడతడు. అది హోటల్ నటరాజ్ రిసెప్షన్ హాలు.

కిల్లర్ ఏజంట్ 127 ని మనసులోనే అభినందించు కున్నాడు. హోటల్ నటరాజ్‌లో రూం నంబర్ పది హేడులో ప్రత్యేకమైన యేర్పాట్లున్నాయంటే—ఈ హోటలుకీ—ప్రభుత్వ గూఢచారి శాఖకీ యేమో సంబంధ ముండి వుండాలి.

బాత్రూంలోంచి రిసెప్షన్ హాల్లో ప్రత్యక్షం కావ డానికి కిల్లర్‌కి మూడు నిమిషాలు కూడా పట్టలేదు. అతడు క్షణం కూడా జాప్యం చేయకుండా కారు పార్కింగ్ స్థలానికి వెళ్ళాడు. నీలిరంగు APB 127 అతడికి వెంటనే కనపడింది. కిల్లర్ జాప్యం చేయకుండా కారు తాళాలు జేబులోంచి తీశాడు.

అతడు కారెక్కి స్టార్టు చేయడానికెంతోసేపు పట్ట లేదు.

బ్లూ రాస్కెల్ చెప్పిందే నిజమైతే అతడు తను చేయబోయే ప్రతికార్యానికీ అడ్డు తగుల్తాడు. ఇప్పుడు కూడా తననెవరైనా గమనిస్తున్నారా?

ఏది యేమైనా ముందుగా తనిప్పుడు బ్లూ రాస్కెల్ నుంచి పారిపోవాలి. ఇరవైకోట్ల బంగారాన్నీ—తనే స్వయంగా సాధించాలి. అర్జంటుగా ముందు పోలీసులకు కబురు తెలియచేయాలి.

# 4

బ్లూ రాస్కెల్ మాత్రం తలుపులవైపే చూస్తున్నాడు. కిల్లర్ తలుపులు వేసుకుని మూడునిముషాలయింది.

కిల్లర్ బుద్ధిగా వెనక్కి తిరిగివస్తాడా లేక తన్ను మోసం చేస్తాడా—అని అతడాలోచిస్తూండగానే అతడి చేతిలోని వాకీటాకీ మ్రోగింది. చటుక్కున రిసీవర్ తీసుకుని—"ఏమిటి?" అన్నాడు.

"డిటెక్టివ్ కిల్లర్ రిసెప్షన్ హాల్లోకి వచ్చాడు. మీరు వదిలేశారా—అతడు తప్పించుకుని వచ్చాడా?" అందో గొంతు.

"వ్వాట్—" అని ఉలిక్కిపడి—"నువ్వాణ్ణే కనిపెట్టి ఉండు. అతడు చేయిదాటి పోతూంటే మన వాళ్ళను కూడా పంపించు-" అన్నాడు బ్లూ రాస్కెల్.

"ఓకే—" అందవతలి గొంతు.

"నేనిప్పుడే కిందకు వస్తున్నాను—" అంటూ రిసీవర్ని జేబులోకి తోసేశాడు బ్లూ రాస్కెల్. తర్వాత హడావుడిగా నల్లటి వ్యక్తి వంక చూసి—"నువ్వు బాత్రూం తలుపులు బలవంతంగా తెరిచిచూడు. లోపల కిల్లర్ లేకపోతే నాకా విషయం తెలియబర్చు. ఉంటే వెంటబెట్టుకుని కిందకురా. ఈ గదిలో కంటికి కనిపించకుండా మరో ముగ్గురు నిన్ను కాపాడుతూంటారు. ధైర్యంగా ఉండు.... నేను వెడుతున్నాను. అది నిజమో కాదో తెలియదు కానీ—కిల్లర్ పారిపోతున్నట్లు కబురొచ్చింది.." అనేసి గదిలోంచి బైటికి వెళ్ళిపోయాడు.

అతడు కిందకు వెళ్ళేసరికి ఓ వ్యక్తి రిసెప్షన్ హాల్లో అతణ్ణి పలకరించి—"మన APR 9-8 కిల్లర్ననుసరించి వెళ్ళింది. మనం కూడా వెడదామా?" అన్నాడు.

"ఆ వెళ్ళింది కిల్లరేనా? లేక అతడి డూపా?" అన్నాడు బ్లూ రాస్కెల్.

"ఏమో మరి—అచ్చం కిల్లర్లాగే వున్నాడు...." అంటూ అతడు ముందుకు నడిచాడు.

ఇద్దరూ పార్కింగ్ స్థలానికి వెళ్ళారు.

"మనం బయల్దేరుదామా?" అంటూ ఓ కార్లోకి వెళ్ళాడా వ్యక్తి.

బ్లూ రాస్కెల్ యేదో అనేలోగా అతడి జేబులో చిన్నగా శబ్దమయింది. బ్లూ రాస్కెల్ వాకీటాకీ రిసీవర్ తీసుకొని దానికి ఇయర్ ఫోన్ ఫిక్స్ చేశాడు.

"తలుపు బద్దలు కొట్టారు. గదిలో కిల్లర్ లేడు. ఎలా మాయమయ్యాడో తెలియడంలేదు—" అందవతలి గొంతు.

"సరే—నువ్వు వెళ్ళిపోవచ్చు. ప్రస్తుతానికి నీతో పనిలేదు. నీకు రక్షణగా ఉన్నవాళ్ళని కూడా వెళ్ళి పొమ్మని చెప్పు. నేను వెడుతున్నాను...." అన్నాడు బ్లూ రాస్కెల్. అతడీ మాటలంటున్నప్పుడు చూసే వాళ్ళకు కార్లోని వ్యక్తితో మాట్లాడుతున్నాడన్న అభిప్రాయం కలుగుతుంది.

"ఏమంటాడు మన బ్లాక్ హీరో?" అన్నాడు కార్లోని వ్యక్తి.

"కిల్లర్ పారిపోయాడు. నువ్వు చూసింది డూప్ ని కాదు...."

"మనిషి అసాధ్యుడిలాగున్నాడే—" అన్నాడు కార్లోని వ్యక్తి.

"మనకంటే అసాధ్యుడు కావడానికి వీల్లేదు. ఈ కార్లో మన APR 978 ట్రాకవుతుందిగా—ఆ సిగ్న

ల్సను బట్టి పోనీయ్....”

“ఓ.కే.—....”

బ్లూ రాస్కెల్ వున్న కారు స్టార్టయింది.

## 5

కిల్లర్ రియర్ వ్యూలో తననుసరించి వస్తున్న కారుని గమనించాడు.

అది ఎంత ప్రయత్నించినా తన కారును పట్టి వదలడంలేదు. దాని బారినుంచి తప్పించుకోవాలని అతడు తన కారును చాలా సందులు తిప్పాడు. ఎన్ని సందులు తిరిగినా ఆ కారు తన్ను వదలడంలేదు.

అలా కాసేపు గడిచేసరికి—ఒకటికి రెండు కార్లయినట్లు గుర్తించాడతడు. వందగజాల వెనుకనున్న వ్యక్తుల్ని కూడా స్పష్టంగా చూసే సదుపాయముండడంవల్ల—రెండో కార్లో బ్లూ రాస్కెల్ ఉన్నట్లు గుర్తించాడు కిల్లర్.

బ్లూ రాస్కెల్ సామాన్యుడు కాదు. అతడు తన్ను వదలడు. అతడిబారినుండి బంగారాన్ని కాపాడ్డం తన వల్లనవుతుందా అన్న అనుమానం కిల్లర్ని పట్టుకుని వేధిస్తోంది.

విశాలపురం పేరుకు తగ్గట్లే విశాలమైన నగరం. కధి పాత పల్లెటూరు ఆధారంగా నిర్మించబడ్డ కారణంగా ఆ ఊళ్ళో విసిరేసినట్లుగా రకరకాల కాలనీలున్నాయి. ఒక ప్రాంతానికీ మరో ప్రాంతానికీ మధ్య కిలోమీటర్ల దూరముండడమేకాక మధ్య రోడ్లు నిర్మానుష్యంగా కూడా వుంటాయి. ఎవరైనా తనకెదురుపడి అటకాయిస్తే బుద్ధి చెప్పాలని అనుకున్నాడు కిల్లర్. కానీ ముందే అన్నీ తెలిసినవాడిలా బ్లూ రాస్కెల్ అందుకు తలపడలేదు.

వెనుకనుంచి కారు టైర్లను పేల్చే ప్రయత్నం చేశారు బ్లూ రాస్కెల్ బృందం. కాని కారు టైర్లు బులెట్ ప్రూఫ్ కావడంవల్ల ఆ ప్రయత్నాలు ఫలించ లేదు.

ఉన్న కొద్దిరోజుల్లోనూ కిల్లర్ విశాలపురం నైసర్గిక స్వరూపాన్ని బాగా ఆకళింపు చేసుకున్నాడు. కారు పారుచేసేముందు అతడు తన ప్రయాణ మార్గాన్ని నిర్ణయించుకున్నాడు. అంత త్వరగా బ్లూ రాస్కెల్ మనుషులు తన్ను తరుముతారని అనుకోకపోయినా అందుకు సిద్ధపడే ఉన్నాడతడు.

ఏదో సమయంలో తను బ్లూ రాస్కెల్ కన్నుగప్పాలి. అందుకతడి మెదడులో పథక మొకటి సిద్ధంగా వుంది. అందుకే అతడు కారును రైల్వేలైనున్న వీధిలోంచి పోనిస్తున్నాడు. ఆరోజు ఆ సమయంలో రావలసిన ట్రయిన్ సరైన సమయానికే వస్తోందని అతడికి తెలుసు. కాబట్టి రైల్వేగేటుకూడా సరైన సమయానికే మూత పడుతుంది. గేటు మూతపడడానికి కొద్ది సెకన్లముందా వీధిలో అతడు ప్రవేశించాడు. ఆగకుండా ప్రయాణంచేస్తే తను రైల్వేగేటు దాటి పోగలడు. కానీ తననను సరించి వస్తున్న కార్లు రైల్వేగేటుకవతల ఉండిపోతాయి.

కిల్లర్ అటువంటి పథకంలో వుంటాడని బ్లూరాస్కెల్ ఊహాకందడం కష్టం. కానీ....

కిల్లర్ కారు రైల్వేగేటుకు వందగజాల దూరంలో ఉండగా చటుక్కున ఓ వ్యక్తి రోడ్డుకడ్డంగా పడుకున్నాడు.

జరిగిందానికి కిల్లర్ ఆశ్చర్యపోయాడు.

తను ముందుకు వెళ్ళాలంటే కారు మనిషిమీంచీ

పోవాలి. క్షణకాలం తను కారాపితే రైల్వేగేటు మూత పడిపోతుంది. రెండు కార్లు తనని సమీపిస్తాయి. తను తప్పించుకోవడం అసాధ్యం.

ఆలోచించడానిక్కూడా వ్యవధిలేదు కిల్లర్ కి. అతడు కారులో ఓ మీట నొక్కాడు. ఆ వెంటనే యాక్సిల రేటర్ బలంగా నొక్కాడు.

నేలమీద పడుకున్న వ్యక్తిని కారు సమీపించింది. ఆ వ్యక్తి కదలలేదు. మెదలలేదు. కిల్లర్ గుండె చిక్క బట్టుకున్నాడు.

అప్పుడు కార్లోంచి—రెండు హెడ్ లైట్సుకీ మధ్య స్థలంనుంచి రెండు హేండిల్సు ముందుకు వచ్చాయి. ఎవరో శాసించినట్లుగా అవి నేలమీద పడుకున్న మని షిని పైకి లేపాయి.

కారు మాత్రం ఆగ లేదు. అది రైల్వేగేటును దాట గానే గేటు మూతపడింది. గేటుకవతల రెండుకార్లు ఆగిపోయాయి.

కిల్లర్ తేలికగా ఊపిరిపీల్చుకున్నమాట నిజం. కానీ అతడు రిలాక్సవలేదు. తననింకా యెవరో తరుముకు వస్తు న్నట్లే అతడు కారును ముందుకు పోనిచ్చాడు. ఎవరికో తిప్పదారి పట్టించాలన్నట్లుగా అతడు కారును సందులు గొందులు తిప్పి ఓ యింటిముందాగాడు. తను కారు దిగి డోర్ లాక్ చేసి ఇంజను ముందుకు వచ్చాడు. అక్కడ కారుకున్న ఇనుపహస్తాల్లో ఆ మనిషి గిలగిలలాడుతు న్నాడు. కిల్లర్ అతణ్ని విడిపించి హేండిల్సును లోపలకు తోసేశాడు.

ఆ వ్యక్తి కాస్త శ్రమపడి లేచి నిలబడ్డాడు.

కిల్లర్ అతణ్ని పలకరించలేదు. చేత్తో బలంగా ఇంటి

గుమ్మం దాకా ఈడ్చుకెళ్ళి అక్కడ కాలింగ్ బెల్ మ్రోగించాడు.

తలుపుకు నేమ్ ప్లేటుంది. ఎస్. పద్మావతి, సోషల్ వర్కర్ అని వ్రాసుందక్కడ.

కిల్లర్ ఓ చేత్తో ఆ వ్యక్తిని గట్టిగా పట్టుకుని వున్నాడు.

తలుపులు తెరుచుకున్నాయి.

సుమారు ముప్ఫైయేళ్ళ యువతి గుమ్మంలో కనబడింది. ఆమె బయటి దృశ్యం చూసి తడబడింది.

“మేడమ్—మీరు పద్మావతి అనుకుంటాను. మీరు సోషల్ వర్కర్. నాకు సాయపడితే మీవల్ల సమాజానికి ఎనలేని సేవ జరుగుతుంది. మేము లోపలకు రావచ్చా?” అన్నాడు కిల్లర్.

ఆ యువతి గుమ్మానికడ్డం తప్పుకుంది.

కిల్లర్, ఆ వ్యక్తిని లోపలకు తోసి—తనూ లోపలకు వెళ్ళాడు. అప్పుడు తలుపులు వేసి ఆ యువతితో—“ఇతడు బ్లూ హార్స్ అనే ప్రమాదకరమైన సంస్థకు చెందిన వ్యక్తి. ఇతణ్ణి బందీని చేసి కాసేపు మీ యింట్లో ఉంచుతాను—” అన్నాడు.

ఆ వ్యక్తి వెంటనే—“అయ్యో! నేనెవరి మనిషినీ కాదు. ఈ రోజుదయంనుంచీ నేను రైల్వేగేటు దగ్గర వున్నాను. గేటు మూతబడే సమయంలో యే కారైనా వేగంగా వస్తూంటే రోడ్డుకడ్డంగా పడుకోమని ఓ మనిషి చెప్పాడు. అందుకు వందరూపాయలు ప్రతిఫలంగా యిచ్చాడు—” అన్నాడు.

“ఎవరా మనిషి?”

“అతడెవరో నాకు తెలియదుకానీ చూస్తే గుర్తుపట్ట

గలను...."

"బందరూపాయలకోసం రోడ్డుకడ్డంగా పడుకుంటే-నీ ప్రాణాలుపోతే—ఏమవుతావు?" అన్నాడు కిల్లర్.

"నా ప్రాణాలకేమీ ప్రమాదముండదని ఆ మనిషి హామీనిచ్చాడు...."

"ఆ హామీని నువ్వెలా నమ్మావు? పోయే ప్రాణాలు నీవిగానీ అతడివి కాదుకదా!"

"అతడి మాటను నమ్మడంవల్ల నా ప్రాణాలు నిల బడతాయన్న ఆశ ఉంది. నమ్మినా నమ్మకపోయినా అతడిమాట నేను వినితీరాలి. లేకుంటే నా ప్రాణాలు పోతాయి—" అన్నాడా వ్యక్తి.

"సరే—నీ గురించి తర్వాత విచారిస్తాను-" అన్నాడు కిల్లర్. ఆ యువతి సాయంతో అతడా వ్యక్తికి కాళ్ళూ చేతులు కట్టేసి ఓ గదిలో ఉంచాడు.

"మీ రెవరు?" అందా యువతి.

"నా పేరు కిల్లర్—నేనొక డిటెక్టివును...."

"మీ పేరు విన్నాను...." అందామె.

"నాకెంత పాప్యులారిటీ వుందో తెలియదు. ప్రస్తుతం నాకెంతో వ్యవధిలేదు. ఒక ముఖ్య సమాచారా న్నందజేయడం కోసం నమ్మకమైన వ్యక్తికోసం ఎదురు చూస్తూ—మీ నేమ్ ప్లేట్ చూసి ఈ యింటిముందా గాను. మీ దగ్గర నేను రహస్యం దాచదల్చుకోలేదు. ఒక అర్జంటు సమాచారాన్ని మీరు నేను చెప్పిన చిరు నామాకు చేరవేయాలి...." అన్నాడు కిల్లర్.

"చెప్పండి...."

కిల్లర్ ఆమెకు బ్లూ హార్స్, మాస్టర్‌కీ సంస్థల గురించి క్లుప్తంగా చెప్పి—"రేపుదయం తొమ్మిది గంటలకు

కారనా డ్రైక్లీనర్స్ షాపులో మేనేజర్ని కలుసుకుని కోడ్ వర్డ్ చెప్పి ఇరవై కోట్ల రూపాయల బంగారం స్వాధీనం చేసుకోవాలన్న సందేశాన్ని మీరు నేను చెప్పినచోట అందజేయాలి. కోడ్ వర్డ్—మర్రిచెట్టు....” అన్నాడు.

పద్మావతి ఆశ్చర్యంగా—“మీరు నన్నెలా నమ్ముతున్నారు? ఇరవై కోట్ల రూపాయల బంగారమనగానే యెవరికైనా ఆశ పుడుతుంది....” అంది.

“మిస్ పద్మావతీ! నాకు మనుషుల ఎన్నిక బాగా తెలుసు. రేపు—అదే సమయానికి నేనూ అక్కడ వుంటాను. మీరు అత్యాశకుపోతే అదుపు చేయడం నాకు కష్టంకాదు. మీలాంటి సోషల్ వర్కర్స్ పోలీసులకు, ప్రభుత్వానికీ సాయపడడంవల్ల పేరు ప్రతిష్ఠలూ సంపాదించుకుంటారు. మీకు మంచి బహుమతీ ఉంటుంది ...”

పద్మావతి నవ్వి—“నాలాంటి సామాన్యులకు ఇరవై కోట్ల రూపాయల బంగారం కంటె—పదివేలరూపాయల బహుమతి తీసుకోవడంలోనే సుఖముంది. మీ మనుషుల ఎన్నికను నేనభినందిస్తున్నాను—” అంది.

“మరి నేను వెళ్లాలి. నా కారుకోసం బ్లూ హార్స్ మనుషులు వెదుకుతూంటారు. వాళ్ళు మీ యింటిని గుర్తించేలోగా నేనిక్కణ్ణించి వెళ్ళిపోవాలి. మీరు మాత్రం నా పని చేస్తారుకదూ! బహుమానం పదివేలకు మించే వుంటుంది—” అన్నాడు కిల్లర్.

“ష్యూర్-మరి నా యింట్లోని మనిషినేం చేయను?”

“ఇంట్లో వుంచుకుందుకు మీకు భయంగా వుంటే పోలీసులకప్పగించండి. నేనతణ్ణింకా కొన్ని ప్రశ్నలు

వేయాల్సి వుంది...."

"సరే—అతణ్ని పోలీసులకప్పజెబుతాను. నాకా మనిషంటే భయంలేదు—కానీ తిండీతిప్పలు లేకుండా అతడిసలా వదిలిపెట్టలేంగదా! పోనీలెండి పెడదామన్నా పాలు పోద్దామని పాము దగ్గరకు వెడితే కాటేయదన్న గ్యారంటీ యేమిటి?" అంది పద్మావతి.

"యాజ్ యూ లైక్—ఒకే—టాటా....బైబై.." అంటూ కిల్లర్ ఆ ఇంట్లోంచి బైటకువచ్చి మళ్ళీ కారెక్కాడు.

అయితే ఆ తర్వాత అతడెంతోసేపు స్వతంత్రంగా లేడు. అతడు కొన్ని సందులు తిరిగి—ఓ దారిన వెడుతూండగా ఒక్కసారిగా నలువైపుల నుంచీ అతణ్ణి కార్లు చుట్టుముట్టాయి. ఒకటి కాదు—రెండు కాదు. ఒక నాలుగురోడ్ల కూడలిలో రోడ్డుకి రెండేసి చొప్పున మొనిమిది కార్లతణ్ని అటకాయించాయి. కిల్లర్ వేరే దారిలేక కార్లోంచీ బయటకు వచ్చాడు.

అతణ్ని సమీపించాడు మరో కార్లోంచి దిగివచ్చిన బ్లూ రాస్కెల్.

"అయాం సారీ!" అన్నాడు కిల్లర్.

"బట్—అయాం హాపీ—" అన్నాడు బ్లూ రాస్కెల్.

"ఎందుకు?" అన్నాడు కిల్లర్ ఆశ్చర్యంగా.

"సరైన ప్రత్యర్థులు లేక విసిగిపోయాను నేను. ఏ పని తలపెట్టినా క్షణాలమీద పూర్తిచేయడం నా అలవాటు ఒక పని పూర్తిచేయడానికి నూరు మెట్లు దాటి నిర్ణయిస్తాను. కానీ మొదటి మెట్టులోనే నా పనులైపోతాయి. నన్ను రెండో మెట్టుదాకా నడిపించినవారే

లేకపోయారు. ఇన్నాళ్ళకు నువ్వు నన్ను మెట్లు దాటి స్తున్నావు. అందుకు నా అభినందనలు.

నీకు నీ శక్తిసామర్థ్యాలపై అపారమైన నమ్మకముందని నాకనిపిస్తోంది. ఈపాటికి నువ్వు నా శక్తిని అంచనా వేసివుంటావు. బ్లూ హార్సెస్ సంస్థలో నేను ఉత్తర కుమారుడి వంటి వాణ్ని. నన్ను మించిన భీమార్జునులు నన్ను నడిపిస్తున్నారు. ఈ విషయాన్ని నువ్వు దృష్టిలో వుంచుకుని నాతో రావాలి. నువ్వెక్కడికి వస్తున్నావో నీకు తెలియదు. తెలుసుకుందుకు నీవు ప్రయత్నించ కూడదు—" అన్నాడు బ్లూ రాస్కెల్.

కిల్లర్ మాట్లాడకుండా బ్లూ రాస్కెల్ కారె క్కాడు. కార్లో కూర్చున్నాక అతడికి స్పృహ తెలియదు. స్పృహవచ్చేసరికతడో గదిలో మంచంమీద వున్నాడు. మంచం చుట్టూ నలుగురు మనుషులున్నారు. వారిలో బ్లూ రాస్కెల్ లేడు.

"ఎవరు మీరు?" అన్నాడు కిల్లర్.

"వియార్ బ్లూ హార్సెస్...." అన్నాడు వారిలో ఒకడు.

"నాతో మీకేమిటి పని?"

"ఇగ్ వెకోట్ల రూపాయల బంగారం—కోడ్ వర్డు— నిర్ణీతస్థలం — త్వరగా చెప్పు. అబద్ధం చెబితే నీకే ప్రమాదం కాబట్టి నిజం చెప్పు—" అన్నాడు వారిలో ఒకడు.

"అబద్ధం చెబితే నాకేలాంటి ప్రమాదం?" అన్నాడు కిల్లర్.

"అదిగో—ఆ గోడకు వ్రేలాడుతున్న గడియారం కనపడుతోంది గదా—అది గడియారం మాత్రమే కాదు.

కంప్యూటరైజ్డ్-గన్ కూడా. నువ్వు నిజం చెప్పినంత సేపూ నీకేమీ ఫరవాలేదు. నువ్వు చెప్పే ఒకో అబద్ధం ఆ గడియారాన్ని ప్రేరేపింపజేస్తుంది. ఫలితంగా గన్ పేలుతుంది. దాని గురి ప్రోగ్రాం ప్రకారం నడుస్తుంది. అంటే ఒక గుండు నీ కన్ను పోగొడితే మరో గుండు నీ కాలు పోగొడుతుంది. నువ్వు క్రమంగా వికలాంగుడివై పోతావు తప్ప నీ ప్రాణాలు పోవు...."

"నా అబద్ధాలను తెలుసుకోగలిగిన కంప్యూటర్ నిజాలను తనకు తానై మీకు చెప్పలేదా? మళ్ళీ నేనెందుకు?" అన్నాడు కిల్లర్.

"అబద్ధం చెప్పేటప్పుడు మనిషి నరాలొక ప్రత్యేక పద్ధతిలో కంపిస్తాయి. కంప్యూటరా కంపనాన్ని గ్రహించగలదు. అందుకే అది అబద్ధాన్ని తెలుసుకో గలదు తప్ప నిజాన్ని చెప్పలేదు...."

కిల్లర్ తన చుట్టూ వున్న నలుగురి వంకా చూశాడు. నలుగురూ చూడ్డానికొక్కలాగే కనబడుతున్నారు. నలుగురూ గ్రే కలర్ సూట్లో ఉన్నారు. నలుగురి ముఖాలకూ ఒకేలాంటి గుబురు మీసాలున్నాయి. నలుగురూ ఒకేలాంటి నల్ల కళ్ళద్దాలు ధరించారు. నలుగురూ ఒకే ఛాయలో వున్నారు.

"స్థలం శారదా డ్రైక్లీనింగ్ షాపు. కలుసుకోవల సింది షాపు మేనేజర్ని. సమయం రేపుదయం ఎనిమిది గంటలు. కోడ్ వర్డ్ మర్రిచెట్టు..." అన్నాడు కిల్లర్.

"ఇతడు నిజమే చెప్పాడు—" అన్నాడు వారిలో ఒకడు.

"మరి నన్ను వదిలేస్తారా?" అన్నాడు కిల్లర్.

"రేపు—శారదా డ్రైక్లీనింగ్ షాపువద్ద వదులుతాం

నిన్ను. అంతవరకూ ఇక్కడే నిద్రపో...." అన్నాడు వారిలో ఒకడు.

కిల్లర్ ఏదో అనాలనుకున్నాడు. అతనికి నిద్ర ముంచుకు వచ్చింది.

## 6

మర్నాడుదయం ఎనిమిది గంటలు కావడానికింకా అయిదునిముషాలుండనగా — శారదా డ్రెస్సింగ్ షాపు ముందు-ఒకదానికొకటి యెదురుగా రెండు కార్లాగాయి.

నీలిరంగు కార్లోంచి గ్రే సూట్లో వ్యక్తి ఒకడు దిగాడు. దానికెదురుగా ఆగిన కార్లోంచి బ్లాక్ సూట్లో వ్యక్తి ఒకడు దిగాడు. ఇద్దరూ ఒకేసారి షాపులో అడుగు పెట్టారు. మేనేజరు వారి వంక చూశాడు. ఇద్దరూ అతడికి చెరో స్లిప్పూ అందించారు.

స్లిప్పుమీద—"కోడ్ వర్డు—మ్యాట్రిమోనీ" అని వ్రాసి వుంది. రెండు స్లిప్పుల్లోనూ ఒకే కోడ్ వర్డు వ్రాసి వుండటంతో మేనేజర్ ఆశ్చర్యపడ్డాడు అతడు రెండు స్లిప్పుల మీదా కూడా—"మీ పరివారంతో లోపల హాల్లోకి వెళ్ళండి—" అని వ్రాసి వెనక్కిచ్చేశాడు.

కొద్దిక్షణాల్లో నీలిరంగు కార్లోంచి మొత్తం ఆరుగురు డ్రెస్సింగ్ షాపులోంచీ — లోపల హాల్లోకి వెళ్ళారు. ఆ వెనుకే ఎర్రకార్లోంచి ఆరుగురు వ్యక్తులు కూడా ఆ హాల్లోకే వెళ్ళారు.

హాలు విశాలమైనదే! కానీ అందులో కూర్చునేందుకు కుర్చీలు లేవు. గోడవారగా ఒక బల్ల వుంది. ఆ బల్ల మీద పది బ్రీఫ్ కేసులు—రెండు వరసల్లో ఒకదాని మీద ఒకటి పేర్చబడి ఉన్నాయి.

బల్ల వెనుక ఓ మనిషి వున్నాడు. అతడు సుమారు

ఏడడుగుల పొడవున్న పాశ్చాత్యుడు. మనిషి సన్నగా వున్నాడు.

హాల్లో అడుగు పెట్టిన పన్నెండుగురినీ చూసి—"మీ రందరూ ఒక సంస్థకు సంబంధించిన వారే కదూ!" అన్నాడు.

ఎర్ర కారు మనుషులు — నీలి కారు మనుషులు విడి విడిగా ఒకరికొకరు యెదురుగా వున్నారు. రెండు గుంపులూ ఒకరినొకరు తీవ్రంగా చూసుకున్నారు.

నీలికారు గుంపులో కిల్లరున్నాడు.

ఎర్ర కారు గుంపులో పద్మావతి వుంది.

కిల్లర్ పద్మావతి వంక చురుగ్గా చూస్తున్నాడు. పద్మావతి అతడి వంక హేళనగా చూస్తోంది.

"డియర్ ఫ్రెండ్స్—మీ గురించి మీరు చెప్పాలి. మీరిద్దరూ ఒకే సంస్థకు చెందిన మనుషులైతే కోడ్ వర్డ్స్ రెండు స్లిప్పులో యెందుకిచ్చారు? రెండు సంస్థలకు చెందిన మనుషులైతే కోడ్ వర్డ్స్—ఒకటికి బదులుగా రెండు సంస్థలకెలా తెలిసింది? మీరు జవాబు చెప్పాలి. క్విక్ ...."

నీలికారు మనుషులు ముఖముఖాలు చూసుకున్నారు.

ఎర్ర కారు మనుషుల్లో ఒకడు ముందుకు వచ్చి— "మేము మాస్టర్ కీ సభ్యులం. మాకందవలసిన సందేశాన్ని బ్లూ హార్సెస్ మనుషులు లాగేశారు. కానీ యెలాగో తెలివిగా ఆ సందేశాన్ని సంపాదించి సమయానికిక్కడకు చేరుకున్నాం—మా ఎదుటవున్న గ్రే సూటు మనుషులు—బ్లూ హార్సెస్‌కు చెందినవారు...." అన్నాడు.

"అవునా?" అన్నాడు బల్ల వెనుక మనిషి.

"అవును. కానీ మేము బంగారం తీసుకునే ఇక్క

త్నించి వెడతాం. మమ్మల్నెవ్వరూ ఆపలేరు—" అన్నాడో గ్రే సూటువాలా.

"ఇక్కడెవరూ గాజులు తొడిగించుకోలేదు—" అన్నాడో ఎర్రకారు మనిషి.

గ్రే సూట్ వాలా నవ్వి—"మీలో గాజులు తొడిగించుకున్న వాళ్ళొకరున్నారు—" అన్నాడు పద్మావతి వంక హేళనగా చూస్తూ.

"నా గాజుల ప్రభావం ఇప్పుడే చూద్దువుగాని—" అంటూ పద్మావతి చటుక్కున తన చేతిగాజు నొకదాన్ని తీసి నేలమీద కొట్టింది. క్షణాలమీద గదిలో యేదో వాయుపదార్థం అవహించుకుంది. చూస్తూండగా కిల్లర్ తో సహా—నీలికారు మనుషులారుగురికీ స్పృహ తప్పింది. బల్ల వెనుక మనిషి కూడా స్పృహతప్పి పడిపోయాడు.

"గుడ్ వర్క్—పద్మా!" అంటూ ఆ గుంపులో నల్ల సూట్ వ్యక్తి పద్మావతిని మెచ్చుకుని—"కమాన్—మనలో ప్రతి ఒక్కరూ—రెండేసి బ్రీఫ్ కేసులచొప్పున బయటకు తీసుకు వెళ్ళాలి—" అన్నాడు.

"అంత బరువు మనం మోయలేము. ట్రాలీలో బైటకు తీసుకుని వెళ్ళాలి—" అన్నాడు వారిలో ఒకడు.

అందరూ బల్లదగ్గరకు వెళ్ళి బ్రీఫ్ కేసులు పట్టి చూశారు. ఇరవై కోట్లు విలువచేసే బంగారం పది బ్రీఫ్ కేసుల్లో సర్దుకుంది. ఆ బ్రీఫ్ కేసుల్ని మోయడం అంత సులభంకాదు.

"నేను ట్రాలీ తీసుకుని వస్తాను—" అంటూ బ్లాక్ సీటు వ్యక్తి హాల్లోంచి శారదా డ్రైక్లీనింగ్ షాపు మేనేజరు వద్దకు వెళ్ళాడు. మేనేజరతడి వెంటనే ఓ ట్రాలీ యిచ్చాడు. ట్రాలీలో బ్రీఫు కేసులు షాపు బైటకు

వచ్చాయి. వాటిని కార్లోకి లోడ్ చేశారు వాళ్ళు. తర్వాత ట్రాలీ షాపు మేనేజరు కప్పగించి కారు స్టార్టు చేశారు వాళ్ళు.

కారులో అంతా పద్మావతికి అభినందలు కురిపిస్తూ—"నీవు లేకుంటే మాస్టర్ కీ సంస్థ ఈ రోజు ఇరవై కోట్లు నష్టపోయుండేది—" అన్నాడు.

పద్మావతి తనలో తానే ముసిముసిగా నవ్వుకుంటూ—"డిటెక్టివ్ కిల్లర్ నన్ను సంఘసేవికగా భావించడంవల్ల ఇదంతా జరిగింది. నేను పోలీసులకు సమాచారం అందచేస్తానని అతడు నమ్మాడు. నేను మాస్టర్ కీ సంస్థ సభ్యురాలినని అతడికి తెలియకపోవడం నా అదృష్టం. ఇందాకా మనం ప్రయోగించిన విషవాయువుతో అతడి కథ కూడా ముగిసినట్లే—ఓ గంటలోగా యెవరైనా విరుగుడు ప్రయోగిస్తే తప్ప ఆ హాల్లోని వారెవ్వరూ ప్రాణాలతో బైట పడలేరు—" అంది.

కారు పద్మావతి ఇంటి ముందాగింది.

"లెటజ్ సెలబ్రేట్!" అన్నాడు కార్లోని వ్యక్తి.

కార్లోంచి అందరూ దిగి పద్మావతి ఇంట్లోకి వెళ్ళారు. లోపల అంతా చీకట్లో కూర్చోగానే ఒక్కసారిగా వారిని యాభైమంది సాయుధులు చుట్టుముట్టారు.

వారిలోంచి ఓ వ్యక్తి ముందుకువచ్చి—"డిటెక్టివ్ కిల్లర్ సామాన్యుడు కాదు. కేవలం బంగారం ప్రభుత్వ పరం చేయడం అతడి బాధ్యత. ఆ బాధ్యతను నెరవేర్చడంతోపాటు బ్లూ హార్నెస్, మాస్టర్ కీ సంస్థలకు చెందిన కొందరు ముఖ్యుల్ని కూడా పట్టుకోవడం అతడి కెలా సాధ్యపడిందో నాకర్థంకావడంలేదు. మీరందరూ మర్యాదగా చూపు లొంగిపొండి. బయట పార్కు చేసిన

41

హూ కారును పోలీసులు స్వాధీనం చేసుకుంటున్నారు. శారదా డ్రైక్లీనింగు షాపులో మూర్ఛపోయిన ఏడుగురికీ ప్రథమ చికిత్స జరుగుతోంది........" అంటూ ఏదో అంటూండగా—

"మీరెవరు?" అంది పద్మారతి.

అతను తన పేరు చెప్పగానే ఆమె ఉలిక్కిపడింది. నిన్నటి దినం కిల్లర్ తనకిచ్చిన చిరునామా— పేరతడిదే! అంటే కిల్లర్ ఆ చిరునామాకు సందేశం అందజేయడానికి వేరే ఏర్పాట్లు చేసి వుండాలి. అంటే తను—మాస్టర్‌కీ సంస్థలో సభ్యురాలినని అతడికి ముందే తెలిసి వుండాలి!

— అయిపోయింది —

# డబ్బుకోసం దారుణం!

ఏ.యస్. రావ్

దాదాపు ఖాళీగా వున్న రోడ్డువారగా టాక్సీ ఆగింది.

అతను కిందికి దిగి తలుపుని నిర్లక్ష్యంగా తోశాడు. మీటరువేపు చూడకుండా ఇరవైరూపాయల నోటుని డ్రైవరు పక్కన సీటుమీదపడేలా విసిరి ముందుకి కదిలాడు.

సన్నటి పైజామాలో దాగిన పొడుగాటి కాళ్ళు అతన్ని హుందాగా ముందుకి తీసుకెళ్తున్నాయి. మోకాళ్ళ కిందిదాకా సాగిన బ్రౌన్ కలర్ రాజీవ్ గాంధీ జుబ్బా. భుజంమీంచీ వేళ్ళాడుతోన్న గుడ్డసంచీ. వంకీలుతిరిగిన జుట్టు. అంగుళం పొడవు పెరిగిన గెడ్డ; గెడ్డంతో కలిసి పోతూ కిందికి వొంగిన మీసాలు. గుబురు కనుబొమల కిందున్న కళ్ళన లోకంనుంచీ దాచేస్తున్న నల్లకళ్ళద్దాలు.

తనింకా అయిదు నిమిషాలపాటు నడవాలి....అతను ఆగి, ఫిల్టర్ కింగ్ సిగరెట్ వెలిగించి సందులోకి తిరిగాడు. తను వారం రోజులుగా సేకరించిన సమాచారం

ప్రకారం, పదినిమిషాల క్రితమే వాళ్ళంతా అక్కడికి చేరుకుని వుంటారు. అక్కడికి చేరుకున్నాక వాళ్ళు సమయాన్ని వృధా చేయరు. తంచన్‌గా వాళ్ళ రోజువారీ వ్యాపకం ప్రారంభమవుతుంది....

తను రంగప్రవేశం చేశాక, ఇవాళ వాళ్ళ కార్యక్రమానికి తెరపడుతుంది. ఆ తరవాత కొన్నాళ్ళపాటు వాళ్ళ కార్యక్రమం ఆగిపోతుంది. అది ఆగడం, సాగడం తను మాట్లాడే విధానంమీద ఆధారపడి వుంటుందని అతనికి తెలుసు. వాళ్ళలో, చాలా చాలా నిర్లక్ష్యంగా ప్రవర్తించేవాళ్ళతో ఎలా మాట్లాడాలో కూడా తనకి తెలుసు. తనకి నచ్చే విషయాన్ని నచ్చే విధానంలో వింటే, మనిషి సక్రమంగా రియాక్టు అవుతాడు.

మరో మలుపు తిరిగి అతను ఆగాడు. మురుగు కాలువ మీద పరేసిన బండరాతికి అటువేపున వున్న చిన్న తలుపు మూయబడింది. తలుపు దగ్గరగా జరిగి అతను క్షణకాలం నిలబడ్డాడు. లోపల్నుంచీ తగ్గు స్వరంలో మాటలు—నిజం చెప్పాలంటే—కేకలు వినిపిస్తున్నాయి. చిరునవ్వుతో అతని పెదవులు విచ్చుకున్నాయి. సిగరెట్ పీకని కాలువలోకి విసిరి అతను తలుపుమీద అరచేతిని బోర్లించాడు.

అతని చెయ్యి బలంగా, నెమ్మదిగా ముందుకి కదిలింది. తలుపు కొద్దిగా కదిలింది. కిందిభాగంలో చప్పుడైంది. ఆ తలుపుకి గొళ్ళెం లేదనీ, చిన్న రాయి అడ్డంగా పెట్టబడిందనీ అతని తెలుసు. తలుపుమీద అతనిచేతి ఒత్తిడి యెక్కువైంది. బండరాతిమీద రాయి జరుగుతున్న చప్పుడు ఎక్కువైంది. తలుపు కిర్రుమంటూ లోపలకు జరిగింది. తలుపు సహాయంతో అతనుచేస్తున్న

చప్పుడు లోపలి కేకల్ని నిశ్శబ్దంలో ముంచేసింది.

పక్కవాటంగా లోపలికి దూరి అతను తలుపుని బలంగా మూశాడు. అతని బూటు రాయిని తలుపుకి అడ్డంగా తోసింది. అతను తలకొద్దిగా పైకెత్తి ఎదురుగా చూశాడు. పది పన్నెండు తలలు తనవేపు తిరుగుతున్నాయి. చాలా కళ్ళు తనవేపు ప్రశ్నార్థకంగా, విసుగ్గా చూస్తున్నాయి.

దేవాలయం బాగా బతికిన రోజుల్లో 'యాగశాల'గా ఉపయోగపడిన మండపంలో వాళ్ళందరూ గుండ్రంగా కూచున్నారు. అందరి చేతుల్లోనూ పేక ముక్కలున్నాయి.

"ఎవరు?" గిరిజాల జుట్టూ, పొడుగాటి గడ్డం యువకుడు మొరిగినట్టు ప్రశ్నించాడు.

అతను మాట్లాడకుండా వాళ్ళ దగ్గరగా నడిచాడు. ఆగి రకరకాల భావాలతో తనవేపు చూస్తున్న వాళ్ళందర్నీ చిరునవ్వుతో కలయజూశాడు.

"ఎవరు? ఎవరు కావాలి?" గడ్డం యువకుడు ప్రశ్నించాడు విసుగ్గా.

"నేనే, మీరు, మీరందరూ కావాలి!" అతని కంఠం గంభీరంగా ధ్వనించింది.

"ఓహో.... చెయ్యి కలపడానికా? మెంబర్స్ ఫుల్ గా వున్నారు...."

"ఫర్వాలేదు గురూ ...సిండికేట్ మానేసి అతన్ని కలుపుకుని లోపలా బయటా ఆడదాం!" గడ్డం యువకుడి పక్కనే కూచున్న ఒక్క యువకుడు డాబుసరిగా అవుపిస్తున్న జుబ్బావ్యక్తి సంచీని ఆశగా చూస్తూ అన్నాడు.

అప్రయత్నంగా మొహాలు చూసుకుంటూ కళ్ళతో నే మెసేజ్ అందజేసుకుంటున్న యువకులందర్నీ అతను చిరునవ్వుతో చూశాడు. "యంగ్ ఫ్రెండ్స్ నేను పేకాడ్డానికి రాలేదు!"

అందరి తలలూ అతనివేపు తిరిగాయి.

"మరి? ఎందుకొచ్చారు?" గడ్డం యువకుడు విసుగ్గా ప్రశ్నించాడు.

అతను మాట్లాడకుండా జుబ్బాజేబులోంచి పాకెట్ తీసి సిగరెట్ వెలిగించాడు. పాకెట్ని వాళ్ళమధ్య పడేలా విసిరాడు. ఖరీదైన సిగరెట్ పాకెట్ని చాలా కళ్ళు ఆశగా చూశాయి. గంభీరంగా ధ్వనించిన అతని కంఠం వాళ్ళ చూపుల్ని మళ్ళించింది.

"మీరందరూ చదువుకున్నవారనీ, నిరుద్యోగ రోగంతో బాధపడుతున్నవారనీ, నాకు తెలుసు! మీ అందరికీ, నిజం చెప్పాలంటే మీలాంటి వాళ్ళందరికీ సాయం చేయడానికి ప్రయత్నిస్తున్నాను...."

"ఇంతకీ మీరెవరు?" ఒక యువకుడు అడ్డుతగిలాడు.

"కేశవరావ్, అయామ్ విక్రమార్కరావ్."

"నా పేరు మీకెలా తెలుసు?" ఇందాకటి యువకుడు ఆశ్చర్యంతో అడిగాడు.

"నీ పేరే కాదు; ఇక్కడున్న నీ మిత్రులందరి పేర్లూ, ఆ స్తంభానికి వీపు రుద్దుతున్నతని పేరుతప్ప—క్వాలిఫికేషన్సూ, కులగోత్రాలూ, అన్నీ నాకు తెలుసు!" అతను నవ్వుతూ సగర్వంగా అన్నాడు.

"మీరెవరు?" గడ్డం యువకుడు అనుమానిస్తూ అడిగాడు; చేతిలోని పేకముక్కల్ని పక్కవాడికి అందిస్తూ.

"ఇందాకే చెప్పాను, సోమనాథ్!" విక్రమార్క

రావు నవ్వుతూ అన్నాడు.

"పేరు కాదు. వృత్తి!"

"అనెంప్లాయిడ్ యూత్ వెల్ఫేర్ ఫెడరేషన్ యాక్టివ్ ప్రెసిడెంట్‌ని...."

"ఆల్ రైట్....ఇక్కడికి ఎలా వచ్చారు? ఎందుకు వచ్చారు?" సోమనాథ్ ఆశ్చర్యాన్ని దాచుకునే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

"వారం రోజులుగా మీ అందరి గురించీ వాకబు చేశాను. ఇలా పేకాడుతూ కూచుంటే మీకు ఉద్యోగాలు రావని చెప్పడానికి వచ్చాను!" విక్రమార్కరావు నవ్వుతూ అన్నాడు.

"ఈ పేకాటముక్క మా పేరెంట్స్ ఇరవై నాలుగ్గంటలూ చెప్తూనే వున్నారు! ప్రత్యేకంగా మీరు పనిగట్టుకు రావాల్సిన అవసరం లేదు!" సోమనాథ్ కంఠంలో ఎగతాళి ధ్వనించింది.

విక్రమార్కరావు చిన్నగా నవ్వాడు. "పేరెంట్స్ చెప్పడంలో మందలింపూ, సాధింపూ వుంటాయి. నేను చెప్పడంలో సానుభూతి మాత్రం వుంటుంది!"

"చాలా మంచిది! మీ సానుభూతేమిటో చకచకా చెప్పేసి వెళ్ళండి. మా పన్లు మాకున్నాయ్!" పేకముక్కల్లో కత్తిరేస్తూ మరో యువకుడు వెక్కిరింపుగా అన్నాడు. అందరూ కిసుక్కున నవ్వారు.

"గుండూరావ్, నీపనీ, మీ అందరి పనీ పేకముక్కల్తో కాలాన్ని కత్తిరిస్తూ మీ అందరి దగ్గరా వున్న చిల్లర మొత్తాల్ని మీ అందరిమధ్యా రొటేట్ చేసుకోడమే! ఉద్యోగాలు సంపాయించడానికి మీ రెందుకు ప్రయత్నించలేదు?" విక్రమార్కరావు గంభీ

రంగా ప్రశ్నించాడు.

"నాన్ సెన్స్! ప్రయత్నించడంలేదని మీరెలా అన గలరు?" సుందూరావ్ కసిరాడు.

"యస్! ఎంప్లాయ్ మెంట్ ఎక్స్చేంజ్ లో పేర్లు నమోదు చేసుకున్నాం. ప్రకటనలు చదివి, అప్లికేషన్ ఫారమ్స్ కొని, పెరిగిపోతున్న రేట్లు ప్రకారం పోస్టల్ ఛార్జీలు చెల్లించి, పోస్టలార్డర్స్, డీడీలూ కొనుగోలు చేసి వాగాలేకుండా అప్లై చేస్తూనే వున్నాం. నాగా లేకుండా పెరుగుతున్న బస్సు ఛార్జీల్ని ఆర్ టీసీకి చెల్లిస్తూ ఈ ఊరువాళ్ళు ఆ వూరికీ, ఆ వూరివాళ్ళు ఈవూరికీ ప్రయాణంచేసి కాంపిటిటివ్ ఎగ్జామ్స్ రాస్తూనే వున్నాం!" సోమనాథ్ ఎగతాళిగా అన్నాడు.

నవ్వులు విక్రమార్కరావుని చుట్టుముట్టాయి. చిరు నవ్వుతో ఆ నవ్వుల్ని పక్కకితోస్తూ అతను వాళ్ళని తీక్షణంగా కలయజూశాడు.

"ఔను! కాంపిటీటివ్ ఎగ్జామ్స్ రాస్తున్నారు! ఫలి తాలని ఎనౌన్స్ చేయకుండా యేకంగా పరీక్షల్నే రద్దు చేసేస్తూంటే చేసిన ఖర్చునీ, చెల్లించిన పరీక్ష రుసుముల్నీ రాసిన పరీక్షల్ని మరిచిపోయి తోకలు వూపుకుంటూ పేకలు కలుపుతున్నారు!" విక్రమార్కరావు కంఠం వాళ్ళందరి మొహాలమీదా ఉప్పునీళ్ళు చల్లిన ఎఫెక్టు తెచ్చింది.

"వాట్డూ యూ మీన్?" సోమనాథ్ కోపంగా అన్నాడు.

"ఉద్యోగ ప్రయత్నాల్లో మీరు ఓడిపోతున్నారు. ఆల్ రైట్ .... ఈమధ్య నిరుద్యోగ యువకులకి బ్యాంకులు ఎముకలేని చేతుల్తో అప్పులిస్తున్నాయి. అప్పులు తీసుకుని మీకు మీరే ఉద్యోగాలు యెందుకు ఇచ్చుకోలేదు?"

విక్రమార్క రావు ప్రశ్నించాడు.

"మూడు తెలీదేమో....... బ్యాంకులు అడిగిన వాళ్ళందరికీ అప్పు లియ్యవు!" గుండూరావు కసిగా అన్నాడు.

"నాకు తెలుసు. మీరందరూ అడిగారనీ, అప్పు సంపాదించలేకపోయారనీ కూడా నాకు తెలుసు!" విక్రమార్క రావు వాళ్ళనే చూస్తూ అన్నాడు. "ప్రభుత్వ ఉత్తరువుల ప్రకారం బ్యాంకు ఋణం మీ కెందుకు అందలేదో కనీసం కనుక్కునే ప్రయత్నం మీరు చేయలేదని తెలుసు! అన్నిరకాల ఇంటర్వ్యూల్లోనూ వోడిపోయి సినిక్స్‌గా తయారవుతున్న మీ లాంటి యువకుల్లో కొత్త చైతన్యాన్ని నింపడానికే ఫెడరేషన్ ఆవిర్భవించింది...."

"ఐసీ....మీ ఫెడరేషన్‌లో సభ్యులుగా చేరడానికి ఫీజు యెంతో....?" గుండూరావు తెలివిగా ప్రశ్నించాడు.

నవ్వులు.

విక్రమార్క రావు కిందికి వంగి ఇంకా వాళ్ళ మధ్య అలాగే పడున్న సిగరెట్ పాకెట్‌ని అందుకుని, మరో సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ తదేకంగా గుండూరావుని చూశాడు.

"ఇతర దేశాల్లో, గల్ఫ్ కంట్రీస్ ఉద్యోగాలు యేర్పాటు చేస్తామని అమాయకులని యేమార్చే సంస్థలాంటిది కాదు ఫెడరేషన్. పరీక్ష ఫీజులు గుంజి, అసలుకు ఎసరు పెడ్తూ, పరీక్షల్ని యేదో సాకుతో రద్దు చేసే ప్రయివేటు సంస్థలూ, ప్రభుత్వ సంస్థలూ లాంటిది కాదు ఫెడరేషన్...."

"అలాగా! అయితే, ఎలాంటిది మీ ఫెడరేషన్?" గుండూరావు అడ్డొస్తూ అడిగాడు.

"గుండూరావ్! చాలా పరీక్షలు రాసివుంటావ్! ఒక ప్రశ్న అడుగుతాను, సమాధానం చెప్పు! రెండేళ్ళ క్రితం—అనుకుంటాను... గ్రూప్ ఫోర్ ఎగ్జామ్స్ జరిగాయి. పాతికరూపాయలు రుసుం చెల్లించి నువ్వు ఆ పరీక్షకు హాజరయ్యావ్. ఏవో కారణాలు చూపించి, ప్రభుత్వం ఆ పరీక్షల్ని రద్దుచేసింది. ఒకరోజు విసుక్కుని, రెండోరోజు నుంచీ ఆ విషయం మరిచిపోయావ్. నిరుద్యోగి అయిన నువ్వు అప్పుచేసి చెల్లించిన పాతిక రూపాయల ఎగ్జామినేషన్ ఫీజు నీకు వాపసు వచ్చిందా?"

"లేదు...."

"నువ్వు చెల్లించిన రుసుం పరీక్ష రద్దయిన కారణంగా, న్యాయంగా నీకు రావాలి. అవునా?" విక్రమార్కరావు ప్రశ్నించాడు.

"ఆఫ్‌కోర్స్...తిరిగివ్వడం ప్రభుత్వం బాధ్యత!" గుండూరావు జవాబిచ్చాడు.

"అడగడం నీ బాధ్యత. నువ్వు అడిగావా?" విక్రమార్కరావు ప్రశ్నించాడు.

"ఆఫ్‌కోర్స్...లేదు....అయితే, పత్రికల్లో కొంతమంది ఉత్తరాలు రాశారు. అయినా ప్రభుత్వం ఇవ్వలేదు...."

"మర్యాదగా ఇవ్వనప్పుడు కోర్టుకెళ్ళి నీ సొమ్ము వసూలు చేసుకోవాలని నీకు తెలీదా?"

"హుఁ! కోర్టు! పాతిక కోసం కోర్టుఫీజు కిందా, లాయరు ఫీజు కిందా అయిదొందలో, వెయ్యో తగలే

యాలి! మీ సలహాకి ధన్యవాదాలు!"

విక్రమార్క రావు చిన్నగా నవ్వాడు. నువ్వు నిరుద్యోగి వనీ, కాంపిటీటివ్ ఎగ్జామ్‌ని రద్దు చేసిన కారణంగా చెల్లించిన నీ ఫీజుని నీకు తిరిగి ఇప్పించమనీ, లాయర్లని ధరించే శక్తి నీకు లేదనీ హైకోర్టుకు ఒక కార్డుముక్క రాస్తే హైకోర్టే దమ్మిడీ ఖర్చు లేకుండా నీ కేసు టేకప్ చేసి నీకు న్యాయం చేస్తుందని నీకు తెలుసా?"

సుందూరావుతో బాటు అందరూ ఆశ్చర్యంగా చూశారు. ఎవ్వరూ నోరు మెదపలేదు. విక్రమార్కరావు చిన్నగా నవ్వాడు. "ఇలాంటివన్నీ మీలాంటి కుర్రాళ్ళకు తెలీదని నాకు తెలుసు. అందుకే, యువతరానికి నవ చైతన్యం కలిగించడానికే ఫెడరేషన్ పుట్టింది...."

"ఓహ్! తిరుగుబాటు నూరిపోయడానికి మీరు తయారయ్యారన్నమాట! మీది యే పార్టీ మహాశయా?" సోమనాథ్ నవ్వాడు. అందరూ అతనితో శృతి కలిపారు. ఆ నవ్వు యెగతాళిగా బరువుగా, పదునుగా వుంది.

విక్రమార్కరావు నవ్వలేదు. సిగరెట్ పీకని గోడ వారగా గిరాటేసి అతను మెల్లగా తన కళ్ళని వాళ్ళ నుండీ దాస్తున్న నల్లద్దాల్ని తొలగించాడు. రవ్వల్లా మెరుస్తున్న కళ్ళతో అందరినీ తీక్షణంగా, తదేకంగా చూశాడు. మెల్లిగా అతని పెదాలు కదిలాయి: "తిరుగుబాటు! తిరుగుబాటు మనిషి రక్తంలో వుంది. అయితే ఎప్పుడు, ఎందుకు, ఎలా తిరుగుబాటు చేయాలో మనిషికి తెలీదు. మీకంటే బలహీనుల్ని సతాయించడానికి మీరు సులువుగా తిరుగుబాటు చేస్తారు. మీకంటే బలవంతుడు ఎదురైనప్పుడు తోకలు ముడుచుకుంటారు!"

"వాట్ డూ యూ మీన్?" సోమనాథ్ అరి

చాడు. తమ ఆటకు అంతరాయం కలిగిన విషయాన్ని అతనితోబాటు అందరూ మరిచిపోయినట్టున్నారు.

"మీ అభిమాన హీరో నటించినంత పంకేసిన సిని మాని నష్టం తస్తున్నా తందరోజాలు ఆడించని థియేటర్ మీద రాళ్ళ్యా రప్పల్తో తిరుగుబాటు చేస్తారు. అయితే యెప్పుడు? థియేటర్ యొక్క భాగం అద్దాలతో నిర్మించబడినప్పుడు. అద్దాలు లేకుండా కేవలం రాతితో నిర్మించబడిన థియేటరుమీద మీరు తిరుగుబాటు చేయరు! అర్థమైందా?" విక్రమార్కరావు నవ్వుతూ ఆగి, మరో సిగరెట్ ముట్టించాడు.

ఏదో చెప్పబోతోన్న సోమనాథ్‌ని చెయ్యెత్తి వారిస్తూ అతను చిరునవ్వు నవ్వాడు. "యంగ్ మెన్! రాజకీయ పార్టీలతో నాకు సంబంధంలేదు. నేను స్థాపించిన ఫెడరేషన్‌లో దేశంలోని నిరుద్యోగులందరూ—ఆటోమాటిగ్గా—సభ్యులై పోయారు. వాళ్ళ పేర్లూ, వివరాలూ నమోదు చేసుకోనక్కర్లేదు! పైసా రుసుం చెల్లించక్కర్లేదు...."

"ఒక్క క్షణం....!" సోమనాథ్ అడ్డు తగిలాడు. "ఇంతకీ మీరేం చేస్తారు? యెందుకు మీకీ తాపత్రయం?"

విక్రమార్కరావు చిన్నగా నవ్వాడు. "ఎందుకు మీకీ తాపత్రయం? అంటూ నేతాజీని, చంద్రశేఖర ఆజాద్‌నీ, భగత్‌సింగ్‌నీ, సావర్కార్‌నీ ఎవరేనా అడిగివుంటే ఏం సమాధానం చెప్పివుండేవారో, ఆ సమాధానమే నాదీ! నేనేం చేస్తానో చెప్పకుండా, మీరేం చేయాలో చెప్తాను...."

క్షణకాలం ఆగి విక్రమార్కరావు ప్రారంభించాడు:

"మీ అందరికీ టెంపరరీగా ఉద్యోగాలిస్తాను. ప్రభుత్వం ఇస్తున్న రోజువారీ వేతనంకంటే యెక్కువ మీకు చెల్లించబడుతుంది. ఆ ఉద్యోగ కాలపరిమితి కేవలం నెల రోజులు మాత్రమే...."

"అంతేనా?" గుండూరావు అడ్డు తగిలాడు.

"అంతే. అయితే, ఈ తాత్కాలిక ఉద్యోగం మీకు ఎంతో, ఎంతో తృప్తి నిస్తుంది. అంతా నేను అనుకున్నట్టు జరిగితే, మీ అందరికీ తగిన అర్హత వున్న వాళ్ళకి—తరవాత, శాశ్వత ప్రాతిపదికమీద లాభం చేకూరుతుంది...."

"ఉద్యోగమేమిటో చెప్పండి ..." గుండూరావు అడ్డు తగిలాడు.

"నువ్వుండరా!" మరో యువకుడు మొదటిసారిగా నోరు తెరిచాడు. "మిస్టర్ విక్రమార్కరావ్, మీ రిచ్చే నెలలో రిటైరై పోయే ఆ ఉద్యోగం మేం చేస్తామని యెందుకు అనుకుంటున్నారు?"

గర్వంగా చూస్తున్న ఆ యువకుడి కళ్ళల్లోకి విక్రమార్కరావు సగర్వంగా చూశాడు. ఏదో చెప్పబోతున్న అతన్ని మరో యువకుడి కంఠం అటకాయించింది.

"యస్! విక్రమార్కరావుగారి కథ బేతాళ కథలా నమ్మశక్యంకాకుండా వుంది!"

అందరూ గొల్లున నవ్వారు. విక్రమార్కరావు తెల్లటి పళ్ళని చూపిస్తూ అందర్నీ కలయజూశాడు. అతని చెయ్యి సంచీలోకి దూరింది. క్షణంలో ఇవతలికి వచ్చింది, రెండు వందరూపాయల నోట్లకట్టల్ని అతను వాళ్ళమధ్య పడేలా నిర్లక్ష్యంగా విసిరాడు. చచ్చిపోయి కిందపడిన జింక మీదికి వాలుతున్న రాబందుల చూపుల్లా అంద

చూపులూ నోట్లకట్లమీద వాలాయి. గంభీరంగా ధ్వనించిన విక్రమార్కరావు కంఠం వాళ్ళ చూపుల్ని డబ్బుమీంచీ అతని మొహంమీదికి మళ్ళించింది.

“అది రెండు వేలు. మీ అందరిదగ్గరా కలిసి వెయ్యి రూపాయలుకూడా లేవని నాకు తెలుసు. నేను వివరాలు చెప్పాక ‘ఉద్యోగం చేయను’ అని మీలో యే ఒక్క రేనా అంటే ఆ రెండు వేలనీ అక్కడే వదిలేసి వెళ్ళి పోతాను. ఉద్యోగం చేయడానికి అందరూ సై అంటే మీ జేబులన్నీ ఖాళీ చేసి, నా సంచీని నింపుతారా?....”

విక్రమార్కరావు ప్రశ్న యువకులందరి తలలమీదా కాసేపు వేళ్ళాడుతూ వుండిపోయింది. ‘ఉద్యోగం చేస్తామని యెందుకనుకుంటున్నారు?’ అని ప్రశ్నించిన యువకుడు ముందుగా తెప్పరిల్లాడు.

“చూస్తూంటే, సాయంత్రందాకా చేతులు నొప్పెట్టేలా ముక్కలు కలిపి, పంచడంకన్నా, ఈ పందెం ఆకర్షణీయంగా అవుపిస్తోందే!”

బృందగానం లెవెల్లో నవ్వులు ప్రారంభమయ్యాయి.

విక్రమార్కరావు నవ్వుతూ ఆ యువకుణ్ని చూశాడు. “హరిహర్రావూ, రోజంతా నువ్వొక్కడివే గెలుస్తూ పోగేసుకునే పేకాట డబ్బులకన్నా నేనిచ్చే ‘రోజు జీతం యెక్కువుంటుంది. అంటే, అవలీలగా నేను ఇవ్వగలిగినంత మొత్తాన్ని ఒళ్ళు గుల్ల చేసుకున్నా నువ్వు పోగు చేయలేవు! అంచేత....”

“ఒరేయ్ హరీ, నువ్వు కాసేపు నోరు మూసుకో!” అడ్డు తగిలిన సోమనాథ్ విక్రమార్కరావు వైపు చూశాడు. “సార్....యింతకీ ఉద్యోగం యేమిటి? మీ

రిచ్చేది ఎంత? వివరంగా చెప్పండి. అవునో కాదో చెప్పేస్తాం."

"రైట్! మీరు నెలపాటు ఎన్యూమరేటర్స్‌గా నేను నిర్ణయించే యేరియాలో నిర్ణయించే పని చేస్తారు. ఆ పని చట్టవిరుద్ధమైంది కాదని మొదటే చెప్తున్నా. చట్టవిరుద్ధమే అని మీలో యెవరికైనా కలలో అనుమానం ఉంటే కూడా, వెళ్ళి పోలీసుల్ని కలుసుకుని నామీద రిపోర్టు ఇవ్వొచ్చు. నెలదాకా నేనుండే హోటల్ దగ్గరికి రోజూ మీరు వస్తూంటారు. ఏ రోజు జీతం ఆ రోజు పట్టుకెళ్తారు...."

"ఇంతకీ పనేమిటి?...." సోమనాథ్ విసుగ్గా అన్నాడు.

విక్రమార్క్‌రావు నవ్వాడు. "సోమనాథ్, ఉద్రేకపడకు! పనేమిటో చెప్పకుండా చెప్పినపని చేయించుకోకుండా, ప్రామిస్ చేసిన జీతం యివ్వకుండా వుండను! ఉద్యోగనిర్వహణలో మీరు కొంతదూరం వెళ్ళాల్సి వుంటుంది కూడా. అలాంటప్పుడు కిలోమీటరుకు పది రూపాయలు టి. ఏ. చెల్లించబడుతుంది. బస్సుల్లో, సైకిళ్ళమీదా, కాలి నడకనా — యెలా వెళ్ళినా సరే...."

అతను ఆగి మరో సిగరెట్ వెలిగించాడు. మిత్ర బృందం మొహాల్లో ప్రత్యక్షమవుతున్న కుతూహలాన్ని తృప్తికరంగా చూస్తూ ప్రారంభించాడు:

"బైటి ప్రదేశాలకు వెళ్తే కిలోమీటరుకు పది రూపాయలు ఇస్తానన్నాను. ఒక వ్యక్తి ఉదయం పది నుండీ సాయంత్రం అయిదుగంటలలోగా నేను యిచ్చే పనిలో యెంత చేయగలడో నాకు తెలుసు. నా అంచనా

ప్రకారం పనిచేసినవాళ్ళకు రోజుకి ముప్పైరూపాయల పారితోషికం లభిస్తుంది. తక్కువ పని చూపిస్తే పారితోషికం తగ్గుతుంది. ఎక్కువ చేస్తే ఎక్కువవస్తుంది....." విక్రమార్కరావు ఆగి తన శ్రోతల మొహాల్లోని ఆశ్చర్యాన్ని చిరునవ్వుతో గమనించాడు.

"ఇప్పుడు మీరు చేయాల్సిన పనేమిటో చెప్తాను. జాగ్రత్తగా వినండి" విక్రమార్కరావు చెప్పసాగేడు. యువకులంతా జాగ్రత్తగా వినసాగేరు.

"నిలబడే వున్నారు; కూచోండి సార్...." విక్రమార్కరావు చెప్పిందంతా నమ్మలేనట్టు విన్న సోమనాథ్ మర్యాదగా అన్నాడు.

విక్రమార్కరావు కూచోలేదు. చిన్నగా నవ్వుతూ తను కిందపడేసిన వందరూపాయల నోట్లకట్టల్ని చేత్తో చూపించాడు.

"పందెం! హరిహరరావ్!" అన్నాడు నవ్వుతూ.

చిన్నగా నవ్వే ప్రయత్నంచేస్తూ, హరిహరరావు జేబులో చెయ్యిపెట్టాడు. విక్రమార్కరావు అతన్ని వారించాడు. "మీకు నమ్మకం కలిగించడానికి పందెం వేశాను. సామాజిక స్పృహ వున్న మీలాంటి వాళ్ళు నేనిచ్చే పనిని లైక్ చేస్తారని నాకు తెలుసు!" అంటూ అతను నోట్లకట్టల్ని అందుకుని సంచీలో పడేసుకున్నాడు.

"మీరు పన్నెండుగురున్నారు. ఇంకా మీ మిత్రులు యెవరేనా వుంటే నా తరఫున మీరే వాళ్ళకి ఉద్యోగం ఇవ్వొచ్చు. ఈ ఎన్యూమరేషన్ యెంత త్వరగా పూర్తయితే అంత మంచిది. అందరూ కలిసి ఇవాళ రాత్రి ఏడింటికి నన్ను హోటల్ ఆశ్రమ్, నలభయ్యో నెంబరు గదిలో కల్సుకోండి. అవసరమైన పేపర్సూ అవీ

ఇస్తాను...."

సోమనాథ్ లేచి నించున్నాడు. "ఒక్క క్షణం సార్! చేయాల్సిన పనేమిటో చెప్పారు. ఆ పని ఎందుకు చేయిస్తున్నారో చెప్పలేదు "

"చెప్పను!" విక్రమార్క రావు అడ్డొస్తూ అన్నాడు. "ప్రస్తుతానికి మీరు ఎంత తెలుసుకోవాలో అంతా చెప్పాను. రాత్రికి మరికొన్ని వివరాలు చెప్తాను. ఒకటి మాత్రం చెప్పగలను: మీరు చేయబోయే ఎన్యూమరేషన్ వర్క్ మూలంగా యెవ్వరికి యే విధమైన నష్టమూ రాదు...."

"ఏమిటి గ్యారంటీ?" గుండూరావు సోమనాథ్ దగ్గరగా జరుగుతూ అడిగాడు.

విక్రమార్క రావు అతన్ని చిరునవ్వుతో తదేకంగా చూశాడు.

"గుండూరావ్, నువ్వే ఊహించు! నువ్వు చేయబోయే ఎన్యూమరేషన్ వల్ల ఎవరికేనా, ఏదేనా నష్టం వాటిల్లే అవకాశం వుందేమో ఆలోచించు!"

గుండూరావు పెదవి కొరుక్కుంటూ సాలోచనగా తల పంకించాడు.

"ముందుగానే మరో షరతు విధిస్తున్నా: ఎవరేనా మిమ్మల్ని ప్రశ్నిస్తే 'స్టాటిస్టిక్స్ ఇండియా' సంస్థ తరఫున మీరు పంజేస్తున్నట్టు చెప్పండి. లేనిపోనివి ఊహించి చెప్పకండి!" విక్రమార్క రావు సిగరెట్ ముట్టిస్తూ అన్నాడు.

"ఎందుకో తెలుసుకుంటే పని చేయడానికి బావుంటుంది...." హరిహర రావు మెల్లిగా అన్నాడు.

విక్రమార్క రావు అతనివైపు తిరిగాడు. "హరిహర

రావు అన్నింటికీ నాన్నడం నీకు అలవాటని నాకు అర్థమవుతోంది. నీలాంటి యువకులు చాలా వుండాలి. నాన్నపుడు వ్యవహారం నాకు నచ్చదు. మీ అందరికీ నచ్చితేనే పనిలోకి దిగండి. లేదంటే, రాత్రికి సరిగ్గా ఏడుకి నన్ను కల్సుకోకపోతే మీకు ఇష్టంలేదని నిర్ణయించి మరో గ్రూపుకి ఈ పని అప్పగిస్తాను. మీలాంటి నిరుద్యోగులు ఇంటికి ఇద్దరున్నారు!

హరిహరరావు సోమనాథ్ వైపు యిబ్బందిగా చూశాడు. సోమనాథ్ దగ్గి. గొంతు సవరించుకున్నాడు. "ఆల్ రైట్....చట్టవిరుద్ధంగా యేదీ జరగదంటున్నారు గనుక, మేం ఈ పని చేస్తాం. మీరిచ్చేదేదో పన్నెండు గురమే పంచుకుంటాం!"

విక్రమార్కరావు అతని కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. "సోమనాథ్, నువ్వూ, నీ మిత్రులూ చట్టం గురించి చాలా పొర్లన్నారు. నాన్నలు తెచ్చిన బియ్యంతో అమ్మలు వండిన అన్నాన్ని తృప్తిగా తిని పాడుబడిన గుడిలో దబ్బెట్టి పేకాడుతూ కూచోడం చట్టసమ్మతమైన పని అనుకుంటున్నావా?"

సోమనాథ్ గుటకలు మింగుతూ చూశాడు. విక్రమార్కరావు అతని భుజమ్మీద చెయ్యేశాడు. "యంగ్ మాన్, మీరు ఖూనీలు చేయబోవడంలేదు; దోపిడీలు చేయబోవడంలేదు. బస్సులకు నిప్పు పెట్టబోవడం లేదు. ఆఫీసులమీదా, పోలీస్ స్టేషన్లమీదా రాళ్ళవర్షం కురిపించబోవడంలేదు. 'స్టాటిస్టిక్ ఇండియా' సంస్థకోసం మర్యాదకరమైన ఉద్యోగం చేస్తున్నారు!"

సోమనాథ్ మొహం చిరునవ్వుతో వికసించింది. "ఓకే సార్! వస్తాం...."

"రైట్! అయితే, నేను వస్తా!" విక్రమార్క రావు నవ్వుతూ అన్నాడు....

## 2

తెల్ల పాంటులోకి దోపిన తెల్ల షర్టు, నడుముచుట్టూ బిగుసుకున్న సన్నటి బెల్టు, తళతళమంటున్న నల్ల బూట్లు, ఫోటోసన్ అద్దాలు ఖరీదైన ఫ్రేములో అతని మొహానికి అందాన్నీ, హుందానీ తెచ్చిపెడుతున్నాయి. అతని మెడని చుట్టిన బ్రౌన్ కలర్ మఫ్లర్ శివుడి మెడలో వేళ్ళాడుతూ నిద్రపోతున్న పాములా వుంది. పేవ్ మెంట్ మీద నిలబడి అతడు సన్నటి మీసాల్ని వేలితో దువ్వుకున్నాడు. ఛాతీప్రాంతంలో, మఫ్లర్ మీద వేళ్ళాడుతున్న 'క్యానన్' కెమెరాని ఓసారి సర్దుకుని అతను ఠీవిగా రోడ్డు దాటాడు....

బ్యాంక్ తెరిచి గంటన్నర దాటింది. తన అంచనా ప్రకారం ఇవాళ అట్టే రద్దీ వుండదు. శెలవు దినంగా మారిన ఆదివారం రెట్టింపు చేసే ఖాతాదార్లంతా నిన్న నే బ్యాంకుమీదికి అవురావురంటూ ఎగబడి వుంటారు; ఏకాదశినాడు ఉపవాసం చేసి, ద్వాదశినాడు భోజనాలకి ఎగబడేవాళ్ళలా! ఇవాళ, ఈ సమయంలో తనకావలసిన వ్యక్తికి అంత బిజీగా వుండదు....

గ్లాస్ డోర్ని తోసుకుంటూ అతను బ్యాంకు లోపలికి జొరబడ్డాడు. మందకొడిగా లావాదేవీలు సాగుతున్న కౌంటర్లకి పక్కగా, అద్దాల మందిరంలో కూచున్న మేనేజర్ని క్షణకాలం చూస్తూ అలాగే నిలబడ్డాడు. మేనేజరు తటాలున లేచి నిలబడ్డాడు. తన ఎదురుగా నించున్న పంచె, జుబ్బా—పెద్దమనిషివైపు వొంగి ఆవేశంతో కరచాలనం చేస్తూ వుండిపోయాడు. అతని పెద

వులు కదులుతున్నాయి. అయితే అతని మాటల్ని అద్దాలు మింగేస్తున్నాయి. జుబ్బా అతను అద్దాల గదిలోంచీ యివతలికి నడిచాడు. మేనేజర్ కూచుని, ఆవులించి, టేబుల్ సొరుగులోంచీ సిగరెట్ పాకెట్‌ని ఇవతలికి తీశాడు.

రెండోసారి, అద్దాల తలుపుని తోసుకుంటూ అతను మేనేజర్ గదిలోకి దూరాడు. అగ్గిపుల్ల వెలుగుతున్న దోసిలిమీదికి వాల్చిన తలని పైకెత్తి మేనేజర్ అతన్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"అయామ్ శౌరి, జర్నలిస్టు...." అన్నాడతను చిరునవ్వుతో టేబుల్ ముందుకి నడుస్తూ. అతను ముందుకు చాచిన చెయ్యివేపు ఒకసారి చూసి, మేనేజర్ దండపాణి చూపుల్ని అతని మొహంపైకి మళ్ళించాడు. వెడల్పాటి మొహంలో గుబురు కనుబొమల కిందున్న అతని చిన్న చిన్న కళ్ళు ప్రశ్నార్థకంగా చూస్తున్నాయి.

"'మదర్ నేషన్' పత్రిక తరఫున ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాను!" శౌరి నవ్వుతూ అన్నాడు.

ఆనందం, అనుమానం రెండురకాల రంగుల్లా కలుస్తూ, విడిపోతూ దండపాణి మొహమ్మీద ప్రత్యక్షమయ్యాయి. క్షణకాలం తటపటాయించి, ఇంకా ముందుకు సాగే వున్న శౌరి చేతిని చూస్తూ అప్రయత్నంగా కొద్దిగా పైకి లేచి చేతిని కలిపాడతను. శౌరి పొడుగాటి వేళ్ళు దండపాణి మొద్దువేళ్ళని చుట్టుకున్నాయి.

"సిడౌన్!...." అంటూ దండపాణి కుర్చీలో వాలాడు.

"థాంక్స్...." అంటూ శౌరి కూచుని బ్రీఫ్‌కేస్‌ని టేబుల్‌మీద పెట్టుకున్నాడు.

"ఇంటర్వ్యూ.... దేనికి?...." దండపాణి ప్రశ్నించాడు.

"మిస్టర్ దండపాణీ, "మదర్ నేషన్" రూలింగ్ పార్టీని అన్నివిధాలా సపోర్టుచేసే పత్రిక అని మీకు తెలుసనుకుంటాను ..."

"అయామ్ సారీ...." దండపాణి అడ్డు తగిలాడు. "నేను అంతగా మాగజీన్స్ చదవను. చదివినంత వరకూ యే పత్రిక యే పార్టీని సపోర్టు చేస్తుందో, యెందుకు చేస్తుందో యేమీ అర్థంకాని పరిస్థితి యేర్పడింది నాకు!"

శౌరి చిన్నగా నవ్వాడు. "కమిటెడ్ జర్నలిజం ఆధారంతో నడిచే పత్రికల నడవడిక అలాగే వుంటుంది లెండి...."

"మీ పత్రిక "కమిట్" కాలేదా?" దండపాణి తెలివిగా ప్రశ్నించాడు.

"కమిట్ అయ్యింది: ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాన్ని. అంటే మెజారిటీ ప్రజల్ని సపోర్టు చేయడానికి!" శౌరి నవ్వుతూ అన్నాడు.

"ఐసీ....మిస్టర్ శౌరి ...అరుణ్ శౌరి అనే పేర్ని అడపాదడపా విన్నాను. మీ పేరూ అలాగే వుంది. అతనికీ మీకూ యేదేనా బంధుత్వం వుందా?" దండపాణి విషయం మార్చి అడిగాడు.

"మా యిద్దరిదీ 'అక్షరాల బంధుత్వం' మాత్రమే! అన్నట్టు యే విషయంగా మిమ్మల్ని ఇంటర్వ్యూ చేయబోతున్నానో మీరు అడగలేదు!" శౌరి నవ్వుతూ అన్నాడు.

"మీరు నన్ను ఇంటర్వ్యూ చేయరు!" దండపాణి నవ్వుతూ అన్నాడు.

"వై?...." శౌరి ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"బికాస్........అయామ్ ఇంటర్వ్యూల పై; పబ్లిసిటీ పై!"

శౌరి పకపక నవ్వాడు. "మీ గురించి మాకు ఖచ్చితమైన సమాచారమే అందిందని మీ మాటలు చెప్తున్నాయి! కేంద్రం బడుగు వర్గాలకి "లోన్ మేళాలు" నిర్వహిస్తోంది. ఆ లోన్ మేళాను సంపూర్ణంగా జయప్రదం చేసిన చాలా కొద్దిమందిలో మీరు ఒకరు. ఆంధ్ర ప్రదేశ్‌లో మీ ఒక్కరే...."

"మీకలా తెలుసు?" దండపాణి అడ్డు తగిలాడు.

"సెంటర్ ఫైనాన్స్ వర్గాలు మాకు అంతా సప్లై చేశాయి. నిజం చెప్పాలంటే, లోను మేళాను జయప్రదం చేసిన మీలాంటి ఉత్సాహవంతులతో ఇంటర్వ్యూల్ని ప్రచురించమని ఆ వర్గాలే మా పత్రికని అడిగాయి. సెంటర్ ఫైనాన్స్ మినిస్టర్ ఆఫీసునుండే కావాలంటే మీకు సూచనలు తెప్పించి మీ "ఇంటర్వ్యూ సిగ్గు"ను ఎగరగొట్టగలం!" శౌరి నవ్వుతూ అన్నాడు.

చివరిదమ్ము లాగి సిగరెట్‌ని యాష్‌ట్రేలో నొక్కి దండపాణి చిరునవ్వుతో చూశాడు. "నన్ను ఇంటర్వ్యూ చేయకుండా మీరు వదిలేలా లేరు!"

"యూ ఆర్ రైట్! లోన్ మేళా నిర్వహణలో మీరు పడిన సాధకబాధకాలూ, మీ అనుభవం, ప్రజల రియాక్షన్, మీ సిబ్బంది సహకారం, అభ్యర్థుల సెలెక్షన్‌లో మీరు పాటించిన పద్ధతి—ఒకటేమిటి....అన్నీ మీరు వివరించాలి!" శౌరి ఉషారుగా అన్నాడు.

దండపాణి ఇబ్బందిగా చూశాడు. "ఆ వివరాలన్నీ దేనికి?"

శౌరి చిన్నగా నవ్వాడు. "మీరు పత్రికలు అంతగా చదవరన్న మాట నిజమే అనిపిస్తోంది. నిరుద్యోగుల్నీ, బడుగువారినీ ఆదుకునే దృక్పథంతో, అడ్డంకుల్ని తొలగించి ధారాళంగా కేంద్రం అమలుచేస్తున్న లోన్ మేళాల్ని అపార్థం చేసుకుని, స్వార్థంతో విపరీతార్థాలు తీసి తిక్క ఊహల్తో యథార్థాన్ని కప్పెట్టి లోన్ మేళాను ఒక ఫార్స్‌గా చిత్రించడానికి కొన్ని పత్రికలు శక్తివంచన లేకుండా కృషి చేస్తున్నాయి...."

"ఐసీ...." దండపాణి అడ్డు తగుల్తూ బుర్రని ఆడించాడు.

"అమ్మకం పెంచుకోడానికి ఆ పత్రికలు చేస్తున్న ప్రచారం అసత్యమని నిరూపించడానికి కేంద్ర ఆర్థికశాఖ వర్గాలు — మనలో మాటగా చెప్పుకోవాలంటే— ఫైనాన్స్ మినిస్టర్ గారు — నిశ్చయించుకున్నారు. ఆ ప్రయత్నంలో భాగంగా నేను మీ దగ్గరకు వచ్చాను...." శౌరి కంఠం తగ్గించి అన్నాడు.

"ఐసీ...."

"యూసీ మిస్టర్ దండపాణీ, ఈ ఇంటర్వ్యూ మూలంగా కేంద్రం గురించే కాకుండా, ముఖ్యంగా మీ బ్యాంక్ ప్రజలకి చేసిన, చేస్తున్న సేవలగురించి బ్రహ్మాండమైన ప్రచారం లభిస్తుంది. మీది జనప్రియమైన బ్యాంక్ అవుతుంది...."

"అదలా వుంచండి!" దండపాణి నవ్వుతూ అడ్డు తగిలాడు. "ప్రస్తుతం నేను బిజీగా వున్నాను...."

"నేను వచ్చినప్పట్నుంచీ మీరు ఫ్రీ గానే వున్నారు!" శౌరి నవ్వుతూ అన్నాడు. "ఇవాళ అట్టే రష్ లేదు!"

దండపాణి చిరునవ్వు నవ్వాడు. "ఆల్ రైట్ ... .... పది నిమిషాల్లో మీ పని ముగించాలి. చక చకా అడగండి...."

శౌరి మెల్లిగా బ్రీఫ్ కేస్‌ను తెరిచాడు. అందులోంచి యింపోర్టెడ్ టేప్ రికార్డర్‌ని తీసి టేబుల్ మీద పెట్టాడు.

"నేను అడగడం, మీరు చెప్పడం, నేను రాసుకోడం—ఇవన్నీ చాలా కాలాన్ని తినేసే పనులు. ఇద్దరం పిచ్చాపాటీలాగా మాట్లాడుకుందాం. మన సంభాషణ రికార్డవుతుంది. తరువాత దాని ఆధారంతో నేను ఇంటర్వ్యూకి అక్షరరూపం ఇస్తాను...."

"జస్ట్ ఎ మోమెంట్ ...." మేనేజర్ దండపాణి అతన్ని వారించాడు. "మీరు అడగండి; నేను చెప్తాను. అంతే! నా కంఠాన్ని క్యాసెట్‌లోకి ఎక్కించడం నాకు ఇష్టం లేదు...."

"ఎందుకు?" శౌరి కళ్ళు చిట్లిస్తూ ప్రశ్నించాడు.

"టేప్స్ అనగానే నాకు అమెరికా మాజీ ప్రెసిడెంట్ నిక్సన్ కర్నాటక మంత్రి వీరప్ప మొయిలీ గుర్తొస్తారు! ఏ విధంగానూ కమిట్ అవడం నాకు ఇష్టం లేదు...." దండపాణి సిగ్గుపడుతూ నవ్వుతున్నట్టు నటించాడు.

శౌరి అతన్ని క్షణకాలం తదేకంగా చూశాడు. "నేను అడుగుతాను; మీరు చెప్తారు. అప్పుడు కమిట్ అవరా?"

"అది వేరే సంగతి...."

"మిస్టర్ దండపాణీ, ఉద్యోగంలో చేరేసరికి మీరు ప్రభుత్వానికి, తద్వారా ప్రజలకి కమిట్ అయ్యారు.

మీ ఉద్యోగ విధికి కమిట్ అయ్యారు. కాదంటారా?...."

"అది వేరే సంగతి!"

"అన్నీ వేరే సంగతులే అయితే, అసలు సంగతి యేమిటో మీరే చెప్పండి!" శౌరి నవ్వుతూ అన్నాడు.

దండపాణి చిన్నగా నవ్వాడు. "అసలు సంగతి: మీరు అడుగుతారు; నేను చెప్తాను. మధ్య ఆ లేపూ గీపూ వుండదు!"

"మిస్టర్ దండపాణీ, మీ రెప్పుడేవా ఇంటర్వ్యూలో పాల్గొన్నారా?"

"లేదు."

"ఎవరేనా, యెవర్నేనా ఇంటర్వ్యూ చేస్తూంటే చూశారా?"

"ఆ అదృష్టం కూడా పట్టలేదు!"

"అందుకే మీకు యిలాంటి ఇంటర్వ్యూల గురించి తెలీదు!" శౌరి నవ్వుతూ అన్నాడు. "మీ రొకటి చెప్తారు; తొందరలో నే నొకటి రాసుకుంటాను. అచ్చయ్యాక నేను తప్పుగా రాశానని మీరు గొడవ చేస్తారు...."

"అదంతా నాకు అనవసరం. నా షరతులకు లోబడి మీరు ఇంటర్వ్యూ చేస్తే చేయండి; లేకపోతే లేదు!" దండపాణి లేచి నించున్నాడు.

శౌరి కుర్చీలో వెనక్కి వాలాడు. దండపాణి మొహంలోకి కాసేపు తదేకంగా చూస్తూ వుండి పోయాడు. మెల్లిగా అతని మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. అతను తటాలున లేచి, ఎత్తుగా నిలబడ్డాడు. అతని మొహంమీది చిరునవ్వు అంతర్ధానమైంది.

"ఓకే, మిస్టర్ దండపాణీ. థాంక్యూ ఫర్ యువర్ నాన్ కోపరేషన్! 'ఆదర్శ-మేనేజర్ తో గోష్ఠి' శీర్షిక కింద మీ ఇంటర్వ్యూని ప్రచురించి సర్క్యులేషన్ని ఆకాశం ఎత్తుకి పెంచుకోవాలన్న తాపత్రయం మా పత్రికకి లేదు. ఫైనాన్స్ మినిస్ట్రీ మా పత్రికని కోరింది. మా పత్రిక నన్ను కోరింది; వచ్చాను. అంతే. మీరు యొంగులో సహకరించడంలేదని పత్రిక సంపాదకుడికి తెలియజేస్తాను. ఆయన మినిస్ట్రీకి తెలియజేస్తారు. మినిస్ట్రీ మీ ఛెయిర్మన్ కి — కావాలంటే - తెలియజేసుకుంటుంది! వస్తాను!" టేప్ రికార్డర్ని మళ్ళీ బ్యాగులో పడేసుకుని వరుణ్ శౌరి గుమ్మంవేపు కదిలాడు. ఇంకా తనని ఆగమని హెచ్చరించని దండపాణి గురించి ఆశ్చర్యంతో ఆలోచిస్తూ డోర్ హాండిల్ మీద చెయ్యివేశాడు.

హాండిల్ని తిప్పకుండా, తలని తిప్పాడు. మేనేజర్ దండపాణి ఏంచేయాలో తోచనివాడిలా చూస్తున్నాడు. "మిస్టర్ దండపాణీ, అదృష్టాన్ని మీరు ఆమడదూరం తోసేస్తున్నారు. మీ ఇంటర్వ్యూలని రేడియోలో, టీవీలో కూడా ప్రసారం చేయడం మంచిదని మా పత్రిక ద్వారా నేను పైవాళ్ళకి సూచిస్తూ సిఫార్సు చేశాను. గుల్లలో నత్తలా బతకాలని మీరు నిర్ణయించుకుంటే నేనేం చేయలేను!"

దండపాణి మొహంమీద రంగులు మెలికలు తిరిగాయి. అతని పెదవులు కదిలాయి. "ఇలా రండి. టీ తాగుతూ ఆలోచిద్దాం...."

• • •

సాలోచనగా టీ తాగి, కప్పును కిందపెట్టి, సాలో

చనగా శౌరివేపు చూశాడు దండపాణి.

"మీ జర్నలిస్టులు మొండిఘటాలని నిరూపించారు! మీ ప్రశ్నలు యెలా వుంటాయో నాకు తెలీదు. కొన్నింటికి నేను సమాధానం చెప్పలేకపోవచ్చు. యెందుకంటే ఈ గోష్ఠికి నేను ప్రిపేరవలేదు...."

"నాకు తెలుసు!" శౌరి నవ్వుతూ అడ్డుతగిలాడు. "సాధారణంగా ఏ బ్యాంకు మేనేజరేనా కళ్ళు మూసుకుని సమాధానాలు చెప్పగలిగే అతిసాదా ప్రశ్నలు యెక్కువగా మనం వేసుకున్నా కూడా, పాఠకుల ఇంటరెస్టుని లాగిపట్టే, మీ బ్యాంకు సేవల్ని ఋణాల పంపిణీలో ప్రభుత్వం అవలంబించిన విధానాన్ని ప్రభుత్వ సహాయాన్ని ధనరూపంగా మీరు పంపిణీ చేసిన పద్ధతీ, ముఖ్యంగా ఋణసౌకర్యం పొందిన వ్యక్తుల సంఖ్యా, పంపిణీ మొత్తం సొమ్మూ, మీరు సెలెక్టు చేసిన వాళ్ళలో పురుషులూ, స్త్రీలూ, అంగవైకల్యం వున్నవాళ్ళూ, ఎన్ని అప్లికేషన్స్ వచ్చాయో, ఎన్నింటిని మీరు ఆమోదించారో, ఏ ప్రాతిపదిక మీద ఆమోదించారో...." పీర్ లెస్ ఏజెంట్ లా చకచక చెప్పుకుపోతున్న శౌరికి దండపాణి అడ్డుతగిలాడు.

"ఆగండాగండి! మీరడగబోయే వివరాల్లో చాలా మట్టుకు నేను చెప్పలేనివి!" అతను నవ్వుతూ అన్నాడు. "పోగైన అప్లికేషన్లూ, సెలెక్టయిన అభ్యర్థులూ మొత్తాలూ వగైరాలన్నీ నరమానవుడికి గుర్తుండవు...."

"ఎందుకు?" శౌరి అడ్డుతగిలాడు.

"నా ఏరియాలో క్రాష్ ప్రోగ్రాం కింద లోన్ మేళా యేర్పాటైంది. మంత్రిగారు వారం రోజుల్లో వచ్చి 'లోన్ మేళా' స్వయంగా నిర్వహిస్తామన్నారు. కొన్ని

వేలమందికి కొన్ని లక్షల మొత్తం బట్వాడా చేయాలని నాకు ఆర్డర్లొచ్చాయి. సిబ్బంది మొత్తం తన్నుకు చచ్చాం. సేకరించిన బోలెడన్ని దరఖాస్తులు పరిశీలించి, తగిన అభ్యర్థుల్ని సెలెక్టు చేయడంలో అందరికీ దాదాపు పిచ్చిపట్టేసింది. రోజుకి ఇరవైనాలుగ్గంటలు మాత్రమే వున్నాయి కాబట్టి చాలా చాలా శ్రమపడ్డాం. నలభై యెనిమిది గంటల రోజులూ, పధ్నాలుగు రోజుల వారాలూ ఉంటే బాగుండేదనిపించింది!" దండపాణి నవ్వుతూ ఆగాడు.

"బ్రహ్మాండంగా చెప్పారు! రెండు మూడు ప్రశ్నలకి ఇలా సమాధానాలు చెప్తే చాలు. మీ ఇంటర్వ్యూ సూపర్ హిట్ అయిపోతుంది! మాకూ, ఫైనాన్స్ మినిస్ట్రీకి కావాల్సింది మీరు పడిన శ్రమా, అతితక్కువ వ్యవధిలో అనుకున్నది సాధించిన విధం—ఇవే ప్రముఖంగా మనకి కావాల్సింది!" శౌరి నవ్వుతూ ఉద్రేకంతో అన్నాడు.

దండపాణి మొహం వెడల్పుగా సాగింది. "మా శ్రమని అంకెల్లో చెప్పాలంటే చిక్కు! ఎందుకంటే క్రాష్ ప్రోగ్రాంలా తయారైన లోన్ మేళా మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేసేసింది. అప్లికేషన్సూ, సెలెక్షనూ, పంపిణీ మొత్తాలూ వగైరా వివరాలు తెలిపే స్టేట్‌మెంట్స్ తయారుచేయడానికి బొత్తిగా వ్యవధిలేక పోయింది. అంతేక...."

"నెవర్ మైండ్! మీతో గోష్ఠి హైలైట్ అయి తీరుతుందని నాకు తెలుసు. ఇవాళ మంగళవారం. నేను మిమ్మల్ని వదిలేస్తాను. ఒక చక్కటి కథలా ఈ ఇంటర్వ్యూ తయారుచేయాలని ఆలోచిస్తున్నా. అన్ని పత్రికల్లోనూ వస్తున్న, శీర్షిక చదవగానే పాఠకులు

పేజీలు తిప్పేస్తున్న ఇంటర్వ్యూల్లా కాకుండా సరికొత్తగా వుండేలా మనిద్దరం దీన్ని తీర్చిదిద్దుతాం. రేపొద్దున మనదేశంలాంటి డెవలపింగ్ కంట్రీస్ నిర్వహించే లోన్ మేళాలకి స్ఫూర్తి ఇచ్చేవిధంగా మీతో గోష్ఠి రూపొందిస్తాం....సో....ఎల్లుండి గురువారం నేను మిమ్మల్ని కల్సుకుంటాను. అవసరమైన స్టాటిస్టిక్స్ మీరు మీ ముందుంచుకోండి. గంటలో ఇంటర్వ్యూ ముగిసిపోవాలి. ఎల్లుండి ఈవినింగ్ ఇంటర్వ్యూని డిస్పాచ్ చేస్తానని పత్రికకి వైర్ మెసేజ్ పంపేస్తాను. స్పేస్ కేటాయిస్తారు. అండ్ ఐ విల్ ట్రై టు గెట్ యువర్ ఫొటో అన్నది కవర్ ఇన్ కలర్...మీ కలర్ ఫొటో వుందా....వద్దులెండి....ఇంటర్వ్యూ సందర్భంలో నేను తీస్తాగా! 'ది లయన్ ఆఫ్ లోన్' అన్న కాప్షన్‌కి సరిపడేలా మీ ఫొటో తీద్దాం...."

"అదంతా అవసరమంటారా?" దండపాణి ఉక్కిరి బిక్కిరవుతూ ప్రశ్నించాడు.

"మీ ప్రశ్న మీ అమాయకత్వాన్ని తెలియజేస్తోంది. యూ ఆర్ సింపుల్ అండ్ మోడెస్టు! తరవాత చూడండి. ఫైనాన్స్ మినిస్ట్రి విలువా, ముఖ్యంగా దేశవ్యాప్తంగా మీ బ్యాంక్ విలువా, ఇంకా ముఖ్యంగా మీరు పనిచేస్తున్న ఈ బ్రాంచి విలువా, ఇంకా ముఖ్యంగా మీ విలువా ఎలా పెరిగిపోతాయో! ప్రభుత్వం అతి సులభంగా తలపెట్టిన బృహత్కార్యాన్ని అతి సామర్థ్యవంతంగా నిర్వహించి కొన్ని వేలమందికి ఉపాధి ఏర్పాటు చేసిన ఆదర్శ—మేనేజర్‌కి—లయనాఫ్‌లోన్‌కి ప్రభుత్వం పద్మవిభూషన్ ఎందుకు ఇవ్వకూడదు? అని నేను ప్రశ్నిస్తాను...."

"మిస్టర్ శౌరి, మీరు నన్ను ఓవర్ ఎక్స్‌పోజ్ చేసేస్తున్నారు! నన్నిలా వుండనివ్వండి!" దండపాణి నవ్వుతూ అన్నాడు.

"నన్నడిగితే, మీరు ఫైనాన్స్ మినిస్ట్రీలో చీఫ్ అడ్వైజర్‌గా వుండాలి!" శౌరి నవ్వుతూ లేచాడు.

"ఎల్లుండి లంచ్ బ్రేక్ తర్వాత వస్తాను. రెడీగా వుండండి. అప్పు పొందిన ఒకరిద్దరు అభ్యర్థుల్ని కూడా ఒకటి రెండు ప్రశ్నలు అడగడం మంచిదని అనుకుంటున్నా. మీ గురించి మీరూ నేనే కాకుండా సామాన్యుడు చెప్పేది కూడా వుండాం. సో, లోన్ ఇచ్చిన అభ్యర్థుల లిస్టు కూడా రెడీగా వుండేలా చూడండి! ఓ.కే.. థాంక్యూ."

* * *

బ్యాంక్‌లోంచి వరుణ్ శౌరి ఇవతలికి నడిచాడు. మేనేజర్ దండపాణి ఇంటర్వ్యూ యింత చక్కగా సాగితే అంత మంచి పేరొస్తుంది తనకి. రొటీన్ ప్రశ్నలు కాకుండా, పాఠకుడికి ఉత్సుకత కలిగించే ప్రశ్నల్ని తను రూపొందించుకోవాలి. పాఠకుల్ని ఆకర్షించే ప్రశ్నలు, ముందట దండపాణిని ఆకర్షించాలి! అలాంటి సవాలక్ష ప్రశ్నలు తను రూపొందించగలడు. అష్టావధానం చేస్తున్న అవధానికి సమస్యతో సగం పైగా విషయాన్ని, ఉపయోగించాల్సిన మాటల్ని ఇచ్చి, సులువుగా సమస్యకి పూరణం లాగగలిగే పృచ్ఛకుడిగా తను దండపాణిచేత సమాధానాలు చెప్పించగలడు! శౌరి నవ్వుతుంటూ సిగరెట్ వెలిగించాడు.

ఎడమవైపుకి తిరగబోతూ తటాలున ఆగాడు. మేనేజర్ గదిలో తమకి టీ సప్లై చేసిన జవాను కదిరయ్య పెద్ద ఫ్లాస్క్ పట్టుకుని జోరుగా కుడివేపు నడుస్తూ

న్నాడు. అతను ఇచ్చిన టీ రుచిని గుర్తుచేసుకుంటూ శౌరి అతన్ని వెంబడించాడు. నాలుగంగల్లో అతన్ని అందుకున్నాడు.

"కదిరయ్యా.... టీకి వెళుతున్నావా?"

కదిరయ్య ఉలిక్కిపడి ఆగి తిరిగిచూశాడు. చిట్లించిన అతని కళ్ళు చిటికెలో శౌరిని గుర్తించి మామూలుగా అయ్యాయి.

"ఓ.... తమరా? నా పేరు తమకెలా తెలుసు?" ఆశ్చర్యం కదిరయ్య కంఠంలో ప్రతిధ్వనించింది.

"మేనేజరుగారు పలుకుతూంటే విని, తెలుసుకున్నా!" శౌరి నవ్వుతూ అన్నాడు. "నీ టీ బావుంది. పద.... మళ్ళీ తాగుదాం!"

# 3

మూసిన తలుపుముందు అతను నిలబడ్డాడు. ఆలోచిస్తూ, చివరి దమ్ములాగి సిగరెట్ పీకని కిందపడేసి బూటు కొనని దానిమీద నొక్కుతూ వుండిపోయాడు. తనకు అందిన ఇన్‌ఫర్మేషన్ ప్రకారం అతను ఇప్పుడిప్పుడే నిద్రకి ఉపక్రమిస్తూ వుంటాడు. నిద్రకి అంతరాయం కలిగితే మనిషి చిరాకుగా ప్రవర్తిస్తాడు. చిరాకు అతన్ని త్వరలో డిఫెన్సివ్ మూడ్‌లో పడేస్తుంది. అతను డిఫెన్సివ్‌గా ప్రవర్తించడం తనకి ఒక విధంగా మంచిదే....

చిరునవ్వు అతని పెదాల్ని చీల్చింది. అతని చూపుడు వేలు కాలింగ్ బెల్ బటన్ మీద కత్తిలా గుచ్చుకుంది. మూడోసారి బెల్ నొక్కి అతను భుజాన్ని గోడకి ఆన్చాడు. అతను అప్పుడే అంత లోతుగా నిద్రలోకి జారుకుపోయాడా? 'లేదు' అని సమాధానం చెప్తున్నట్టు

తలుపు వెనుక అడుగులు చప్పుడు చేశాయి. క్షణంలో గొళ్ళెం చప్పుడు చేసింది. అతను గోడనుంచీ దూరంగా జరిగాడు. కుడిచేతిని కోటుజేబులోకి పోనిచ్చాడు....

తలుపు లోపలికి కదిలింది. తలుపు తెరిచిన వ్యక్తి ప్రశ్నార్థకంగా చూశాడు. లుంగీ బనీనుతో వున్నాడతను.

“మిష్టర్ కృష్ణారావ్....”

తలుపు తెరిచిన కృష్ణారావు గుమ్మంముందు నిలబడ్డ వ్యక్తిని ఎగాదిగా చూశాడు. డార్క్ కలర్ సూటు. నుదుర్ని పూర్తిగా దాచిపెడుతూ కిందికి వాలిన హేట్. పొడుగాటి ముక్కుకి రెండువైపులా సూటిగా తీక్షణంగా చూస్తున్న కళ్ళు. కోటుజేబులో దాగిన కుడిచెయ్యి. ఖరీదైన బ్రీఫ్ కేసుని పట్టుకున్న ఎడమచెయ్యి. క్యాలెండర్ లో బుద్ధుడి బొమ్మ చుట్టూ అవుపించే కాంతివలయంలా అతని ఆకారం చుట్టూ ఏదో అర్థంకాని అధికారం, హోదా, హుందా అవుపిస్తున్నట్టుంది. కృష్ణారావు చూపుల్ని ఆ వ్యక్తి మొహంమీదికి ఎక్కించాడు.

“....నేనే. తమరు....?”

జవాబుగా అతను తెల్లటి పళ్ళని చూపిస్తూ కుడిచేతిని ఇవతలికి లాగాడు. అర చేతిని కృష్ణారావు మొహం దగ్గరగా జరిపాడు.

“మీకు సైట్ వుంది. దూరంగా వుంచితే చదవలేరు. అందుకే దగ్గరగా వుంచాను!” అతను నవ్వుతూ అన్నాడు.

అతని అరచేతిలో ఇరుక్కున్న ఐడెంటిఫికేషన్ కార్డుని ఆశ్చర్యంగా చదువుతున్న కృష్ణారావు, ఆశ్చర్యం, కంగారూ, అర్థంకానితనం—అన్నీ కలిసిన చూపుల్ని

అటువైపు మళ్ళించాడు.

"తనుకి.... నాతో .... పనేమిటి....?"

"లోపలికెళ్ళి లోగుట్టు చెప్పుకుందాం, మిస్టర్ కృష్ణా రావ్!" ఆ వ్యక్తి నవ్వుతూ అన్నాడు.

కృష్ణారావు కాసేపు తటపటాయిస్తూ విగ్రహంలా వుండిపోయాడు. ఆ వ్యక్తిలో అవుపిస్తున్న హుందా, ఐడెంటిఫికేషన్ కార్డుమీద అవుపించిన హోదా కృష్ణా రావుని లోపలికి తీసుకెళ్తున్నాయి.

"మీరు వచ్చిన పనేమిటో చెప్తే...." కృష్ణారావు నసుగుతూ అన్నాడు.

"గుట్టు విషయాలు గుమ్మంలో చర్చించడం ప్రమాదం!" అతను నవ్వుతూ అన్నాడు. 'నీకు ప్రమాదం' అంటూ కృష్ణారావుని పరోక్షంగా హెచ్చరించింది అతని నవ్వు.

కృష్ణారావు లోపలికి జరిగాడు. ఆ వ్యక్తి అతన్ని వెంబడించాడు. హాలు పక్కనే వున్న చిన్న డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి కృష్ణారావు వెనక్కి తిరిగాడు.

"కమీషనర్ గారూ, కూచోండి........క్షణంలో వస్తా...." అంటూ కుర్చీ చూపించాడు.

కమీషనరుగారు కూచున్నారు. కృష్ణారావు గది లోంచీ వెళ్ళిపోయాడు. సిగరెట్ వెలిగించి కమీషనర్ వెనక్కి వాలాడు. దుస్తులు మార్చుకోడానికీ, దుస్తులు మార్చుకుంటూ ఆలోచించుకోడానికీ—కృష్ణారావు వెళ్ళాడని అతనికి తెలుసు! నవ్వుకుంటూ అతను కళ్ళు మూసుకున్నాడు ...

గుమ్మంలో చప్పుడైంది. ఇప్పుడు పాంటూ షర్టూ

ధరించిన కృష్ణారావు లోపలికి వచ్చి కుర్చీలో కూచు న్నాడు. 'ఏమిటో చెప్పండి' అన్నట్టు ప్రశ్నార్థకంగా చూశాడు. కమీషనర్ కుర్చీలో ముందుకి వాలాడు.

"అతి రహస్యంగా ఒక ఎంక్వయిరీ నిర్వహించమని మా డిపార్టుమెంట్ నన్ను ఆదేశించింది...."

"ఏ విషయంగా?" కృష్ణారావు అడ్డు తగిలాడు.

కమీషనర్ జవాబుగా పళ్ళు చూపిస్తూ నవ్వాడు. "మిస్టర్ కృష్ణారావ్, మీకూ మీ మేనేజర్‌కీ మధ్య 'పచ్చనోటు' వ్వస్తే భగ్గుమంటుందని విన్నాను...."

"అంటే?" కృష్ణారావు అయోమయంగా చూస్తూ అడిగాడు.

"అంటే,....అంతే! అంతే అంటే యేమిటో మీకు తెలుసు!"

"మీకెలా తెలును?" కృష్ణారావు నిట్టూర్చి ప్రశ్నిం చాడు.

"మాకు తెలిసే వుండాలి.... ఈ భూమ్మీద, ఆకాశం కింద జరిగేవన్నీ మాకు తెలుస్తూనే వుంటాయి!" కమీష నర్ సగర్వంగా అన్నాడు.

"మీ ఎంక్వయిరీ విషయం అదేనా? అలాంటి అతి చిన్న విషయాల్లో మీకు—ఐ మీన్, మీ డిపార్టు మెంటుకి — సంబంధం వుండటానికి వీలుండదనుకుం టాను...."

"అఫ్‌కోర్స్. అయితే, అతిచిన్న విత్తనం పెద్ద వట వృక్షాన్ని రూపొందించినట్టు, అతి చిన్న విషయాలు "చాలా పెద్ద" అసలు విషయాన్ని కనిపెట్టడానికి ఉపయోగిస్తాయి!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఇంతకీ అసలు విషయం...."

"మీ మేనేజర్ మీద మాకు కొన్ని రిపోర్ట్సు అందాయి. అవి అతనిమీద అనుమానాన్ని కలిగించేవిగా వున్నాయి. ఆ అనుమానాన్ని నివృత్తి చేసుకోడానికి నేను ప్రయత్నిస్తున్నా. నా ప్రయత్నానికి మీ సహకారం కావాలి! అంచేత...."

"సారీ...." కృష్ణారావు అడ్డు తగిలాడు. "మా వ్యక్తిగతమైన అభిప్రాయ భేదాలు...."

"డ్యూటీపరంగా కూడా మీరు అతనితో వ్యతిరేకించినట్టు మా పరిశోధన ఖాయంగా తెలియజేసింది. అల్ రైట్....మీరు అడక్కుండానే మీకు మరికొన్ని ముఖ్యమయిన విషయాలు చెప్తాను: మా అనుమానాలు నిజమయితే అతనికి డిమోషన్ వస్తుంది. అతని డిమోషన్ పరోక్షంగా మీకు ప్రమోషన్ అవుతుంది. ఎందుకంటే అతని తర్వాత సీనియర్ మీరే! తరువాత, విచారణలో పాల్గొని మాతో సహకరించిన మీ పేరు బైటికి రాదు. ఎందుకంటే, వ్రాత మూలకంగా మీ నుంచీ మేం ఏమీ తీసుకోం. చిన్న కాయితం ముక్కమీద కూడా మీరు సంతకం చేయరు. మా రిపోర్టులో మీ పేరు ఉండదు. ఉత్తరోత్తరా మీకు యేలాంటి భయమూ వుండదు. సో...."

"ఒక్కక్షణం...." కృష్ణారావు అడ్డు తగిలాడు. "నా లాగే ఆయనంటే సరిపడనివాళ్ళు యింకా ఒకరిద్దరున్నారు. వాళ్ళని వదిలేసి నన్నే ఎందుకు కల్సుకున్నారు మీరు?"

"అది మీ వ్యక్తిత్వానికి సంబంధించిన ప్రశ్న!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు. కృష్ణారావు అర్థంకానట్టు చూశాడు.

"మిస్టర్ కృష్ణారావ్, మీ భార్య 'సుచరిత' రచయిత్రి అని ఈ ప్రాంతంలో అందరికీ తెలుసు. సుచరిత పేరుతో కథలూ, వ్యాసాలూ, గేయాలు రాస్తోంది మీరే అని మాకు తెలుసు...."

"మీకెలా తెలుసు?" కృష్ణారావు ఆశ్చర్యంతో అడిగాడు.

సిగరెట్ ని యాష్ ట్రేమీద నొక్కుతూ కమీషనర్ సగర్వంగా నవ్వాడు. "మీ ఆలోచనాసరళీ, మీ వ్యక్తిత్వం,మీ సామాజిక దృక్పథం, మీ తపనా వగైరా లక్షణాలన్నింటినీ మీ రచనల ద్వారా, మీ భార్య పేరుమీద మీరు ప్రచురిస్తున్న రచనల ద్వారా—మేం బేరీజు వేశాం. ధర్మబద్ధమైన సమాజం కోసం మీరు కంటున్న కలలు వాటిలో మాకు శుభ్రంగా అవుపించాయి. అక్రమాన్ని యెదిరించి, నిరసించే మంచి లక్షణం మీ రచనల్లో, అంటే మీలో వుంది...."

"అంటే " నివ్వెరపాటు దాచుకోలేని కృష్ణారావు బొంగురుగా అన్నాడు.

"అంటే, మీ వ్యక్తిత్వం మాకు సహాకరిస్తుందని మా అంచనా!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఇంతకీ నేనేం చేయాలి?"

"నేను కొన్ని ప్రశ్నలు అడుగుతాను. మీరు సమాధానాలు చెప్తే చాలు...."

"అంతేనా?"

"ముందట్లో అంతే. మీరు నిజాన్ని దాచరనీ, అబద్ధాన్ని నిజంలా రంగు పులిమి చిత్రించరనీ మాకు నమ్మకముంది. ఇంతవరకూ మనుషుల విషయంలో మా డిపార్టుమెంటు నమ్మకం పొరపాటుగా తేలలేదు!"

కృష్ణారావు మెల్లిగా కుర్చీలోంచి లేచాడు. సాలోచనగా కిటికీ దగ్గరగా నడిచాడు. కిటికీగుండా బైటి లోకాన్ని కాసేపు పరిశీలిస్తూ వుండిపోయాడు. మెల్లిగా వెనక్కి తిరిగి, తనవేపే చూస్తున్న కమీషనర్ని తదేకంగా చూశాడు.

"మిస్టర్ కమీషనర్, మీరు నిర్వహించాలనుకొంటున్న యెన్క్వయిరీలో పాల్గొనడం నాకు యిష్టం లేదంటే మీరేం చేస్తారు?" ఉన్నట్టుండి కృష్ణారావు ప్రశ్నించాడు.

ఎదురుచూడని ప్రశ్న కమీషనర్ని ఆశ్చర్యంలో పడేసింది. అతని కనుబొమలు మధ్యలో కలుసుకున్నాయి. హాట్ని మరికొంచెం కిందికి లాగాడతను. మాట్లాడకుండా కోటు జేబులోంచి పాకెట్ తీసి సిగరెట్ తీసి వెలిగించాడు. పొగ వూది అగ్గిపుల్లను ఆర్పేసి జాగ్రత్తగా యాష్ట్రేలోకి దూర్చాడు. అతని తల కొద్దిగా పైకి లేచింది. అతని కళ్ళు రక్తాల్లా కృష్ణారావుని చూశాయి.

"మంచి ప్రశ్న అడిగారు! నాతో మీరు సహకరించకపోతే వచ్చినదారినే తిరిగి చూడకుండా వెళ్ళిపోతాను. మరేదేనా సోర్స్ దొరుకుతుందేమో ప్రయత్నిస్తాను. తరవాత తీరిగ్గా మీకు మా డిపార్టుమెంటు సమన్స్ పంపుతుంది. అత్యున్నతమైన హోదాలో వున్న అధికారి ప్రాతినిధ్యం ప్రవహించే ఏకసభ్య కమిషన్ ముందు మీరు టి.ఎ, డి.ఎ.లు తీసుకుని హాజరవుతారు. అడిగినవాటికంతా రాతమూలంగా సమాధానా లిస్తారు. సంతకాలు చేస్తారు..."

"అంటే...."

"పూర్తిగా వినండి!" కమీషనర్ కంఠంలో విసుగు ధ్వనించింది.

"ఆ ఏకసభ్య కమీషన్‌లో, ఎత్తైన సింహాసనం మీద కూచోని నేను మీకు దర్శనం ఇస్తాను...."

"అంటే?"

"అడ్డురాకండి!" కమీషనర్ కసిరాడు. "అప్పటికి మీ నిజాయితీని శంకించే స్థితికి చేరుకునే నేను వందలాది ప్రశ్నల్తో మీ మెదడుని చిల్లులు పొడిచేస్తాను!"

కమీషనర్ కళ్ళల్లో ప్రత్యక్షమైన మెరుపుని కృష్ణారావు కంగారుగా చూశాడు. అతని పిడికిళ్ళు రెండుసార్లు బిగుసుకుని వదులయ్యాయి. అతని పెదవులు కదిలాయి.

"అంటే...." అతను ప్రారంభించాడు.

కమీషనర్ చెవులకి అతని 'అంటే' వినిపించలేదు. గుమ్మం అవతల సన్నగా మోగిన గాజుల సవ్వడి అతని చెవుల్ని ఆక్రమించుకుంది. గుమ్మంవైపు మెల్లిగా తల తిప్పాడతను.

లావుగా పొట్టిగా వున్న స్త్రీ లోపలికి వస్తోంది. ఆమె నడకలో బెదురులేదు. ఆమె కృష్ణారావువైపు చూడ్డంలేదు. కుర్చీలో కూచున్న ఆమెని కమీషనర్ చిరునవ్వుతో చూస్తూ, మెల్లిగా పైకి లేచాడు.

"ఓకే....మిస్టర్ కృష్ణారావ్, సారీ ఫర్ ది డిస్టర్బెన్స్. వెళ్తాను...." అన్నాడు బ్రీఫ్‌కేస్ అందుకుంటూ.

"కమీషనర్‌గారూ, వెళ్ళకండి. కూచోండి!" అందామె.

కమీషనర్ ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూశాడు. ఆమె పెద్ద పెద్ద కళ్ళు అతని మొహంమీదే వున్నాయి.

"డ్రెస్ ఛేంజ్ చేసుకోడానికి వచ్చినప్పుడు ఆయన మీ రెవరో నాకు చెప్పారు. ఇంతిసేపూ జరిగిన మీ సంభాషణంతా విన్నాను. మీరన్నట్టు ఆయన నా పేరుతో కథలు రాస్తున్నారు. థేరింగ్‌గా, డాషింగ్‌గా వుండే ఇతివృత్తాల్ని ఆయనకి సజెస్ట్ చేసి రచనకి పురికొల్పేది నేనే!"

"మిసెస్ సుచరితా, క్షమించండి. ఆ విషయాన్ని మా డిపార్టుమెంట్ పసికట్టలేకపోయింది!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఫర్వాలేదు లెండి! ఒక రకంగా ఆయన మెతక మనిషి. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోడంలో ఆయన చురుగ్గా వ్యవహరించలేరు. అలాంటి సమయాల్లో నేనే ఆయనకి సహాయపడుతూ వుంటాను...." సుచరిత సగర్వంగా అంది.

"కంగ్రాచ్యులేషన్స్! యూ ఆర్ ది రియల్ బెటర్ హాఫ్!" కమీషనర్ కూచుంటూ అన్నాడు.

"థాంక్స్!" సుచరిత నవ్వుతూ సిగ్గుపడింది. క్షణంలో నవ్వు ఆమె సిగ్గుని మింగేసింది. "ఆయన మీ కమిటీ ముందు వ్రాతమూలకంగా కమిట్ అవరు! తను ముక్కుకి సూటిగా వ్యవహరించే అధికారి కింద పనిచేయటంలేదని ఆయనే నాతో చాలాసార్లు అన్నారు. మీ ప్రశ్నలకి ఆయన సమాధానాలు ఇస్తారు. ఆయన సమాధానాలు నిజంతో, నిజాయితీతో నిండివుంటాయని నేను ఖచ్చితంగా చెప్పగలను!"

"థాంక్యూ వెరీమచ్! అలా జరిగితే ఆయనకే మంచిది...."

"ఒక చిన్న ప్రశ్న: ఇందాకా డిమోషన్—ప్రమో

షన్ అంటూ ఏమిటో అన్నారు. ఆయన్ని ప్రమోట్ చేసి, 'అతన్ని' డిమోట్ చేసి, ఆయనకిందే పనిచేసేలా చేసే అవకాశం వుందా?" సుచరిత ధైర్యంగా అడిగింది.

తలవూపుతో కమీషనర్ ఆమెని మెచ్చుకున్నాడు. ఆమెని బరిమీదికి వొదిలేస్తే, అంగారకగ్రహమంత దూరంలో వున్న 'అవకాశాన్ని' అంగుళం దగ్గరికి లాగేసుందనిపించిందతనికి. సుచరిత ఇందిరాగాంధీ అంశతో జన్మించిందా!

"ఆ అవకాశానికి ఏ అడ్డూ లేదు!" అతను నవ్వుతూ అన్నాడు. "అయితే, 'ఆ వ్యక్తి' డొంకతిరుగుడు వ్యవహారం మీ ఆయన ఇచ్చే ఇన్‌ఫర్మేషన్ ఆధారంతో బైట పడాల్సి వుంటుంది ..."

సుచరిత నవ్వలేదు. మెల్లిగా పైకి లేచి భర్తవైపు సీరియస్‌గా చూసిందామె. "నిజం చెప్పడానికి మీరు యేనాడూ వెనకాడలేదు. రండి. కూచోండి. కమీషనర్ గారికి ఏం కావాలో చూడండి...."

"సుచరితా...." కృష్ణారావు సందిగ్ధంగా అన్నాడు.

"మీరేమీ రాయరు. సంతకాలు చేయరు. రేపొద్దున మీకు ఇబ్బంది కలిగించే ఆధారాలేవీ మీరు సప్లై చేయడంలేదు! ఏమంటారు కమీషనర్ గారూ?" సుచరిత చూపుల్ని తిప్పి అడిగింది.

"బాగా చెప్పారు. కృష్ణారావుగారు చెప్పేదేదీ నేను రాసుకోను. రికార్డు చేసుకోను. వింటాను. గుర్తుంచుకుంటాను. అవసరం తీరాక పరీక్ష రాసేసిన విద్యార్థిలా అంతా మరిచిపోతాను!" కమీషనర్ నవ్వుతూ అన్నాడు.

"ఇంకేం? రండి....క్షణంలో టీ తెస్తాను!" సుచరిత గదిలోంచీ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక కూడా 'రండి' అంటూ భర్తని ఉద్దేశించిన ఆమె ఆజ్ఞ గదిలో వేళ్లాడుతూ వుండి పోయిందని కమీషనర్ చిరునవ్వుతో గుర్తించాడు.

భార్య నిర్ణయాలకీ, ఆజ్ఞలకీ కృతజ్ఞతాపూర్వకంగా లొంగి వున్న కృష్ణారావు తేలిగ్గా కుర్చీవైపు నడిచాడు. కుర్చీలో కూచుని తేలిగ్గా కమీషనర్ని చూశాడు.

తగ్గు స్వరంలో కమీషనర్ ప్రారంభించాడు.

# 4

ఖరీదైన సూటు. ఖరీదైన బూట్లు. ఎడంచేతిలో ఖరీదైన లెదర్ బాగ్. ఎత్తుగా, బలంగా వున్న ఆకారం. వంకీలు తిరిగిన క్రాపు. గుబురు కనుబొమలు. రత్నాల్లా మెరుస్తున్న కళ్ళు. ఎర్రటి పెదవులు. సన్నటి మీసాలు.

అపరిచితుడైన వ్యక్తిని, తలుపు తెరిచిన దండపాణి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఎవరు?"

"అయామ్ శివరామ్...." అతని కంఠం ఖంగుమంది. అతని కుడిచెయ్యి ముందుకి సాగింది. "మీతో చాలా ముఖ్యమైన పని వుండి వచ్చాను."

దండపాణి కళ్ళు చిట్లించాడు. "మీరెవరో నాకు తెలీదు. మీకు ఎవరు కావాలి?"

"సాక్షాత్తుగా మీరే, మిస్టర్ దండపాణీ!" శివరామ్ నవ్వుతూ అన్నాడు; అతను నిర్లక్ష్యం చేసిన చేతిని కోటు జేబులో దోపుకుంటూ.

"ఆల్ రైట్....ఇవాళ ఆదివారం. రేపు బ్యాంకుకి

రండి...."

"బ్యాంకులో, మీతో నాకు పనిలేదు. ఇంట్లో, మీతో నాకు పని వుంది!"

"మీది ఏ డిపార్టుమెంట్?" పెద్ద హోదాలో వున్న అధికారిలా అవుపిస్తున్న శివరామ్‌ని దండపాణి ప్రశ్నించాడు.

"నాది పబ్లిక్ డిపార్టుమెంట్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

దండపాణి కళ్ళు చిట్లించాడు. "ఏం పనిమీ దొచ్చారు?" విసుగ్గా ప్రశ్నించాడతను.

"గడపముందు నిలబడి చెప్పే పనికాదు!"

"వాట్ డజ్ ఇట్ మీన్?"

"నా పనేమిటో ఇక్కడే నేను చెప్తే మీరు తలుపులు మూసేసి పరుగెట్టుకెళ్ళి పడగ్గదిలో మంచంమీద, తలగడకింద తలదూర్చేసి దాక్కుంటారు!"

దండపాణి కళ్ళు ఎరుపెక్కాయి. "వాట్ నాన్ సెన్స్...."

"లోన్ మేళాలో నువ్వు గుట్టు చప్పుడు కాకుండా గుటకాయ స్వాహా చేసిన పబ్లిక్ మనీ గురించి ఇక్కడ పబ్లిగ్గా మాట్లాడ్డం మంచిది కాదని నా నమ్మకం...."

"వాట్...."

"వాట్ వాట్ వాట్ అంటూ యల్. కే. జీ. పంతులమ్మలా నువ్వు అరుస్తూంటే వింటూ, అమాయకులైన ప్రజల సొమ్ముతో నువ్వు కట్టుకున్న కొంప గడప ముందు నుంచోడానికి నేను రాలేదు! అల్ రైట్.... నువ్వు చెప్పినట్టే రేపు రద్దీ యెక్కువగా వున్న సమ

యంలో నీ బ్యాంకుకి వస్తాను. ఈ లెదర్ బ్యాగ్ లో నీ కథని మోసుకొస్తాను. బ్యాంకు సిబ్బందికి, కస్టమర్స్ కి పేపర్లు పంచుతాను. లోన్ మేళా తెరమరుగున నువ్వు సాగించిన అడ్వెంచర్ గురించి 'సర్వజనికగోష్ఠి' నిర్వహిస్తాను!" శివరామ్ నవ్వుతూ ఆగాడు.

హోలీ పండగ నాడు చాలామంది చాలారకాల రంగుల్ని ఒకేసారి మొహంమీద చల్లిన ఎఫెక్టుతో కనిపిస్తున్న దండపాణి మొహంమీదే తన చూపుల్ని క్షణకాలం నాటి వుంచాడు. మెల్లిగా వెనక్కి తిరిగి, గేటు వేపు ఒకేవొక అడుగు వేశాడు.

"ఆగు...." దండపాణి కంఠంలోని వణుకు శివరామ్ చెవులకి తలత్ మెహమూద్ గజల్ ని గుర్తుచేసింది.

శివరామ్ ఆగాడు. ఇంకా వెనకే ఉన్న ఎడమ కాలిని, ముందున్న కుడికాలి పక్కకి చేర్చాడు. జేబులోంచి తీసిన సిగరెట్ ని పెదాలమధ్య ఇరికించాడు. లైటర్ తో సిగరెట్ ని వెలిగించాడు. నోటి నిండుగా పొగలాగాడు. గిరుక్కున వెనక్కి తిరిగి, పొగ ఊదుతూ దండపాణివైపు చిరునవ్వుతో చూశాడు.

దండపాణిలో సాగుతున్న సంశల సమరాన్ని అతని కళ్ళు భూతద్దాల్లా చూపిస్తున్నాయి. మెల్లిగా అతని పెదవులు కదిలాయి.

"ఇంతకీ.... నువ్వు.... నువ్వెవరు?"

"ఇందాకే చెప్పాను!"

"అదికాదు.... నిజంగా నువ్వెవరు?"

శివరామ్ సిగరెట్ కొసమీదికి గురిచూసి పొగని ఊదాడు. చిన్నగా నవ్వుతూ అతన్ని చూశాడు "నీలాంటివాళ్ళ స్వార్థాన్ని బుద్ధిబలం అన్న త్రిశూ

లంతో ముక్కలు ముక్కలుగా ఖండించేవాణ్ని!"

దండపాణి అయోమయంగా చూశాడు. "నా గురించి నువ్వు లేనిపోనివి విన్నట్టున్నావు ఆల్ రైట్....లోపలికి రా....నీ కథ ఏమిటో వింటాను...." అంటూ పక్కకి జరిగాడు.

"నా కథ కాదు; నీ కథ! నా కథని నువ్వు వినలేవు. నన్ను గురించి కలకూడా కనలేవు!" అంటూ శివరామ్ లోపలికి దూరాడు.

• • •

సోఫాలో కూచుని, శివరామ్ హాలంతటినీ కలయ చూశాడు. అతని చూపులు ఇంకా నిలబడే వున్న దండపాణివేపు తిరిగాయి.

"టాప్ క్లాస్ ఫర్నిచర్. ఖరీదైన సోఫాలు. ఇంపోర్టెడ్ కలర్ టీవీ. వీసీపీ. ఫ్రిజ్. టేప్ రికార్డర్. రేడియో. వాల్ నట్ టేబుల్. ఆయిల్ పెయింటింగ్స్. ఖరీదైన కర్టెన్స్. నీ ఇల్లో లక్ష్మి అఖండరీతిలో తూలుతుతోంది!"

దండపాణి రౌద్రంగా చూశాడు. "దటీజ్ నన్నాఫ్ యువర్ బిజినెస్!"

"సాటి మానవుడి బతుకు ఏ స్థితిలో వున్నా నేను నిర్లక్ష్యం చేయలేను!"

"సంతోషించాం. ఇందాకా ఏదో కూశావ్. ఏమిటి నీ ఉద్దేశం?" దండపాణి నిర్లక్ష్యంగా అరిచాడు.

ఇంకా నిలబడే వున్న అతన్ని శివరామ్ నవ్వుతూ చూశాడు.

"సిడౌన్!"

దండపాణి పెదవులు అదిరాయి. చేతులు పిడికిళ్ళుగా మారాయి. శివరామ్ కూచోడాన్ని అప్పుడే గుర్తించిన

వాడిలా చూశాడతను. అతనిలో మండుతున్న కోపం మొహంమీద ఎర్రగా ప్రతిఫలించింది.

"షట్టు యువర్ ట్రాప్! " హుంకరించాడతను.

శివరామ్ నవ్వుతూ కాలుమీద కాలువేసుకున్నాడు. సగం కాలిన సిగరెట్ని అతనివేపు రువ్వి కొత్తది వెలిగించాడు.

"ఐసే స్టాప్!"

"షటప్! నీ అంతట నువ్వే బ్లడ్ ప్రెషర్ పెంచుకోవద్దు. కాసేపట్లో, నేను నీ బయోగ్రఫీ మొదలెట్టగానే నీ బ్లడ్ ప్రెషర్ ఠవ్వన ఎగబాకుతుంది!" శివరామ్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"ఆల్ రైట్.......ఇందాకా గుమ్మంముందు పిచ్చి కుక్కలా ఏదో అరిచావ్! ఏమిటది?"

"మిస్టర్, నాది పిచ్చి అరుపు అని నీకు అనిపించి వుంటే రోడ్డుమీద నా అరుపులను లెక్కపెట్టి నన్ను లోపలికి రానిచ్చి వుండేవాడివి కావు. ఎందుకంటే పిచ్చివాడి అరుపులను లోకం పట్టించుకోదు. లోకం పట్టించుకోనంత కాలం నీకు భయంలేదు!"

"ఆ ఏడ్చేదేదో సరిగ్గా ఏడు!" దండపాణి గర్జించాడు.

శివరాం పకపకా నవ్వాడు. "నేను ఏడ్చేవాడిని కాను. నవ్వేవాణ్ని. నా నవ్వు నీలాంటి లుచ్చాల్ని ఏడిపిస్తుంది!"

శివరాం ఊహించని వేగంతో దండపాణి ముందుకి కదిలాడు. తటాలున ముందుకి వంగాడు. అతని ఎడమ చెయ్యి శివరాం నెక్ టైనీ, కాలర్నీ కలిపి పట్టకారులా పట్టుకుంది. పళ్ళు కొరుకుతూ శివరాం మొహంలోకి ఆగ్ర

హంతో చూశాడతను.

"యూ బాస్టర్డ్!" దండపాణి బుసకొట్టాడు. అతని చెయ్యి కదిలింది. రెప్పల్ని వాల్చి శివరాం తన కాలర్ పట్టుకున్న దండపాణి చేతిని రెప్పపాటు కాలం చూశాడు. అతని ఎడమచెయ్యి మెరుపులా కదిలి, దండపాణి ముంజేతిమీద వాలింది. వేళ్ళు మంకీర్పానర్‌లా ముంజేతిని చుట్టేశాయి. ఇండియన్ డెడ్‌లాక్ లాంటి పట్టు దండపాణి చేతిచుట్టూ బిగుసుకుంది.

శివరాం చిరునవ్వుతో అతని మొహంలోకి చూశాడు. దండపాణి మొహంమీది ఆగ్రహం అంతర్ధానమయిపోతోంది; చెప్పరాని బాధ కెరటంలా ప్రత్యక్షమవుతోంది. అతను కంగారుగా తన ముంజేతిని చూసుకున్నాడు. కాలర్‌ని బిగించిన అతని వేళ్ళు వదులయ్యాయి.

దండపాణి చేతిని కొద్దిగా మెలిదిప్పుతూ శివరాం విసురుగా తోశాడు. రెప్పపాటులో దండపాణి తూలి వెనకున్న మరో సోఫాలో పడ్డాడు. శివరాం మెరుపులా కదిలాడు. లేవడానికి తన్నుకుంటున్న దండపాణి భుజమ్మీద అతని చెయ్యి పాముపడగలా వాలింది. చేతిమీద వొత్తిడి అధికం చేస్తూ శివరాం ఎడమకాలిని దండపాణి పక్కనే సోఫామీద పెట్టాడు. కుడిచేత్తో నెక్టై సవరించుకున్నాడు.

"యూ బాస్టర్డ్ ....యూ...." దండపాణి రొప్పుతూ ప్రారంభించాడు.

శివరాం కుడిచెయ్యి కదిలింది. బొటనవేలికీ, నడిమివేలికీ మధ్య దండపాణి దవడల్ని ఇరికించి బలంగా నొక్కుతూ శివరామ్ అతని కళ్ళల్లోకి తీక్షణంగా

చూశాడు.

"ఇంతవరకూ నా చొక్కా పట్టుకున్నవాడు లేడు. నువ్వు పట్టుకున్నావ్. కాసేపట్లో నా చొక్కా పట్టుకున్నందుకూ, ఈ లోకంలో పుట్టినందుకూ విచారిస్తూ భోరున ఏడుస్తావ్!" శివరాం కంఠం కంచుగంటలా ఖంగుమంది.

శివరాం కళ్ళమధ్య నలుగుతూ అష్టవంకర్లు పోయిన మొహంతో, భయం నిండిన కళ్ళతో దండపాణి అయోమయంగా చూశాడు. అతన్ని వదిలేసి శివరామ్ నిటారుగా నించున్నాడు. కళ్ళు దించి నిర్లక్ష్యంగా చూశాడు.

"నేను బుర్రతో, మేధస్సుతో యుద్ధం చేసేవాణ్ని; చేతులతో పోరాడే నగటు మనిషిని కాను. కానీ, నువ్వు కావాలంటే కుడిచేతిని కోటుజేబులో వుంచేసుకుని ఎడం చేత్తో నీతో పోరాడుతాను. నలభై రోజుల సిక్ లీవ్ మీద ఫత్తూరు వెళ్ళే స్థితికి నిన్ను తీసుకెళ్తాను!" శివరామ్ నవ్వుతూ అగాడు.

దండపాణి గుడ్లు మిటకరిస్తూ చూశాడు. కందిపోయిన అతని బుగ్గల్ని సంతృప్తికరంగా చూస్తూ శివరామ్ ఎగతాళిగా నవ్వాడు. "కమాన్! మాట్లాడు! 'బస్తీమే సవాల్' అంటూ బస్తీకి వస్తావా. చెప్పేదంతా చెవులప్పగించి విని, చెప్పినట్టు చేతులారా చేసి, బతుకు జీవుడా!' అంటూ పరువు కాపాడుకుంటావా?"

దండపాణి బుసలుకొడుతూ, ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. చివరికి అతని పెదవులు కదిలాయి. "ఏమిటి నువ్వు చెప్పేది?"

శివరామ్ నవ్వుతూ సోఫాలో కూచున్నాడు. వెనక్కి-

వాలి సిగరెట్ వెలిగించాడు. "నేను చెప్పేదానికి ప్రారంభంలో నువ్వొక్కడివే శ్రోతగా వుండటం నీకు మంచిదని, నీ సతీమణి యింట్లోలేని ఈ ముహూర్తం ఫిక్స్ చేశాను!"

"వచ్చిన పనేమిటో మర్యాదగా, త్వరగా చెప్పి వచ్చిందారి పట్టకపోతే పోలీసులకు ఫోన్ చేసి న్యూసెన్స్ కేసు తగిలిస్తాను! నన్ను చాలా తక్కువగా అంచనా వేసుకున్నట్టున్నావ్. నేను అనుకుంటే...."

"హోల్డాన్! ఇక గుర్రాన్ని కట్టెయ్ దొరా!" శివ రామ్ నవ్వుతూ అతనికి అడ్డు తగిలాడు. "నిన్ను తక్కు వగా అంచనా వేశానన్నావ్. అయామ్ సారీ! నిన్ను నేను ఎంత ఎక్కువగా అంచనా వేశానో వింటే ఆశ్చర్య పోతావ్! ఇంక న్యూసెన్సన్నావు; కేసన్నావు. నేనింకా న్యూసెన్స్ ప్రారంభించలేదు. ప్రారంభిస్తే—నా న్యూ— "సెన్స్" నీకు మతిపోగొట్టేసుంది!"

దండపాణి యేదో అనబోయి, దాని బదులుగా బుస కొట్టాడు.

శివరామ్ అతని కళ్ళల్లోకి కత్తికొనల్లో గుచ్చుతున్నట్లు చూశాడు. "ఆదర్శప్రాయుడుగా తయారైన మేనేజర్' ప్రభుత్వం యేర్పాటుచేసిన లోన్ మేళాని చాలా చాలా తెలివిగా, సమయస్ఫూర్తితో సొంతానికి ఉపయోగించు కున్నావ్! నీ బ్రెయిన్ వర్క్ అద్భుతం. కంగ్రాట్స్!"

"ఏమిటి నీ ఉద్దేశం?...." దండపాణి గర్జించాడు.

అతని నోరు గర్జిస్తోందనీ, అతనిలోపలి అనుమానాన్ని అతని కళ్ళు నీడలా చూపిస్తున్నాయనీ శివరామ్ చిరు నవ్వుతో గుర్తించాడు.

"నా ఉద్దేశం తరవాత. ముందు నా అర్థం చెప్తాను!"

శివరాం నవ్వుతూ అన్నాడు. "20 పాయింట్ ప్రోగ్రాం క్రింద ప్రభుత్వం నీ బ్యాంక్ పరిధిలో, నీ ఆధ్వర్యంలో, కేవలం ఒకే వారం రోజుల్లో మూడువందలా ఇరవై ఒక్కమందికి బలహీనవర్గాల బలిపశువులకు పాతిక వేలు వంతున ఋణాలు ఇప్పించింది. ఆ మూడువందలాఇరవై ఒక్కమందికీ నువ్వు అక్షరాలా ఎనభైలక్షలా ఇరవై అయిదువేల రూపాయలు చెల్లించినట్లు నీ లెక్కలు చూపుతున్నాయి. అయితే, ఆ లోన్ మేళా సందర్భంలో కేవలం సరిగ్గా రెండువందలమందికి మాత్రం పాతిక వేల వంతున పైకం—నికరంగా యాభైలక్షలు నిజంగానే చెల్లించబడింది. తతిమ్మా నూట ఇరవైయొక్కమంది వ్యక్తుల పేర్లతో చెల్లించబడిన ముప్ఫైలక్షలా పాతిక వేలు ఎవరి బొజ్జలో దాక్కుందో నేను కనిపెట్టాను...." శివరామ్ ఆగి, నవ్వుతూ చూశాడు.

దండపాణి తేలిగ్గా నిట్టూర్చాడు. "అదా సంగతి! నువ్వూ ఆ గ్రూప్‌లో అప్లై చేసినట్టున్నావ్. నీకు లోన్ మంజూరు కాలేదు. అందుకు డాబుసరిగా సూటూ బూటూ వేసుకుని తయారై నామీద బురద చల్లడానికి పరుగెట్టుకొచ్చావ్! నీ పనికిమాలిన అనుమానాన్ని దిక్కున్నచోట చెప్పుకో! నౌ గెటౌట్!"

శివరామ్ పకపక నవ్వాడు. "దురదృష్టవశాత్తూ ఇప్పటికి నాకున్న దిక్కు నువ్వే! నువ్వు విని, అర్థం చేసుకుని, జీర్ణం చేసుకుని, అర్థవంతంగా వ్యవహరించకపోతే ఇప్పటికే కాతికి పెట్టుకున్న మరో "పెద్ద దిక్కు" వద్దకు వెళ్తాను!"

"గెట్ లాస్టు!" దండపాణి నిర్లక్ష్యంగా హుంకరించాడు.

"నీతో మాటల కబడీ ఆడే తీరికా, ఓపికా నాకు లేవు. అంచేత మూడు ముక్కల్లో అసలు విషయం చెప్పేస్తాను: నోరు మూసుకుని వింటే 'సత్యం' నీకు అరచేతిలో నెల్లికాయిలా ప్రత్యక్షమవుతుంది!" శివరామ్ ఆగి సిగరెట్ పీకని యాష్ట్రేలో నొక్కాడు.

"లోన్ మేళా జరిగిన శుభముహూర్తంలో, డ్రాఫ్ట్స్ ఇచ్చే మంత్రిగారి చేతులు అలిసిపోతాయన్న ముందు చూపుతో నువ్వు లాంఛనప్రాయంగా నూటపదహారు మందికి మాత్రం ఇప్పించావు. తతిమ్మా వాళ్ళకి—అంటే రెండువందల అభ్యర్థుల్లో తతిమ్మా వాళ్ళకి బ్యాంకే జారీ చేసే యేర్పాటు చేశావు. పోతే, మిగిలిపోయిన నూట ఇరవై ఒక్కమంది—"ఇన్విసిబుల్ పీపుల్" తరఫున ముప్ఫైలక్షలా పాతిక నువ్వే స్వీకరించావ్!"

"నాన్సెన్స్! బ్యాంక్ రికార్డ్సు గురించి నీకు తెలీదు. చేయాల్సినవాళ్ళంతా తనిఖీలు చేశారు. నా సేవని, నా నిస్వార్థ సేవని ప్రభుత్వం కూడా మెచ్చుకుంది. ఒక ప్రముఖ పత్రిక నన్ను ఇంటర్వ్యూ చేసింది. నీ అభాండాలు...."

శివరామ్ నవ్వు దండపాణికి అడ్డు అగిలింది. "ఒక ప్రముఖ పత్రిక, ఇంకా పుట్టని "మదర్ నేషన్" పత్రిక తరఫున నిన్ను ఇంటర్వ్యూ చేసిన ఫ్రీలాన్స్ జర్నలిస్టు అయిన యీ శివరామ్‌కి నీ యింటర్వ్యూ గురించి చెప్తావా?"

"వాట్!" దండపాణి అరిచాడు. "ఐ వోంట్ బిలీవ్ యూ!"

"నమ్మకపోతే నాశనమవుతావ్!" శివరామ్ గంభీరంగా అన్నాడు. "నిన్నే కాదు; రకరకాల హోదాల్లో

నేను చాలామందిని ఇంటర్వ్యూ చేశాను. వాళ్ళల్లో నీ బ్రాంచి సిబ్బందీ, నూటఇరవై ఒక్కమందిని ఇంట్రు డ్యూస్ చేస్తూ సంతకాలు చేసి, అమాయకంగా నీతో సహకరించి పారితోషికంగా నీ నుండీ తలా ఒక కలర్ టీవీ సెట్ పొందిన నీ ఆరుగురు మిత్రులూ వున్నారు...."

"నాన్సెన్స్...."

"సులోచనరావు, కరివీరయ్య, గంగానాధ చౌదరి, సుందర మొదలియార్, గుర్నాధరెడ్డి, రామగోపాల నాయుడు—ఈ ఆరుగురూ నాకు ఆ సంగతి తెలియ జేశారు; రాతమూలకంగా. ఈ ఆరుగురిలో ఎవరెవరు ఏయే అకౌంట్స్ ఓపెన్ చేయడానికి సంతకాలు చేశారో కూడా నా లిస్టులో వుంది...."

"నో!"

"యూ డోంట్ నో మేనేజర్! శివరామ్ నవ్వుతూ అన్నాడు. "నీ వ్యవహారం మొత్తం యీ సంచీలో వుంది!"

శివరామ్ చెయ్యి సంచీలో దూరింది. మెస్మరిస్టులా అతను మడత పెట్టిన కాగితాల్ని దండపాణి వొళ్ళో పడేలా విసిరాడు.

"లోన్ మేళా సందర్భంగా నీ బ్యాంకునుండీ లోన్ పొందిన వాళ్ళ పేరులూ, చిరునామాలూ, అకౌంటు నెంబరులూ, మొత్తాలూ—అన్నీ ఆ జిరాక్స్ కాపీల్లో వున్నాయి. చూసుకో!" అంటూ శివరామ్ అతన్ని పట్టించుకోకుండా సిగరెట్ వెలిగించాడు.

అప్రయత్నంగా కాగితాల్ని విడదీసి చూస్తున్న దండ పాణి చేతులు అప్రయత్నంగా వణికాయి. అతను

కోపంతో ఎర్రబడ్డ మొహాన్ని శివరామ్ వయిపు తిప్పాడు.

"ఇవి—ఇవి నీ కక్కుడివి?...." హుంకరించాడతను.

"జిరాక్స్ కాపీల జన్మస్థానం ఎక్కడో, వాటి మాతృకలు యేవో నీకు తెలిసేవుండాలే!" శివరామ్ ఎగతాళిగా అన్నాడు. అతని చెయ్యి సంచీలోంచి మళ్ళీ ఇవతలికి దూకింది. మరో విడత ఫోటోకాపీలు దండపాణి బల్లమీద విసురుగా పడ్డాయి.

"నీ స్నేహితుల్ని గుడ్డిగా నమ్మి, పిలిచినప్పుడల్లా వచ్చి, నీ బుర్రతో నువ్వు సృష్టించిన అకౌంటుహోల్డర్లని, అప్పు పొందే అభ్యర్థులని బ్యాంకుకు గుడ్డిగా పరిచయం చేస్తూ, అమాయకంగా సంతకాలు చేసిన నీ ఆరుగురు మిత్రులూ తమని "ఇంటరాగేట్" చేసిన "సీబీఐ కమీషనర్"కి రాసిచ్చిన స్టేట్‌మెంటు నకళ్ళు! చదువుకో!" శివరామ్ ఉపోద్ఘాతంలా అన్నాడు.

"ఇది....ఇది అన్యాయం!" అయోమయంతో, అవమానంతో ఉక్కిరిబిక్కిరవుతున్న దండపాణి అప్రయత్నంగా అరిచాడు.

"నైస్! అన్యాయం అన్నావ్; అబద్ధం అనలేదు!" శివరామ్ వెటకారంగా అన్నాడు.

దండపాణి రౌద్రంగా చూశాడు. "ఇప్పుడంటాను: ఇది పచ్చి అబద్ధం! నువ్వు....నువ్వు ...ఏదో నాటకం ఆడావు, ఆడుతున్నావు....నిన్ను....నిన్ను...."

"షటప్!" శివరామ్ అరిచాడు. "ఇలాంటి 'అన్యాయాలు' ఈ సంచీలో ఇంకా వున్నాయి...."

"సంచీని చంకకి తగిలించి మోసుకెళ్ళు! ఐ డోంట్

కేర్! కొన్ని వేలమందిలో, లక్షలమందిలో ఎవరెవరికి అప్పులిచ్చామో ఖచ్చితంగా చెప్పడం పరబ్రహ్మతరం కాదు! లెక్కల్లో వున్న ప్రకారం అందరికీ అప్పు అందింది. అది అబద్ధమని నిరూపించడం నీ తరం కాదు; నీ తాతతరం కాదు!''

కోపంతో ఊగుతున్న దండపాణిని శివరామ్ చిరునవ్వుతో చూశాడు. "నిన్ను మసి చేయడానికి ఈ మనవడు చాలు; తాత అక్కర్లేదు! నువ్వన్నది నిజమే. అత్యధిక సంఖ్యలో వచ్చే అప్లికేషన్స్‌నీ, కొద్దిపాటి సిబ్బందినీ, అతి తక్కువ కాలవ్యవధినీ దృష్టిలో వుంచుకుంటే ఖచ్చితంగా లెక్కలు రాయడం అసంభవమని నీ సోదర బ్యాంకు ఉద్యోగులు అన్నారు కూడా. ఆ గందరగోళమే నీకు వరం అయ్యింది!" శివరామ్ నవ్వుతూ ఆగాడు. మంత్రముగ్ధళ్ళా చూస్తున్న దండపాణికి తేరుకునే అవకాశం ఇవ్వకుండా ప్రారంభించాడు.

"అయితే, నాకు అదేమంత కష్టమైన ఘనకార్యమేం కాదు! నేను ఈ ఏరియాలో ప్రతీ యింట్లోవున్న వ్యక్తుల వివరాలు సంపాయించాను. బలహీనవర్గాలూ, బలవంత వర్గాలూ—అన్నీ! నా దగ్గర నీ బ్యాంకు పరిధిలో లోన్‌కి దరఖాస్తు చేసే అర్హతవున్న వ్యక్తులందరి పేరులూ, వయసులూ, అర్హతలూ, అడ్రసులూ వున్నాయి. ఎవరెవరు అప్పు చేశారో వాళ్ళ పూర్తి వివరాలు విడిగా వున్నాయి. ఎవరెవరికి లోన్ అందిందో, యెంతెంత అందిందో వాళ్ళ బ్యాంకు ఖాతా వివరాలతో సహా— నా దగ్గరున్నాయి...."

"నో! ఇంపాసిబుల్...."

"నోర్ముయ్!" శివరామ్ గర్జించాడు. "ఉబ్బితబ్బి

బ్బవుతూ ఇంటర్వ్యూలో నువ్వు వాగిన సమాచారం, లెక్కలూ, వివరాలూ వున్నాయి. అతి చాకచక్యంగా నేను సంపాయించిన నీ బ్యాంకు రికార్డుల కాపీలూ వున్నాయి...."

"ఉంటే భద్రంగా దాచుకో! యూ...."

"ఇలాగే వాగితే లేచి వెళ్తాను. ఈ ఎవిడెన్సంతనీ నేను దాచుకోను. అమాయకుల పేరుతో అమాయకులైన ఖాతాదార్ల సొమ్మును దోచుకుతిన్న నీలాంటివాళ్ళని కైమా చేయడానికి ఉవ్విళ్ళూరుతున్న సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ కి ఉచితంగా ఇస్తాను. నా శ్రమకి ప్రతిఫలం రావాలి. మరిన్ని కాపీల్ని వివిధ పత్రికలకి అత్యధికధరకి విక్రయిస్తాను!" శివరామ్ నవ్వుతూ ఆగాడు.

ఉన్నట్టుండి దండపాణి ముఖం చెమటతో తడవడం ప్రారంభించింది. "నువ్వు........నువ్వు....బుకాయిస్తున్నావ్ నీకు...."

"నేను నిర్వహించిన ఎన్యూమరేషన్ ప్రకారం ఈ పీరియాలో అయిదు వేలా ఎనిమిదివందలా తొంభై నలుగురు అప్పు పొందే అర్హత వున్న వ్యక్తులున్నారు. అంతమందిలో కొన్ని వందలమందికే నువ్వూ, ప్రభుత్వం ఎందుకు ఎన్నుకున్నావో నాకు తెలీదు. అన్నివేలమందిలో కేవలం సరిగ్గా రెండువందలమందికి మాత్రమే అప్పు ముట్టింది. తతిమ్మా నూటఇరవై ఒక్కమందీ ఎక్కణ్నుంచి వచ్చారు?" శివరామ్ ప్రశ్నించాడు.

దండపాణి ఉక్రోషంతో అరిచాడు. "ఎక్కణ్నుంచీ? ఆకాశం నుండీ ఊడిపడ్డారంటావా?"

శివరామ్ పకపక నవ్వాడు. "ఎగతాళిగా అన్నా,

నిజం అన్నావ్. నిజంగా వాళ్ళంతా ఆకాశంనుండీ ఊడిపడిన వాళ్ళే: ఆకాశరామన్నలే! భూమ్మీద జీవిస్తూ, నీ ఏరియా — ఐమీన్ నీ బ్యాంక్ పరిధిలో వున్న వ్యక్తుల పేర్లతో ఢీకొనకుండా దాదాపు వంద కల్పిత నామధేయాల్ని ఊహించావ్! మెచ్చుకోవాల్సిందే!"

దండపాణి క్షణంలో కళ్ళు తిరిగి పడేవాడిలా చూశాడు. అతను చుట్టూ అల్లుకున్న దర్పం, ధైర్యం, హుందా అన్న కవచాలన్నీ టకటక చిట్లిపోతున్నట్టు శివరామ్ తృప్తికరంగా గమనించాడు.

"సో, మిస్టర్ దండపాణీ, గుంపులో గోవిందరావులుగా నువ్వు నీ బుర్ర అనే సద్యోగర్భంలోంచీ పుట్టించిన నూటఇరవై ఒక్క మంది అభ్యర్థులకి అప్పులు మంజూరు చేసి, నీ చేతుల్తో నీ బొజ్జలోకి సరఫరా చేశావ్! ఇది ఘోరం! అంత మొత్తం నీకు జీర్ణంకాదు; కారాదు...."

"ఏం చేస్తావ్?" దండపాణి తాగిన వాడిలా ప్రశ్నించాడు.

"కానివ్వను!"

"ఏమిటి?" దండపాణి అయోమయంగా గొణిగాడు.

"జీర్ణం!" శివరాం నవ్వుతూ అన్నాడు.

పీడకల కంటూ హఠాత్తుగా మేల్కొని దిక్కు తోచనట్టు చూస్తున్న వ్యక్తిలా క్షణకాలం శివరామ్‌ని చూసి, దండపాణి సోఫా వెనకభాగం మీదికి తల వాల్చేశాడు. అసంకల్పితంగా రెండు చేతుల్తో కణతల్ని వొత్తుకున్నాడు. వెనకటి ధైర్యం, కాదనే స్థైర్యం లేకుండా సతమతమైపోతున్న తన విక్టిమ్‌ని శివరామ్ చిరునవ్వుతో చూస్తూ పైకి లేచాడు.

"ఓకే, దండపాణీ, ఇప్పుడు నీ చేతిలో దండంలేదు. నీ రెండు చేతుల్నీ కేవలం నాకు దండం పెట్టడానికి మాత్రం ఉపయోగించే వీతిలో వున్నావ్. అయినా దాన్ని నువ్వు గుర్తించలేదు. వెరీవెరీ డిస్కరేజింగ్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

దండపాణి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. నెత్తురు గుంటల్లా వున్న కళ్ళతో, కొత్త నివ్వెరపాటుతో చూశాడు.

"నీకోసం నువ్వే చురకత్తుల బోను తయారుచేసుకున్నావ్! ప్రతీ అప్లికేషన్నీ స్వయంగా పరిశీలించి, పరిశోధించి అర్హులైనవాళ్ళకే అప్పుమంజూరు చేశానని ఇంటర్వ్యూలో గొప్పలు చెప్పుకున్నావ్. నిజంగానే పద్మభూషణ్ బిరుదు వచ్చేస్తుందేమో అన్న తాపత్రయంతో లోన్ మేళాని కేవలం నువ్వొక్కడివే స్వయంగా నిర్వర్తించినట్టు చెప్పుకున్నావ్. వరుణ్ శౌరి పేరుతో, మరో వేషంలో నేను సాగించిన 'నీతో గోష్ఠి'ని సర్టిఫై చేస్తూ సంతకం చేశావ్! సంతకం అంటే గుర్తొస్తోంది; నువ్వు సృష్టించిన ఋణగ్రస్తుల సంతకాల్ని ఎలా ఫోర్జ్ చేయగలిగావో నేను ఊహించలేకుండా వున్నాను!" శివరామ్ ఆగి కళ్ళు తెరుచుకునే గాఢనిద్రలోకి జారుకున్న వ్యక్తిలా అవుపిస్తున్న దండపాణిని కళ్ళు చిట్లిస్తూ చూశాడు. దెబ్బలు తినీతినీ మొద్దుబారిపోయి బండిలాగకుండా మొరాయిస్తున్న మొండి ఎద్దు గుర్తొస్తోందతనికి దండపాణి వాలకం చూస్తోంటే.

శివరామ్ అతన్నే చూస్తూ సిగరెట్ ముట్టించాడు. తటాలున వొంగి సోఫామీదున్న లెదర్ బాగ్ని అందుకున్నాడు. తదేకంగా దండపాణి మొహంలోకి

చూశాడు.

"ఆల్ రైట్! నా మాటలు రబ్బరు సుత్తి దెబ్బల్లా నీమీద పనిచేస్తున్నట్టున్నాయ్. నా అభియోగాన్ని అసలు నిజంగా అంగీకరించే ఇంగితం నీలో అవుపించడం లేదు. వెళ్తాను. ఆధారాలన్నీ యిచ్చి నా 'అనుమానం' నిజమేమో తప్పో చూడమని సిబీఐని హెచ్చరిస్తాను. అప్పుడు తీరిగ్గా నా నిజాల్ని నీ అబద్ధాలుగా రుజావు చేసుకో! బాడ్ లక్ అండ్ గుడ్ బై!"

శివరామ్ చకచకా గుమ్మంవేపు కదిలాడు. దండపాణి నుండీ ఏ శబ్దమూ అతనికి వినిపించలేదు. గుండె ఆగి చచ్చాడా? ఆలోచిస్తూ అడుగులేస్తున్న శివరామ్ అనుమానాన్ని బొంగురుగా ధ్వనించిన దండపాణి కంఠం పటాపంచలు చేసింది.

"ఆ....గు...."

శివరామ్ వెనక్కి తిరిగాడు. సోఫాలో పక్కకి తిరిగి తనవేపు కంగారుగా చూస్తున్న దండపాణిని చిరునవ్వుతో చూశాడు.

"ఈ క్షణంలో, ఈ స్థలంలో నన్ను ఆపగలిగింది ఒక్కటే" శివరామ్ గంభీరంగా అన్నాడు. "డబ్బు!"

"వాట్!" దండపాణి బోదురు కప్పలా అరిచాడు.

"దేనికోసమైతే నువ్వు ధృతరాష్ట్రుడిని మించిపోయి— నూటఇరవై ఒక్కమంది వ్యక్తుల్ని కల్పించావో, దేనికోసమైతే, ఈ భూ ప్రపంచంలో లేని ఆ వ్యక్తుల అసత్య నామధేయాలతో రికార్డులు తయారుచేసి, అన్ని సంతకాల్నీ సవ్యసాచిని వెక్కిరిస్తూ రెండు చేతుల్తో బరికావో— ఆ డబ్బు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

దండపాణి సరిగ్గా పనిచేయని మెగాఫోన్‌లా

బుస్సున నిట్టూర్చాడు. అతని రెండో రూపాన్ని చూస్తున్న అనుభూతి కలుగుతోంది శివరామ్‌కి.

ఆరిపోయిన దండపాణి పెదవులు మెల్లిగా కదిలాయి. "నీ పేరు?....మరిచిపోయాను...."

దీనంగా పలికిన అతన్ని శివరామ్ చిరునవ్వుతో చూశాడు.

"శివరామ్."

"శివరామ్...." ఉలిపికికాయితాన్ని నోటికి అడ్డం పెట్టుకుని పలికినట్టుగా అన్నాడు దండపాణి. "నిజం చెప్పు: నువ్వు....నిజీవి వ్యక్తివా?"

"నీలాంటి లుచ్ఛాలతో అబద్దాలాడ్డం నాకు అస హ్యం!. నేను కేవలం నేనే. డబ్బుకోసం దారుణాలు చేసే నీలాంటి వాళ్ళని శిక్షించేవాణ్ణి!" శివరాం కంఠం గంభీరంగా ధ్వనించింది.

దండపాణి మళ్ళీ నిట్టూర్చాడు. "కూచో....మాట్లాడదాం...." అన్నాడు బలహీనంగా.

శివరామ్ నవ్వుతూ సోఫావైపు కదిలాడు. ఆరిపోయిన సిగరెట్‌ని గిరాటేసి, కొత్తది వెలిగించాడు. పాకెట్‌ని జేబులో పెట్టుకోబోతూ ఆగి, నవ్వుతూ దాన్ని దండపాణి వొళ్ళోకి పడేశాడు.

ఒణుకుతున్న చేతుల్తో దండపాణి సిగరెట్ పాకెట్ తెరిచాడు. అతిప్రయత్నంమీద సిగరెట్‌ను లాగి, పెదాల మధ్య ఇరికించాడు. శివరామ్ నవ్వుతూ పైకి లేచి, లైటర్‌ని అదురుతున్న సిగరెట్ కింద వుంచి నొక్కాడు. ఘాటుగా పొగ పీల్చి దండపాణి దగ్గుతూ వుండిపోయాడు. అతని కళ్ళు నీళ్ళతో నిండాయి.

అతని కన్నీళ్ళకి కారణం సిగరెట్టో, తనో అర్థంకాక శివరామ్ నవ్వుతుంటూ సోఫామీద కూచుని, కాలుమీద కాలు వేసుకున్నాడు.

"శివరామ్, నీకు....యెంత....యేమిటి....కావాలి?" సిగరెట్ పొగతో కొద్దిగా కోలుకున్న దండపాణి ప్రశ్నించాడు.

చాలాకాలం శ్రమించి తను పోతపోసిన విగ్రహానికి ప్రాణంవచ్చి పలుకుతుంటే ఆనందపడిపోయే శిల్పిలా, సంతోషిస్తూ శివరామ్ దండపాణిని చూశాడు.

"దండపాణీ, ఎదగడానికి యెక్కువ టైమే తీసుకున్నావ్! అయినా ఫర్వాలేదు. తెలివిగా, తేరగా ముప్ఫైలక్షలా యాభై వేలు కాజేశావ్. కాజేసిన మొత్తానికి కొంచెం చిల్లర కలిపి, నలభై నాకు కానుకగా ఇవ్వాల్సి వుంటుంది. తరవాత..."

"ఎంతా?" దండపాణి అపశ్రుతి పక్కవాద్యాల సహకారంతో పాడి పాడి కంఠం పూర్తిగా పాడైపోయిన గాయకుడిలా రాగయుక్తంగా అరిచాడు.

"న—ల—భై—లక్షలు!"

"వాట్?!"

"ఫార్టీలాక్స్. నాట్ మోర్; నాట్ లెస్!" శివరాం వ్వుతూ అన్నాడు.

సోఫాలోంచీ, కోపవచ్చి తూలిపోయేవాడిలా దండపాణి ముందుకి వంగాడు. "నలభై....నలభై....ఫార్టీ....లాక్స్ లక్షలా....సీరియస్? ఆర్ ఆర్ యూ జోకింగ్?"

"నలభై లక్షలు—ఫార్టీలాక్స్ అంటే జోక్ కాదు, [illegible]యున్ అఫ్ లోన్ మేనేజర్!"

"నో! ఇంపాజిబుల్! ఇవ్వను!" దండపాణి పలవ

రిస్తున్నవాడిలా అరిచాడు.

శివరామ్ తటాలున పైకి లేచాడు. "ధాంక్స్!"

గుమ్మంవైపు కదులుతున్న శివరామ్‌ని దండపాణి కంగారుగా చూశాడు. "వెళ్ళకు.....ప్లీజ్!...... కూచో!...."

శివరామ్ ఆగి అతన్ని ఎగతాళిగా నవ్వుతూ చూశాడు.

"అడిగింది యివ్వనన్నవాడి కొంప ముందు అడుక్కు తినేవాడు కూడా వుండడు, మిస్టర్!" శివరామ్ కంఠం దండపాణి చెవుల్ని అరచేతుల దెబ్బల్లా తాకింది.

దండపాణి వణుకుతూ పైకి లేచాడు. చెమటతో తడిసి, పూర్తిగా పాలిపోయిన మొహాన్ని శివరామ్‌వైపు తిప్పాడు. స్లోమోషన్‌లో అతని పెదవులు కదిలాయి: "నన్ను....నన్ను... అన్యాయం చేయొద్దు!"

శివరామ్ అతని రక్తనేత్రాల్లోకి తీక్షణంగా చూశాడు. "బాస్టర్డ్! అన్యాయం! "లేని" వంద చిల్లర మందికి లోన్‌లు ఇచ్చి, నిజంగా "ఉన్న" వంద చిల్లర మంది అమాయకుల నోళ్ళు కొట్టావ్! వాళ్ళనీ, ప్రభుత్వాన్నీ ప్రజల్ని దారుణంగా మోసగించావ్! టాక్సులు కట్టి, కాలేజీలు కట్టి చదువు చెప్పిన ప్రజల్ని, ఆ చదువుతో పైకొచ్చి, ఉద్యోగం, అధికారం, తద్వారా అవకాశం సంపాయించి, వాళ్ళకే వెన్నుపోటు పొడిచావ్! నిన్ను నేను అన్యాయం చేస్తున్నట్టు కూస్తున్నావ్ ...."

"పొరపాటైపోయింది, బుద్ధి గడ్డితింది...." దండపాణి బొంగురుగా ప్రారంభించాడు.

"గడ్డితిన్న తరవాత నెమరువేయక తప్పదు!" శివ

రామ్ గంభీరంగా అన్నాడు. "ఎక్కువగా బొక్కేక కక్కి వేయక తప్పదు!"

దండపాణి విలవిల్లాడుతూ చూశాడు. శివరామ్ అతన్ని హీనంగా చూశాడు. పెద్ద వాత పడితేగానీ మనిషికి చిన్న వాతమీద ఇష్టం కలగదు! శివరామ్ నవ్వి ప్రారంభించాడు.

"నలభై పారేస్తే నా పీడ విరగడవుతుందని అపోహ పడ్డారు. ఇంకా వుంది...." కొత్తరకం భయాందోళనలతో చూస్తున్న దండపాణిని చూస్తూ శివరామ్ డ్రమెటిగ్గా ఆపేశాడు. ఖచ్చితమయిన టైమింగ్‌తో మళ్ళీ ప్రారంభించాడు.

"ఇవాళిటి నుంచీ సరిగ్గా ముప్ఫైరోజులు నీకు గడువిస్తాను. ఆ గడువులోగా నిజంగా నీ నూటఇరవై ఒక్కమందికీ నువ్వు లోన్‌లు మంజూరు చేస్తావ్; ఖచ్చితంగా ఒక్కో వ్యక్తికి పాతికవేలు చెల్లిస్తావ్!"

"నో ఓఓఓ...." భయంకరంగా అరుస్తూ దండపాణి సోఫాలో కూలబడ్డాడు. వణుకుతున్న చేతుల్తో మొహం మీది చెమటను తుడిచే వ్యర్థప్రయత్నం చేశాడు. మెల్లిగా తలెత్తి శివరామ్‌ని చూశాడు.

"శివరామ్ ...నలభై ....ఎలాగో ....ఇచ్చేస్తాను. అంత మందికి లోన్ యివ్వడం నా తరంకాదు.... హెడ్డాఫీసు వొప్పుకోదు ఆ పథకం ఇప్పుడు లేదు...."

"పథకాలు వేయడంలో ఎక్స్‌పర్టువిగా! ఆలోచించు, ఏదో పథకం వెయ్...."

"ఇంపాసిబుల్ ....ఇంపా...."

"అయితే పథకం నేనే చెప్తాను, నూటఇరవై ఒక్కమందిని వెతుకు, సెలెక్టుచెయ్, వాళ్ళ పేర్లు వరసగా

రాసుకో. నీ మేనల్లుళ్ళ పుత్రుల అకౌంటు నెంబర్ల ముందు ఆ పేర్లు కొట్టేసూ, కొత్త పేర్లు రాయి. పాత పేర్లు పొరపాటుగా పడ్డాయనో, మరేదో చెప్పుకో. నీ సొంత ఖజానాలోంచి చెకంటిసి వాళ్ళకి అందజేయి. సమస్య తీరిపోతుంది!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"నో! నీకు తెలీదు. బ్యాంక్ రికార్డులూ వాటి పద్ధతీ నీవు అర్థంకావు...."

"కరెక్టు! నాకే కాదు; ఖాతాదారెవరికీ బొత్తిగా అర్థంకావు. అర్థమైతే బ్యాంకుల్లో ఎంబిజిల్ మెంట్సూ, సన్ డే అడ్జెస్టు మెంట్సూ, ఇంకా నాలాంటి అమాయకులకి అస్సలు అంతుపట్టని ఖరీదైన ఫ్రాడ్సూ జరిగేవికావు. అదంతా నాకు తెలీదు. 'లేని' జీవులకి అప్పులు ఇప్పించిన ఘనుడివి! నీకు నేను చెప్పాల్సిన అవసరం లేదు. ఏం చేస్తావో, ఎలా చేస్తావో నాకు అనవసరం. ఇచ్చిన గడువులోగా కొత్త అప్పులు ఇవ్వకపోతే, నీ 'అప్పు మేళం' గురించి ఇంటర్ నేషనల్ లెవల్లో పబ్లిసిటీ వస్తుంది!"

"శి....వ....రా....మ్...."

"యస్ కామ్రేడ్?"

"అంత....చెకం....నా దగ్గరలేదు....ప్లీజ్...."

"కట్నం అడిగే అల్లుడికి, వాటా అడిగే అన్నయ్యకీ ఆ మాట చెప్పుకో. నిర్భయంగా, తప్పుడు పేర్లతో అప్పుచేసిన సుప్పు ఇంకా ఎంత సొమ్ము ఏయే నిర్వాకాల పేరుతో భోంచేశావో నాకు తెలీదు. నేను ఉసిగొలిపితే సి.బి.ఐ. పసికడుతుందనుకో—ఈ అందాల మందిరాన్ని అమ్మి పారేయ్ ఇంకా నీ బావమరిది పేరుతో, తోడల్లుడి పేరుతో, కాబోయే అల్లుడి పేరుతో, రాబోయే

కోడలి పేరుతో, పుట్టబోయే మనవడి పేరుతో సంపాయించిన ఆస్తిపాస్తుల్ని అర్ధరాత్రిపూట అడిగిన రేటుకి వేలం వేయ్; అవసరమైనంత పోగుచెయ్; అందరికీ అందజేయ్!" శివరామ్ కంఠం నిష్కర్షగా ధ్వనించింది.

"నో....నో" దండపాణి నత్తిగా అరిచాడు.

"షటప్!" శివరామ్ కంఠం పిస్టల్ షాట్‌లా ధ్వనించింది. దండపాణి కంగారుగా చూశాడు.

"ఇంకొక్కసారి మాత్రం నీకు బ్రెయిన్ వాష్ చేస్తాను. నాకు నలభై ఇచ్చి దగాపడిన దళితసోదరులకి సరికొత్త అప్పులిచ్చి, జరిగింది గుర్తుంచుకుని బుద్ధిగా వుంటావో, సి.బి.ఐ. గానుగలో ఇరుక్కుని చిత్తయిపోతావో తేల్చుకో!" శివరాం హుంకరించాడు.

"మిస్టర్ .. శివ.... రామ్...."

"ఇంక ఒకే ఒకసారి నువ్వు 'నో' అంటే తిరిగి చూడకుండా వెళ్ళిపోతాను. అడుగు కదిపాక, నువ్వు అరిచి చచ్చినా ఆగను!"

"ప్లీజ్...."

"సరిగ్గా నెల తర్వాత నీ గురించి పరిశోధన సాగిస్తాను. కొత్తగా అప్పు సదుపాయం పొందిన వ్యక్తుల పేర్లూ, చిరునామాలూ వున్న లిస్టుని నాకు భయభక్తులతో ఇస్తావు నువ్వు. ఆ లిస్టు ఫోటోకాపీ రూపంలో వుండాలి. లిస్టులోని వాళ్ళందర్నీ స్వయంగా కల్సుకుంటాను. ఒకేవొక తప్పుడు పేరు ఉంటే, ఒకేవొక వ్యక్తి తనకి అప్పురాలేదంటే ఏం జరుగుతుందో నీకు తెలుసు!"

'నో' అనడానికి తెరిచిన నోటిని దండపాణి తప్పున మూసుకున్నాడు. మళ్ళీ తెరిచాడు. "శివరామ్....

అంతేనా....?"

దండపాణి ఏడిస్తే ఎలా వుంటుందో మొదటిసారిగా తెలుసుకున్న శివరామ్ చిన్నగా నవ్వాడు. నవ్వాపి తీక్షణంగా చూశాడు.

"మిస్టర్ దండగపాణీ, లోపలికళ్ళు బ్యాంకులో కొల్లగొట్టిన సొమ్మని నువ్వు మళ్ళీ బ్యాంకులో దాచుకోవు. ఏ క్షణంలో దోపిడీ జరుగుతుందో అన్న భయం నీకూ ఉంటుంది. డబ్బు ఖర్చై నాలుగ్గంటలూ నీ కంటికి అందేలా జాగ్రత్త చేసి ఉంటావ్! వెళ్ళు. నేను కళ్ళు మూసుకుంటాను. సోఫాలో కూచుంటాను. అన్యాయాలూ, అక్రమాలూ ఆగకుండా జరుగుతున్న ఈ లోకాన్ని చూడకుండా యెక్కువసేపు నేను కళ్ళు మూసుకుని ఉండలేను. నేను త్వరగా కళ్ళు తెరవకూడదని ప్రార్థిస్తూ చకచకా పెద్ద సూట్ కేస్‌లో నలభై లక్షలు సర్దేయ్. జాగ్రత్తగా మోసుకురా. ఎందుకంటే కళ్ళు తెరిచిన మరుక్షణం నేను కాళ్ళమీద నిలబడతాను కాళ్ళమీద నిలబడ్డాక కదలకుండా, గడప దాటకుండా నన్ను ఆపడం బ్రహ్మతరం కాదు; నాతరమే కాదు!" గుక్క తిప్పుకోకుండా చెప్పి శివరామ్ సోఫాలో కూచున్నాడు.

అర్థంకానివాడిలా దండపాణి గుడ్లు వెళ్ళబెట్టి చూస్తున్నాడు. శివరాం అతన్ని చిరునవ్వులో చూశాడు. సోఫాలో అలసటగా వెనక్కి వాలాడు.

"ఇదిగో కళ్ళు మూసుకుంటున్నా!" శివరాం కళ్ళు మూసే ప్రయత్నం చేస్తూ అన్నాడు.

దండపాణి అదిరిపడి ఒక్క ఉదుటున లేచి నించున్నాడు. రెప్పపాటుకాలం, మూతలుపడిన శివరాం

కళ్ళని చూసి, కంగారుగా కుడివేపున్న గదివేపు తూలుతూ అంగలు వేయసాగేడు.

తలుపు చప్పుడు విన్న శివరాం నవ్వుకుంటూ కళ్ళు తెరిచాడు. బ్యాంకు ఉద్యోగంలో అరి—తేరిపోయిన దండపాణికి నలభై లక్షలు లెక్కించడానికి అట్టే సమయం పట్టదు! శివరాం నవ్వుకుంటూ సిగరెట్ వెలిగించాడు.

# 5

"గుడ్ హెవెన్స్! నలభై లక్షలు.....పది లక్షలు తక్కువ అరకోటి! డార్లింగ్, బ్యాంకుని కొల్లగొట్టావా?" లత ఉద్రేకంతో అరిచింది.

"బ్యాంకుని గుల్ల చేసిన వ్యక్తిని కొల్లగొట్టాను—!" పకపక నవ్వుతూ శివరాం వెల్లకిలా మంచంమీద వాలి, తలని లత వొళ్ళో పెట్టుకున్నాడు.

అలల్లా కదులుతున్న బాబ్డు హెయిర్. అర్ధ చంద్రుడి ఆకారాన్ని వెక్కిరిస్తున్న నుదురు. ఎక్కుపెట్టిన విల్లులా వొంపుతిరిగిన చక్కటి కనుబొమలు. వాటికీ, కాటుక బోర్డరుకీ మధ్య తళతళమంటున్న విశాల నేత్రాలు. ముక్కుతిమ్మన పద్యానికి ఆధారంగా అవుపిస్తున్న ముక్కు. ఎర్రటి పెదవులు. చిన్న నోరు. సౌందర్య జలంతో నిండిన సరస్సులాంటి గుంటతో, మెరుస్తున్న బుగ్గ. తనవేపు కిందికి వొంగిన లత మొహంలోకి శివరాం చిరునవ్వుతో చూశాడు. ఆమెను చూస్తూ చేతుల్ని అచేతనంగా వుంచుకోడం కష్టమనిపించిందతనికి.

"డార్లింగ్ ...."

"హనీ...."

"అడగాలా?"

"అడగకు; చెప్తాను!" శివరాం నవ్వుతూ అన్నాడు. తన ఛాతీమీద వాలిన లత చేతిమీద తన చేతిని కప్పుతూ ప్రారంభించాడు:

"మొదట స్టాటిస్టిక్స్ ఇండియా శాస్త్రి విక్రమార్కరావు అవతారం ఎత్తాను. ఈ ప్రాంతంలో ఇరవై సూత్రాల పథకంక్రింద బ్యాంకు లోన్ లకి అప్లై చేసిన వాళ్ళ, అప్పుపొందినవాళ్ళ వివరాలన్నీ సేకరించడానికి బ్రహ్మాండమైన రోజావారీ జీతంమీద పేకాడుతూ పొద్దుపుచ్చే నిరుద్యోగ సోదరుల్ని ఎన్యూమరేటర్సుగా నియమించాను."

"ఎందుకు?"

"తరవాత జర్నలిస్టు వరుణ్ శౌరి అవతారంలో బ్యాంక్ మేనేజర్ దండపాణిని కల్సుకున్నాను. నోరూరించే మాటల్తో, బోల్తాకొట్టించి, గతంలో అతను ఏర్పాటుచేసిన లోన్ మేళా గురించి సమగ్రమైన ఇంటర్వ్యూ చేశాను; మదర్ నేషన్ అనే పత్రికకోసం."

"ఎందుకు?" లత అసహనంగా అడిగింది.

"లోన్ మేళాలో బ్యాంకు మేనేజర్ యెంతమందికి అప్పులిచ్చాడు? నేను సేకరించిన లిస్టుకీ, బ్యాంకు తయారుచేసిన లిస్టుకీ యేవేనా తేడాలున్నాయేమో తెలుసుకోడానికి."

"ఎందుకు?"

"బ్యాంక్ మేనేజర్ దండపాణి ముక్కుకి సూటిగా వెళ్ళే వ్యక్తికాదని విన్నాను. మామూలు బ్యాంకు లావాదేవీల్లో తెలివిగా కొంపలుముంచే అలవాటున్న ఉద్యోగిగా అతనికి కొంత పేరుంది. అంచేత ప్రభుత్వం జోక్యంతో ఆదరాబాదరా జరిగే 'అప్పుమేళం'లో

అతను పప్పులో కాలు వేసే అవకాశం ఉండితీరుతుంది. అంచేత — ఆ విషయం తేల్చుకోడానికి, ఎన్యూమరేషన్, ఇంటర్వ్యూ — ఈ రెండింటికీ ఏర్పాటు చేశాను....”

“ఆ రెండూ మనకి యేం చెప్పాయి?” లత ప్రశ్నతో శివరాంకి అడ్డుతగిలింది.

“మూడువందల పైచిలుకు వ్యక్తులకి అప్పులు యివ్వబడ్డాయని బ్యాంకు రికార్డులూ, దండపాణి ఇంటర్వ్యూ చెప్పాయి. కేవలం సరిగ్గా రెండువందలమందికి మాత్రమే అప్పులు అందేయని ఎన్యూమరేషన్ చెప్పింది!” శివరాం నవ్వుతూ అన్నాడు.

“డార్లింగ్, బ్యాంకు రికార్డ్సు యెలా దొరికాయి? ఆ దండపాణో కోదండపాణో — ఇచ్చాడా?”

“లేదు. అంత వివరంగా అతిన్నుండీ విషయాలు లాగలేం. అంచేత మూడో అవతారం యెత్తాను....”

“ఏమిటది?”

“సి.బి.ఐ. కమీషనర్. గతంలో నేను ఉపయోగించిన సిబిఐ కమీషనర్ శివానంద్ ఐడెంటిఫికేషన్ కార్డు ఈ అడ్వెంచర్లో బ్రహ్మాండంగా పండేసింది. దండపాణి అంటే పడని మరో ఉద్యోగి కృష్ణారావుకి ఈ అవతారంలో దర్శనం ఇచ్చాను. నా అవతారానికి అతని భార్య ప్రాణం పోసింది. తెలిసిందంతా చెప్పేయమనీ, అడిగిన ఎవిడెన్స్ ఎలాగేనా అందిచ్చేయమనీ భర్త ప్రాణాలు తీసింది! జవాను కదిరయ్య ద్వారా దండపాణి, కృష్ణారావుల గురించి కనిపెట్టాను. కృష్ణారావు ప్రమోషన్ ఆశతో రికార్డుల కాపీలు అందించాడు!”

“నిజంగా! తరవాత?”

“అదే అవతారంతో మరో ఆరుగుర్ని కలుసుకున్నాను.

వాళ్ళు దండపాణి స్నేహితులు. నూటఇరవై ఒక్కమంది పేర్లతో అతను ఓపెన్ చేసిన అకౌంట్లని పరిచయం చేస్తూ కళ్ళు మూసుకుని సంతకాలు చేసిన, చదువుకున్న మూర్ఖులు వాళ్ళు. "లోన్ శ్కాండల్"లో తమ మెడలు తెగి పోతాయని హడిలిపోయి చేసిందాన్ని రాతపూర్వకంగా చెప్పేశారు!" శివరాం ఆగి, అర్థమవుతోందా అన్నట్టు చూశాడు.

లత కళ్ళతో అతన్ని ఇంకా, ఇంకా చెప్పమని అడుగుతోంది. శివరామ్ ప్రారంభించాడు:

ఇంటర్వ్యూ, ఎన్క్వైరీ, కన్నారావు సప్లై చేసిన ఎవిడెన్సూ, అరుగురు మిత్రుల స్టేట్మెంట్సూ ఇవన్నీ కలిపి ఒక వర్ణచిత్రం గీశాను. బ్యాంకు మేనేజర్ దండపాణి ముప్ఫైలక్షలాయాభై వేలు మాత్రం లోన్ మేళా గలాటాలో చప్పుడు కాకుండా స్వాహా చేసినట్టు ఆ చిత్రం స్పష్టంగా చూపించింది...."

"ఎలా?" లత అడ్డు తగిలింది.

"సింపుల్! లోన్లు ఇవ్వబడిన మూడువందలాఇరవై ఒక్కమందిలో, నూటఇరవై ఒక్కమంది ఇంకా పుట్టనే లేదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"గుడ్ లార్డ్!" లత ఆశ్చర్యంతో అరిచింది.

"తరవాత, ఇందాకటి అవతారాలకు మూలమైన నా అసలు రూపంలో, దండపాణిని అతని ఇంద్రభవనంలో కలుసుకున్నాను. రకరకాల భావాలూ, కృతులూ రంగరించి నాకు తెలిసిందంతా అతనికి తెలియజెప్పాను. అదంతా పేపర్లకీ, పత్రికలకీ, ముఖ్యంగా సిబిఐకీ తెలీకుండా వుండాలంటే నన్ను కొనుగోలు చేయాలన్నాను. నా రేటు నలభైలక్షలు మాత్రమే అన్నాను....ఎన్క్వైమ

లేపన్‌కీ, జిరాక్సుకీ. యితర చిల్లర పద్దులకీ మనకీ బోలెడంత ఖర్చయిందిగా!" శివరాం నవ్వుతూ ఆగాడు.

"ఎదురుతిరగకుండా యిచ్చేశాడా? ఐమీన్ నిన్ను కొనేశాడా?" లత అబ్బురంగా అడిగింది.

"ఎదురు—తిరిగాడు; అడ్డంగా తిప్పేశాను! అరిచాడు. గాండ్రించాడు. హుంకరించాడు. కోపంతో వణికాడు. కాసేపట్లో భయంతో వణికాడు, ఏడ్చాడు, మొత్తుకున్నాడు, ప్రాధేయపడ్డాడు. తనకు అన్యాయం చేయొద్దని కూడా అన్నాడు...."

"పాపం...." లత జాలిగా అంది.

"అవును. అతను పాపం చేశాడు!" శివరాం తమాషాగా నవ్వాడు. "ప్రాయశ్చిత్తం చేశాను! అడిగింది కక్కేశాడు!"

పైకి లేవబోతున్న శివరామ్‌ని లత రెండు చేతుల్తో అలాగే అదిమింది.

"డార్లింగ్...."

"ఊఁ...." శివరాం కళ్ళు మూసుకుంటూ అన్నాడు.

"కళ్ళు తెరు....ఒక సందేహం నన్ను ముల్లులా గుచ్చేస్తోంది...."

"చూపించు. ఆ ముల్లు లాగేస్తాను!" కళ్ళు తెరిచి, శివరామ్ సగర్వంగా అన్నాడు.

"అప్పు మేళం—లోన్ మేళాలో డబ్బు కాజేసి అతను అమాయకులకి ద్రోహం చేశాడు. ఆ పైకాన్ని నువ్వు గుంజుకున్నావ్. అంటే...." లత పూర్తిచేయకుండా ఆపేసింది.

శివరామ్ ఆమె కళ్ళల్లోకి అనురాగంతో చూశాడు. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. "క

సందేహం నాకు తలెత్తింది. ఎందుకంటే ఆ సందేహం నాదే! అందుకే నా కోరిక నెరవేర్చాలంటే తనో చెల తిరిగేలోగా మరో అద్భుతం చేయాలని దండపాణికి హెచ్చరిక ఇచ్చాను...."

"ఏమిటది?" లత ఆత్రంగా అడిగింది.

"మూడ్నెల్లలోగా తన ఖజానాలోంచి యోగ్యులైన నూట ఇరవై ఒక్కమందికి, ఒక్కొక్కరికి పాతిక వేల చొప్పున అప్పు ఇచ్చుకోకపోతే నేను మొత్తం కథలో సిబిఐ సముఖానికి రెక్కలు కట్టుకు యెగిరిపోతా నన్నాను!"

"వాట్....!" లత కళ్ళు గిన్నెల్లా అయ్యాయి. "డార్లింగ్, అది జరుగుతుందా?"

"అతనూ నీలాగే అడిగాడు. అలా చెయ్, ఇలా చెయ్ అంటూ అదరగొట్టేశాను. ఎలా చేయాలో, మనిద్దరికన్నా అతనికే బాగా తెలియాలి. బ్యాంకింగ్‌లో అప్పుల్లో, వసూళ్ళలో, తినడంలో, కక్కడంలో అతనే ఎక్స్‌పర్ట్...."

"కానీ డార్లింగ్....అది...."

"హనీ, ఫర్గెటిట్! అది దండపాణి టీట. అతనే చూసుకుంటాడు. ఇప్పటికే యెలా నొక్కాలో, ఎలా రక్షించుకోవాలో అతను ఆలోచించేసి, సరికొత్త పథకం తయారుచేసేసుకుని వుంటాడు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత మాటలు మరిచిపోయి విగ్రహంలా వుండి పోయింది.

"హనీ...." శివరామ్ పిల్చాడు.

"ఊఁ...." లత యేదో లోకంలోంచీ అంది.

"పోలీసు రిపోర్టులూ, కేసులూ....వగైరా అడగలేం?"

"అతను పోలీసులకే కాదు—పెళ్ళాని కూడా చెప్పుకోలేదుగా!" లత నవ్వుతూ అంది.

"తరవాత....మరో వ్యక్తి గురించీ అడగవా?" శివరామ్ ఆమెని రెచ్చగొడుతూ అన్నాడు.

లత నుదురు ప్రశ్నార్థకంగా ముడతపడింది. "ఎవరు?....ఓహ్....డిటెక్టివ్ టెంపో గురించేగా?"

శివరామ్ పళ్ళు పెదవుల సందులోంచీ మెరిశాయి. "వందకి రెండువందల మార్కులు కొట్టేశావ్!"

"అడగడం దేనికి? వొద్దన్నా అతనికి చెప్పకుండా మానవుగా?" లత విరక్తిగా అంది.

"మానలేనుగా!" శివరామ్ పకపక నవ్వుతూ పైకి లేవబోయాడు.

లత చేతులు అతన్ని కిందికి నొక్కాయి. ఆమె తల కిందికి వాలింది. గాలి తాకిడికి కిందికి దిగుతున్న బరువైన కారుమేఘంగా ఆమె బాబ్ హెయిర్ అతని మొహాన్ని పూర్తిగా కప్పేసింది. క్షణంలో శివరామ్ నవ్వు ఆగిపోయింది....

('శివరామ్ అడ్వెంచర్స్' సీరీస్‌లో
ఇది ఐదవ నవల.)

# యువ చోరులు

## బొమ్మిడి అచ్చారావు

శ్రేట్ మనీలాల్ బ్యాంక్ నించి బయటికొచ్చాడు. సూట్ కేసు నోట్లకట్టలతో బరువుగా వుంది.

అంబాసిడర్ కారును సమీపించి డోర్ తెరిచి లోపల కూచున్నాడు—సూట్ కేసును సీటుమీద పెట్టి డోర్ లోపల్నుంచి లాక్ చేసి డ్రైవింగ్ సీట్లోకి జరిగాడు.

మనీలాల్ కి స్వయంగా డ్రైవింగ్ చేసుకోవటం అలవాటు. అందునా డబ్బు విషయంలో బ్యాంక్ కు వెళ్ళేటపుడు డ్రైవర్ ని తన వెంట తీసుకువెళ్ళడు.

ఈ రోజు కూడా అలాగే డబ్బు 'డ్రా' చెయ్యటానికి వెళ్తూ డ్రైవర్ ని ఇంటికి పంపేశాడు.

ఇగ్నిషన్ కీ తిప్పి కారు స్టార్టు చేశాడు. కారు మెత్తగా ముందుకు దూకింది. ఊరుకి చివరగా అధునాతనంగా నాల్గంతస్తుల మేడ కట్టుకున్నాడు మనీలాల్. నిత్యం ఆ ఇంటిని ఇద్దరు గూర్ఖాలు మూడు అల్సేషియను

కుక్కలు కనిపెట్టుకొని వుంటాయి. మనీలాల్ కుటుంబ సభ్యులు తప్ప మరెవరూ గేటు దాటి లోపలి కడుగు పెట్టలేరు.

నిర్మానుష్యంగా వున్న తారురోడ్డుమీద జర్రున జారుతోంది కొత్త అంబాసిడర్.

సరిగ్గా అప్పుడే మనీలాల్ మెడదగ్గర చల్లటి వస్తువు వెంన గుచ్చుకుంది. చివ్వున తల తిప్పబోయి వెనకనించి వినిపించిన కర్కశమైన హెచ్చరికకు కట్టుబడిపోయి స్థాణువులా కూచుండిపోయాడు.

"కారు పక్కకితీసి ఆపెయ్యి—" అన్నది ఆ గొంతు మళ్ళీ.

మనీలాల్ చేతులు అప్రయత్నంగా స్టీరింగ్‌ని కుడి వైపుకి తిప్పాయి. అక్కడ దారి విడిపోయి కంకరరోడ్డు తగిలింది. పొలాలకి, తోటలకి దారితీసే ఎర్ర కంకరరోడ్డు అది. చుట్టూ జీడిమామిడిచెట్లు గుబురుగా పెరిగివున్నాయి. ఎక్కడా మనుష్యసంచారం లేదు.

"ఎ.... ఎవరు.... కౌన్ హో తుమ్?" వచ్చీరాని తెలుగులోను, హిందీలోను అడిగాడు మనీలాల్. అతని గొంతు నూతిలోంచి పలికినట్టుగా వుంది. తొడుక్కున్న మల్లెపువ్వులాంటి లాల్చీ చెమటతో తడిసి ముద్దయిపోయి పచ్చని అతని ఒంటిరంగుని బహిర్గతం చేస్తోంది. మనిషి నిలువెల్లా ఒణికిపోతున్నాడు,

"మేమెవరమో నీకనవసరం. ఆ సూట్‌కేసిలా ఇవ్వు" అన్నది మరో గొంతు.

ఒకరికన్నా ఎక్కువే వున్నారు దుండగులు — అనుకున్నాడు మనీలాల్. అతని చేతులు అప్రయత్నంగా

డబ్బున్న సూట్ కేసుని ఆప్యాయంగా ఆత్రంగా గుండెల కదుముకున్నాయి. పసిపిల్లవాడ్ని తన నుంచి దూరం చేస్తుంటే విలవిల్లాడే తల్లిలా, గద్ద బారినుంచి తన పిల్లల్ని పొదివి కాపాడుకునే కోడిలా — వున్నాడు మనీలాల్ ఆ సమయంలో.

"మిస్టర్ మనీలాల్, నీ ప్రాణాలకన్నా ఆ డబ్బు ఎక్కువ కాదని నీకూ తెలుసు. ఎందుకనవసరంగా నిండు ప్రాణాల్ని పోగొట్టుకుంటావు. నీ నుంచి నయానకాకున్నా భయాన, ప్రాణాలు తీసి మరీ సూట్ కేసు పట్టుకెళ్ళగలం....కమాన్, ఇలా ఇవ్వు" మొదటి గొంతు హెచ్చరించింది.

మనీలాల్ సూట్ కేసును మరింతగా కరుచుకుపోయాడు.

అంతే! మరుక్షణం అతని నెత్తిమీద బలమైన దెబ్బ పడింది — అది పిస్తోలుమడమ దెబ్బ. మరి కిక్కురు మనకుండా సీట్లో ఒరిగిపోయాడు. సూట్ కేసు మనీలాల్ పొట్టకింది నుంచి రెండో వ్యక్తి గుంజుకున్నాడు.

మరుక్షణం వాళ్ళిద్దరూ మనీలాల్ని కిందికి తోసేసి కారు స్టార్టు చేసుకుని మళ్ళీ వచ్చినదారినే వెనక్కి బయల్దేరారు.

జంక్షన్ వరకు వచ్చాక కారును రోడ్డు పక్కగా వదిలేసి కిందికి దిగారు. పదిగజాలు నడిచాక ఖాళీ ఆటో వారికెదురొచ్చింది. ఆటో ఎక్కి కూర్చున్నారు.

ఎక్కడికి పోవాల్సింది చెప్పారు.

ఆటో వేగం పుంజుకుంది.

# 2

"నా భార్యకి ప్రాణంమీది కొచ్చిందండయ్యా! ఓ అయిదువంద లిప్పించండి" అన్నాడు ఆ యువకుడు.

గురవయ్యశెట్టి చత్వారం కళ్ళజోడు కింది నుంచి అతన్ని పరీక్షగా చూసి చెయ్యి చాపాడు.

"ఏటండయ్యా...." అన్నాడా యువకుడు అమాయకంగా చూస్తూ.

"తాకట్టు పెట్టడానికేం తెచ్చావు....?" అడిగాడు శెట్టి.

"మా దగ్గరేటుంటాది తాకట్టుపెట్టడానికి? నోట్రాయండి, ఏలిముద్ర వేస్తాను."

"నీ వేలిముద్ర లెవడిక్కావాలి? పత్రాలేమన్నా వుంటే పట్రా. కుదవబెట్టుకుని డబ్బిస్తాను."

ఆ యువకుడు తల అడ్డంగా తిప్పాడు.

గురవయ్యశెట్టి నిర్లక్ష్యంగా చూశా డతనివైపు. "వెళ్ళెళ్ళు! పొద్దున్నే గొప్ప బేరం దొరికింది" అన్నాడు చీదరించుకుంటూ.

ఆ యువకుడు నిరాశగా వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

గురువయ్యశెట్టి విసుగ్గా ఐరన్ సేఫ్ వైపు తిరిగి తెరుస్తుండగా ఇద్దరు యువకులు లోనికొచ్చారు.

గురవయశెట్టి వాళ్ళవైపు ప్రశ్నార్థకంగా చూశాడు. ఓ యువకుడు పొడవుగా బలంగా వున్నాడు. రెండో అతను పొట్టిగా బక్కపలచగా వున్నాడు.

"ఏం కావాలి?" అడిగాడు గురవయ్యశెట్టి.

"డబ్బు!" అన్నాడు పొడవు యువకుడు.

"ఎంత?" అడిగాడు శెట్టి.

"పది లక్షలు" అన్నాడు పొట్టి యువకుడు. గుర

వయ్యశెట్టి నిర్ఘాంతపోయి చూశాడు వాళ్ళిద్దరివైపు.

"ఏమిటీ, పది....ల .. క్ష....లా?" అన్నాడు ఒత్తి పలుకుతూ.

"కాకపోతే వేలనుకున్నావా?"

"అంత డబ్బు నా దగ్గరెక్కడిది? ఏదో చిన్న మొత్తాలతో వడ్డీవ్యాపారం చేసుకుంటున్నాను."

"ఏదో చిన్న మొత్తాలా?....కాని వసూలు చేసే వడ్డీ ఇప్పటికన్ని లక్షలుండి వుంటుందో...."

"అదేం మాట! ఇచ్చేది వందల్లో అయితే అసలుకన్న వడ్డీ యెక్కువోస్తుందా?"

"ఎందుకు రాదు!?....అసలు నువ్వు సంపాదించిందంతా అసలు కన్న వడ్డియే యెక్కువ కదా! లేకుండా ఇన్ని కోట్లు గడించావా?"

"ఇదిగో అబ్బాయ్, మర్యాద లేకుండా అలా నువ్వు నువ్వంటూ మాట్లాడతారేమిటి? నా దగ్గర పది రూపాయలు కూడా లేవు. వెళ్ళండి, వెళ్ళండి" విసుగ్గా చూశాడు గురవయ్యశెట్టి.

"పదిరూపాయలు నువ్విచ్చినా మాకొద్దు. చూడూ, మేమడిగింది మర్యాదగా ఇచ్చిపంపు, లేకుంటే...."

"లేకుంటే....!?" అంటూ విసురుగా అనబోయి చటుక్కున ఆగిపోయాడు శెట్టి.

పొడవుగా వున్న యువకుడి చేతిలో నిగనిగ మెరుస్తూ అతనివైపే గురిపెట్టబడి వున్న రివాల్వర్ నోటి నుంచి మాట రానివ్వలేదు.

"ఏంటయ్యా, ఏంటీ దౌర్జన్యం?...." మేకపోతు గాంభీర్యంతో దబాయించాడు.

ఎప్పుడు మూసేశాడో, పొట్టి యువకుడు, వీధి

తలుపుమూసి గడియ పెట్టేశాడు.

గురవయ్యశెట్టి ఇంట్లోనే వ్యాపారం చేస్తున్నాడు. ముందుగదిలో వ్యాపారం, వెనకగదుల్లో కాపరం వుంటున్నాడు. అతనికి భార్యా ఇద్దరు కూతుళ్ళు వున్నారు. కూతుళ్ళకి పెళ్ళిళ్ళు చేసి పంపేశాడు.

అతని భార్య క్రితంరోజే చిన్నకూతుర్ని చూసిరావటానికి నెల్లూరు వెళ్ళింది. అక్కడ వరదలు రావటంవల్ల, తుఫాను తాకిడికి కూతురుంటున్న ప్రాంతం కూడా గురయ్యిందని తెలిసి ఆందోళనపడుతూ వెళ్ళింది.

శెట్టికి వ్యాపారమే లోకం. భార్య రమ్మని యెంత బతిమాలినా రావటం కుదరదని ఖచ్చితంగా చెప్పేసి పంపేశాడు.

ఇదంతా ముందుగానే తెలుసుకున్నట్టున్నారాయువకులిద్దరు. సరిగ్గా సమయం చూసుకుని వచ్చారు.

అప్పుడు సాయంత్రం ఆరుగంటలు దాటి పదినిమిషాలయింది. కస్టమర్లు వచ్చే టైం అదే! అందుకే శెట్టి ముందుగదిలో సిద్ధంగా కూచుని వున్నాడు.

"దౌర్జన్యం చెయ్యాలని మా ఉద్దేశంకాదు. మమ్మల్ని రెచ్చగొట్టకుండా డబ్బిచ్చేస్తే నీ చిటికెన వేలు కూడా ముట్టుకోకుండా అందుకుని వెళ్ళిపోతాం. నీదే ఆలస్యం!" చిన్నగా నవ్వుతూ అన్నాడు పొడవు యువకుడు.

"ఏమిటీ, ఏమిటయ్యా ఇచ్చేది? నా దగ్గరంత డబ్బెక్కడిది? ఓ వెయ్యిరూపాయిలిస్తాను, తీసుకొని వెళ్ళిపోండి! అట్టే బెట్టుచేస్తే పోలీసుల్ని పిలుస్తాను, జాగ్రత్త!" బెదిరించాడు శెట్టి.

"పోలీసుల్ని పిలవటానికి నువ్వంటూ బతికివుండాలి కదా! నువ్వు ఫోన్ వైపు జరిగిన మరుక్షణం నీ చేతిలోంచి

నా రివాల్వర్ నించి వచ్చే బుల్లెట్ దూసుకుపోతుంది. మరో బుల్లెట్ నీ గుండెల్లో నిద్రపోతుంది. ఎందుకొచ్చిన రభసగాని, పదిలక్షలూ ఇచ్చిపంపెయ్యి బాబాయ్! అవతల బేరాలు పోతున్నాయి నీకు. తలుపులు మూసి వుంటం చూసి కస్టమర్లు వెళ్ళిపోతూ వుంటారు" పొడవు యువకుడు రివాల్వర్ ఫర్మ్‌గా పట్టుకుని గురిచూసుకుంటూ అన్నాడు.

గురవయ్యశెట్టి ముఖంలో ప్రేతకళ వచ్చేసింది. పది వేలైనా కాదు—పదిలక్షలు! యెన్నాళ్ళు సంపాదిస్తే వస్తుంది? ఎంతమందిని నిలువునా ముంచేస్తే సంపాదించ గలడు? రూపాయి రూపాయి వడ్డీరూపంలో కూడ పెట్టింది యీ దోపిడీ రాస్కెల్స్‌కి యివ్వటానికా? ఉత్త పుణ్యానికెందుకు వదులుకోవాలి అంత డబ్బు?

గురవయ్యశెట్టిలోని వ్యాపారి అందుకు ససేమిరా అంగీకరించలేదు.

"శెట్టీ, అనవసరంగా కాలయాపన చేస్తున్నావు? మా చేత హత్య చేయించకు" ఈసారి పొట్టి యువకుడు హెచ్చరించాడు.

శెట్టిలో అప్పటికీ చలనంలేదు. పొడవు యువకుడు సేఫ్టీకాచ్ తప్పించాడు. రివాల్వర్ నించి బుల్లెట్ రిలీజయింది. అది సూటిగాపోయి ఐరన్ సేఫ్‌కి తగిలింది. ఆ గుండు తన గుండెల్లోనే దూరినట్టు కెవ్వుమన్నాడు గురవయ్యశెట్టి.

పొడవు యువకుడు పకపకా నవ్వాడు. "ఈసారి నా గురి వృధాపోదు. ఇది కేవలం శాంపిల్‌గా పక్కకు కాల్చాను. కమాన్, సేఫ్ తెరిచి పదిలక్షలు యెంచి ఈ సూట్‌కేస్‌లో సర్ది మూసెయ్యి!" తమవెంట తెచ్చిన

వి.ఐ.పి. సూట్ కేస్ గురవయ్య శెట్టి ముందుకు తోశాడు పొట్టి యువకుడు.

గురవయ్య శెట్టి శిలావిగ్రహంలా కదల్లేదు. యువకులిద్దరిలోను సహనం నశించింది. గురవయ్య శెట్టి ప్రాణానికి, డబ్బుకి లంకె అని అర్థం చేసుకున్నారు.

పొట్టి యువకుడు శెట్టిని సమీపించాడు. ఊహించని వేగంతో తలతో పొట్టేలు కుమ్మినట్టు గురవయ్య శెట్టి పొట్టలో కుమ్మాడు. అంతే! విరుచుకుపడిపోయాడు శెట్టి. అతన్ని లేవకుండా మోచేతుల్తో డొక్కల్లోనూ, ముఖం మీద పొడిచాడు. శెట్టి అరవటానిక్కూడా ఓపిక నశించి కుప్పకూలిపోయాడు.

మరుక్షణం ఐరన్ సేఫ్ మీదికి లంఘించాడు పొట్టి యువకుడు. అంతక్రితమే సేఫ్ తెరవటానికి సిద్ధంగా తాళాలు పట్టుకుని ఉన్న శెట్టి వీళ్ళను చూసి రెండు పుస్తకాల చాటున దాచేశాడు. అయితే పొట్టి యువకుడి దృష్టిని దాటిపోలేదా చర్య.

రెండు పుస్తకాల వెనకనించి తాళాలు పైకితీసి క్షణాల్లో దాన్ని తెరిచాడు పొట్టి యువకుడు.

అరల్లోని నోట్లకట్టలు పైకితీశాడు. ఇంకా బంగారు ఆభరణాలు కూడా వున్నాయందులో. వాటిజోలికి పోలేదు.

"నోట్లకట్టలు రెండు లక్షలు కూడా లేవు" అన్నాడు పొట్టియువకుడు లెక్కించి.

"అయితే తక్కిన సొమ్ము ఇంటి లోపల సేఫ్‌లో దాచాడేమో ....!"

ఇద్దరు లోపలి గదిలోకి వెళ్లారు. లోపల నాలుగ్గదులున్నాయి. పడగ్గదిలో మరో ఐరన్ సేఫ్ వుంది.

తమ దగ్గరున్న తాళంచెవుల గుత్తినుంచి ఒకటొకటిగా తాళంతీసి ప్రయత్నించాడు, పొట్టి యువకుడు. ఓ తాళం సరిపోయింది. తలుపు తెరిచాడు. లోపల మరో అరవుంది. దాన్ని ఇంకో తాళంతో తెరిచాడు.

కళ్ళు చెదిరిపోయాయి. లోపల ఏమాత్రం జాగా లేకుండా కట్టలుగా కరెన్సీ పేర్చబడుంది. అందులోనించి డబ్బు ఎంచి తీశాడు పొట్టి యువకుడు. కేవలం ఎనిమిది లక్షలు మాత్రం తీసి సూట్ కేస్‌లో సర్దాడు. తర్వాత ఐరన్ సేఫ్ మూసేశాడు. ఇంకా నోట్లకట్టలున్నాయి. కాని వాటిని ముట్టలేదు.

సేఫ్ లోపల పైన తన వేలిముద్రలు పడకుండా ముందే తొడుక్కున్న గ్లోవ్స్‌ని తీసి సూట్ కేస్‌లో పడేసి మూత పెట్టేశాడు.

ఆ తర్వాత ఇద్దరు ముందుగదిలోకి వచ్చారు. చలనం లేకుండా పడున్నాడు గురవయ్యశెట్టి.

వీధి తలుపు తెరవబోతూ కీహోల్ లోనించి బయటికి చూశాడు పొడుగు యువకుడు.

బయట యెవరో నలుగురైదుగురు మనుషులు నిల్చొని ఉన్నారు. శెట్టి దగ్గర అప్పుకోసం వచ్చిన కస్టమర్స్‌ని గ్రహించాడతను. ప్రశ్నార్థకంగా పొట్టి యువకుడివైపు చూశాడు.

"వెనకవైపునించి వెళ్దాం" అన్నాడు తను కూడా కీహోల్ లోనించి చూసిన పొట్టి యువకుడు.

ఇద్దరు చకచక గదులన్నీ దాటుకుని దొడ్డివైపు వెళ్ళారు. దొడ్డికుమ్మం తెరిచాడు పొడుగు యువకుడు. చేతిలోని రివాల్వర్ పాంటుజేబులో పెట్టుకున్నాడు.

సందులోకి తెరుచుకుంది దొడ్డిమార్గం. ఓసారి సందులోకి చూశారిద్దరు. ఎవరూ తమని గమనించటంలేదని నిర్ధారణ చేసుకున్నాక సందులోకి ప్రవేశించారు.

చకచక నడుచుకుంటూ సందుచివరికొచ్చారు. అంతదాకా దూరంగా ఆగివున్న మారుతీకారొకటి వారిముందుకొచ్చి ఆగింది. డ్రైవింగ్ సీట్లో ఉన్న వ్యక్తి వాళ్ళ వంక నవ్వుతూ చూశాడు.

సూట్ కేస్ తో బాటు వాళ్ళిద్దరు వెనక సీట్లలో కూచున్నారు.

మరుక్షణం మారుతీకారు రొటో వేగంగా దూసుకుపోయింది.

## 3

"కిరణ్ ఇప్పటికి నగరంలో తొమ్మిది దోపిడీలు జరిగాయి. అన్నీ మేజర్ తెఫ్ట్స్. మొత్తం రాబరీ తొంభై లక్షలు. ప్రతిసారీ పదిలక్షల చొప్పున చాలా కాల్ క్యులేటెడ్ గా దోపిడీలు జరిగాయి. ఒకే ముఠా జరిపినట్టుగా అర్థమయ్యింది.

చిత్రమేమిటంటే ప్రతి దోపిడీలోను ఇద్దరు వ్యక్తులే ఉండటం, వాళ్ళిద్దరు యువకులు కావటం, తమ ముఖకవళికల్ని దాచుకోవటానికి వాళ్ళు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోకపోవటం ముఖ్యాంశాలు.

ఒకచోట దోపిడీ చేసిన జంట మరోచోట చెయ్యలేదు. అంటే మొత్తం తొమ్మిది జంటలు—అంటే పద్ధెనిమిది మంది యువకులు ఈ రాబరీస్ కండక్టుచేశారు. ఇంకా యెంతమందున్నారో ఎన్ని దోపిడీలు టార్గెట్ గా పెట్టుకున్నారో అనూహ్యంగా ఉంది."

గుక్కతిప్పుకోకుండా చెప్పేసి, టేబిల్ మీదున్న

గ్లాసెడు నీళ్ళు గటగట తాగేశాడు క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

అతని కేసి దయగా చూసి అంతవరకు అతను చెప్పిన ప్రతి విషయాన్ని శ్రద్ధగా విన్న డిటెక్టివ్ కిరణ్ కుర్చీలో వెనక్కి వాలి కప్పువైపు కాసేపు చూస్తూ ఉండి పోయాడు.

తర్వాత శ్రీనివాస్ వైపు తిరిగి "అతి త్వరలో నీకు మరో రాబరీ గురించిన మెసేజ్ రావచ్చు" అని కిరణ్ అంటుండగానే ఫోన్ గణగణ మోగింది.

శ్రీనివాస్ రిసీవరెత్తి "హల్లో." అన్నాడు. కాసేపు అవతలివైపునుంచి వస్తూన్న మెసేజ్ విన్నాడు. అతని ముఖం తెల్లగా పాలిపోయింది.

"ఏదో రాబరీ జరిగిపోయింది. సరిగ్గా పదిలక్షలు— హార్డ్ క్యాష్. ఇద్దరే యువకులు ఈసారి కూడా దోపిడీ చేశారు" చెప్పాడు శ్రీనివాస్ ఫోన్ క్రెడిల్ చేస్తూ.

"ఇదివరకటి కేసుల్లోలాగానే ఇప్పుడు కూడా యెలాంటి రక్తపాతం జరగలేదు. కేవలం అతన్ని బెదిరించి పదిలక్షలు తీసుకుపోయారు. అవునా?"

"అవును."

"ఇప్పటికి ఇరవైమంది యువకులు రంగంమీది కొచ్చారు. కోటి రూపాయలు కలెక్టు చేశారు."

శ్రీనివాస్ తలూపాడు "అయితే, కోటిరూపాయలు సంపాదించటం టార్గెట్‌గా పెట్టుకున్నారంటావా?" గాడు.

"ఈ దేశంలో కోటీశ్వరులు చాలామంది ఉన్నారు" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

శ్రీనివాస్ కర్థమయ్యింది.

"అయితే, వీళ్ళ ఆట కట్టించేదెలా? ఇప్పటికే కమీషనర్ లెవల్ నించి హయ్యర్ అథారిటీస్ మమ్మల్ని నంజేస్తున్నారు. మా అసమర్థతని తీవ్రంగా దూషిస్తున్నారు. ఇప్పటివరకు జరిగిన తొమ్మిది దోపిడీల్లోను ఒక్క దొంగను కూడా పట్టుకోలేకపోయినందుకు మమ్మల్ని సామూహికంగా సస్పెండ్ చేస్తామంటున్నారు. ఈ క్లిష్టపరిస్థితుల్లో నువ్వే మమ్మల్ని గట్టునపడెయ్యి బ్రదర్!" అంటూ ఆక్రోశించాడు.

కిరణ్ అంతవరకు జరిగిన దోపిడీల గురించిన పూర్తివివరాలు చదవటంలో మునిగిపోయాడు. అన్నీ ప్రీప్లాన్డ్ గానే జరిగాయి. దోపిడీకి గురైన కోటీశ్వరు లందరు అక్రమార్జన కలవాటుపడినవారే! వాళ్ళు సామాన్యుల జోలికి, ఓ మాదిరి ధనవంతుల జోలికి పోలేదు. ఎవర్నీ హత్య చెయ్యలేదు. ఎవరిమీదా కత్తి తియ్యలేదు. ఎవరి నుంచీ పది లక్షలకు తక్కువ, యెక్కువ తీసుకోలేదు.

వీళ్ళు యెక్కడ్నుంచో వచ్చినవాళ్ళు కాదు. లోకల్ గా వుంటున్నవాళ్ళు. నగరంలోని ప్రముఖుల గురించి బాగా వివరాలు తెలిసినవాళ్ళే అయుండాలి. అయితే వీళ్ళు కేవలం ధనార్జనకోసమే అయితే ప్రతీ ధనవంతుడ్నీ దోచుకోవచ్చు. కాని వాళ్ళు కేవలం అన్యాయార్జితాని కలవాటుపడ్డ శ్రీమంతుల్నే యెందుకు దోచుకుంటున్నారు? దోచుకొన్న లక్షలేం చేస్తున్నారు? అసలు వీళ్ళెవరు? చదువుకున్న నిరుద్యోగులా? ఈ వ్యవస్థమీద విసిగిపోయి చివరికి ఈ అకృత్యాలకి పాల్పడుతున్నారా?

మరి వీళ్ళందరు కలసికట్టుగా ఈ దోపిడీలు చెయ్యకుండా కేవలం ఇద్దరు మాత్రమే ఎందుకు చేస్తున్నారు?

ఒకసారి కనిపించినవాళ్ళు మళ్ళీ కనిపించకుండా పక డ్బందీగా, ఎంతో అనుభవమున్న గజదొంగల్లా వీటిని నిర్వహించటం, ఒకడు కూడా ఇప్పటిదాకా పట్టుబడక పోవటం చూస్తూంటే, వీళ్ళు దుర్భేద్యమైన వ్యూహం పన్ని దాన్ని అక్షరాలా అమలుజరుపుతున్నారని తెలు స్తోంది.

వీళ్ళ స్థావరాన్ని కనిపెట్టగలిగితే యీ దోపిడీలని తక్షణం అరికట్టవచ్చు. కాని అది సాధ్యమయ్యే పనేనా? కనీసం యే ఒక్కడినయినా రెడ్ హేండెడ్ గా పట్టుకో గలిగితే చాలు! ముఠానంతా వలపన్ని పట్టెయ్యవచ్చు.

కాని వాళ్ళిప్పటిదాకా చిన్న ఆధారం కూడా వద లేదు. లేదా, పోలీసులు యెలాంటి 'క్లూ' సాధించలేక పోయారని చెప్పాలి.

కిరణ్ తల విదిలించాడు.

ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ ఆశగా, ఆత్రంగా, కిరణ్ ముఖంలోకి చూస్తూన్నాడు. అతని నోటినుంచి యెలాంటి మాట వెలువడుతుందోనని తదేకంగా ఒళ్ళంతా చెవులు చేసుకుని సిద్ధంగా వున్నాడు.

కిరణ్ లేచి నిల్చుని, "ఏదో విక్టిమ్ని వెంటనే కల్సు కుంటే మనకేదయినా అనుకూల సమాచారం దొరక వచ్చు. అడ్రసు నోట్ చేశావు కదూ.........!?" అన్నాడు.

శ్రీనివాస్ తలూపి, "నేనూ అదే చెప్పాలనుకొంటు న్నాను. వెళదామా?" అన్నాడు హేట్ నెత్తిన పెట్టు కుంటూ.

"లెటజ్ ప్రొసీడ్!" అన్నాడు కిరణ్.

మరో రెండునిమిషాల తర్వాత కిరణ్, శ్రీనివాస్లని

చూసుకుంటూ దిల్‌షుక్‌నగర్ వైపు దూసుకుపోయింది పోలీసుజీప్.

# 4

అది నాలుగంతస్తుల భవనం. డబ్బునే ఇటుకలుగా పేర్చి కట్టరా అన్నంత వైభవంగా ఠీవిగా, గర్వంగా వెలిగిపోతోంది. చుట్టూ రెండు నిలువుల ప్రహరీ జైలు గోడల్ని తలపింపచేస్తోంది.

గేటునుంచి దాదాపు వందగజాల దూరంవరకు పూల మొక్కలు బాట కిరువైపులా స్వాగతం పలుకుతున్నట్టు గాలికి తలలూపుతున్నాయి. ప్రహరీ లోపల ఆవరణ నిండా రకరకాల పండ్లచెట్లు కన్నులపండువ చేస్తున్నాయి.

ఆ భవనం యజమాని నగరంలోకల్లా పెద్ద బిజినెస్ మాగ్నెట్ రాజానాయుడు. అతనికి రెండు సినిమా థియేటర్లు, కొన్ని ప్రముఖ కంపెనీల్లో షేర్లు ఉన్నాయి. అవిగాక నగరశివార్లలో అక్రమంగా ఆక్రమణ చేసిన బంజరుభూము లున్నాయి. ఇళ్ళస్థలాలుగా వాటికి ప్రస్తుతం విపరీతమయిన ధర పలుకుతోంది. అవి చాలవన్నట్టు ప్రభుత్వం బలహీనవర్గాల కోసమని పట్టాలిచ్చిన నివేశన స్థలాలను కారు చవగ్గా వాళ్ళనుంచి కొనేసి లోపాయికారీగా ఉద్యోగస్థుల కమ్మేశాడు — నాయుడు.

పై స్థిరాస్తులతోబాటు కొన్ని వందల తులాల బంగారము, యెన్నో లక్షల బ్లాక్‌మనీ అతని ఖజానాలో మూలుగుతోంది.

కిరణ్, శ్రీనివాసులు వెళ్ళిన సమయానికి రాజానాయుడు తన విశాలమయిన తోటలోని లాన్స్‌లో

అశోకవనంలో సీతమ్మవారిలా దిగాలుపడిపోయి సర్వమూ కోల్పోయినవాడిలా కూచున్నాడు. అతని వాలకం చూస్తూంటే అతి దగ్గర బంధువును పోగొట్టనున్నవాడిలా వున్నాడు.

అప్పుడు సమయము సాయంత్రం నాలు గ్గంట లయ్యింది.

"చోరీ యెలా జరిగిందో కాస్త వివరిస్తారా?" అనడి గాడు కిరణ్, పరిచయాలయ్యాక.

రాజానాయుడు గొంతు సవరించుకొని చెప్ప సాగాడు:

"నేను మధ్యాహ్నం భోజనం చేసి విశ్రమించు చుండగా యెవరో యిద్దరు యువకులు నా దర్శనం కోసం వచ్చారని మా నౌకరు చెప్పాడు. వాళ్ళని సాయంత్రము రమ్మనమని కబురుచేశాను నౌకరుతో. అయితే ఆ పని చాలా అర్జంటని, కేవలము పదినిమిషాల్లో తమ పని పూర్తిచేసుకుపోతామని తిరుగుకబురెట్టారు' ఇక చేసేది లేక విశ్రాంతి మానుకుని లేచాను—వాళ్ళని పంపమని చెప్పి.

"వాళ్ళు నేను విజిటర్స్ రూమ్‌లోకి వచ్చే లోపల సరాసరి నా పడగ్గదిలోకే వచ్చేశారు. అకస్మాత్తుగా తలుపులు మూసేశారు. వాళ్ళిద్దరి చేతుల్లోను రెండు రివాల్వర్స ఉన్నాయి. అవి రెండూ సూటిగా నాకే గురి చేయబడి వున్నాయి. కదిలితే కాల్చేస్తామని బెదిరించారు. నేను భయపడి నోరు మెదపలేదు. నా మంచంమీద పరుపుకింద లైసెన్సున్న నా రివాల్వర్ ఉంటుంది. దాన్నందుకోవాలనుకున్నాను. కాని కాలు కదపనివ్వ లేదు వాళ్ళు.

"నా చేతుల్లోనే నా పడగ్గదిలో వున్న ఐరన్ సేఫ్ తెరిపించారు. అందులోంచి పదిలక్షలు పైకి తీయించారు. తమవెంట తెచ్చిన సూట్ కేసులో నాచేతే డబ్బుకట్టలు పేర్పించారు. ఆ తర్వాత నా నోట్లో గుడ్డలు కుక్కి, నా చేతులు మంచంకోడుకు కట్టేసి దర్జాగా వెళ్ళిపోయారు. ఆ తర్వాత వచ్చిన నౌకర్ల సాయంతో బంధవిముక్తుడనై మీకు ఫోన్ చేశాను" ముగించాడు రాజానాయుడు.

కిరణ్ ఆయనవంక సూటిగా చూశాడు.

మదపుటేనుగులా పోతరించి వున్నాడు నాయుడు. మెళ్ళో బంగారుచెయిన్ వేళాడుతోంది. చేతివేళ్ళకు వజ్రపు ఉంగరాలు ధగధగ మెరుస్తూన్నాయి.

అతన్ని, అతని ఇంటి వైభవాన్ని చూసినవాళ్ళ లక్ష్మీదేవిని అతను తన ఇల్లు కదలకుండా బంధించి వుంచాడని పిస్తుంది. అలాంటివాడికి పదిలక్షలు ఓ లెక్క కాదు. కాని డబ్బు సంపాదించేవాడికి పదిపైసలు పోయినా తట్టుకోలేడు. అదికూడా పెద్ద నష్టంగానే భావిస్తాడు. నాయుడు ఆ కోవకి చెందినవాడే.

"ఒకసారిగా పదిలక్షల కేష్ ఇంట్లో ఎందుకుంచారు? బ్యాంక్‌లు, లాకర్లు ఉన్నాయి కదా....!?" అడిగాడు కిరణ్.

నాయుడు తడబాటును కప్పిపుచ్చుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేశాడు. "నా పొలం, తోటలు అమ్మి అంత క్రితం రోజే క్యాష్ తెచ్చి సేఫ్‌లో పెట్టాను...." అన్నాడు.

"అంత అర్జంటుగా తోట లెందు కమ్మవలసి వచ్చింది?...."

"ఆర్టీసీ క్రాస్‌రోడ్స్ సమీపంలో కొత్తగా ఓ

థియేటర్ కట్టబోతున్నాను. స్థలం కొనటానికి, ఎక్విప్‌మెంటుకి ఆర్డరివ్వటానికి క్యాష్ అవసరపడింది. డబ్బు సర్దుబాటుకాలేదు. పొలం అమ్మక తప్పలేదు." చెప్పేసి, తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అతను చెప్పేది నిజం కాదని కిరణ్‌కి తెలిసిపోతూనే వుంది. అయినా తన ముఖంలో ఎలాంటి భావప్రకటన చెయ్యకుండా తల పంకించి వూరుకున్నాడు.

"ఐరన్ సేఫ్ వుండే గది చూపిస్తారా?" అడిగాడు కిరణ్.

నాయుడు భారంగా లేచాడు. శ్రీనివాస్, కిరణ్‌లు ఆయన్ని అనుసరించారు.

కిరణ్, శ్రీనివాసుల్ని తన పడగ్గదిలోకి తీసుకు వెళ్ళాడు నాయుడు. చాలా వైభవంగా వుందా గది. డెకోలాంతో తయారుచేయబడ్డ అల్మయిరాలు, గాజు తలుపులతో అద్దాల మేడలా వుందా గది. చుట్టూ నిలువుటద్దాలు—అరవైలో పడ్డ నాయుడి రసికత్వాన్ని చాటుతున్నాయి.

నాయుడు బెడ్‌కి తలవేపున వుంది ప్రత్యేకంగా తయారుచేయించిన బ్రహ్మాండమైన ఐరన్ సేఫ్. సగం వరకు గోడలో తాపటం చేయబడి వుంది.

మంచాని కివతలగా నేలమీద పడున్న ఓ ఐడింటిటీ కార్డు కిరణ్ దృష్టి నాకర్షించింది. వంగి దాన్నందుకున్నాడు.

నాయుడు సేఫ్‌ను చూపించి వెనుతిరిగాడు. "మీ ఇంట్లో ఇన్‌కంటాక్స్‌లో పని చేసేవాళ్ళెవరయినా వున్నారా?" అడిగాడు కిరణ్.

ఊహించని ఆ ప్రశ్నవిని ఉలిక్కిపడ్డాడు నాయుడు.

"లేరే! అందరూ బిజినెస్‌లోనే వున్నారు. ఎవరూ ఉద్యోగాలు చెయ్యటంలేదు" అన్నాడు.

"ఇందాకా మీరు చెప్పిందాట్లో డబ్బు పదిలక్షలు పోవటం నిజమేగాని, మిగతా విషయాలేవీ నిజం కాదం టాను. మీరేమంటారు?" అన్నాడు కిరణ్.

నాయుడు కోపంగా చూశాడతనివంక. "ఏమిటి మీ ఉద్దేశ్యం? నేనే కావాలని కల్పించి చెప్పానంటారా?" అన్నాడు.

"అవును. ఇద్దరు యువకులు వచ్చినమాట నిజమే! కాని వాళ్ళు తాము ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటుకి చెందినవాళ్ళమని, మీ యిల్లు రైడ్ చెయ్యటాని కొచ్చామని చెప్పారు. అయితే వాళ్ళు మీ పడగ్గదిలోకి సరాసరి రాలేదు. మీరే వాళ్ళని సగౌరవంగా ఈ గదిలోకి తీసుకువచ్చారు. వాళ్ళకు డబ్బు ఆశ చూపారు. ఎన్నో లొసుగులు, బ్లాక్‌మనీ నిల్వలు వున్న మీ ఇంటిమీద ఇన్‌కంటాక్సువాళ్ళు దాడిచేస్తే ఎన్నో లక్షలు టాక్స్ కింద కట్టాల్సి వుంటుంది. అందుకే వాళ్ళకో అరలక్షో, లక్షో ఆశ చూపించి నోరు నొక్కాలనుకున్నారు.

"వాళ్ళు మెత్తబడినట్టు నటించారు. మీరు డబ్బు కోసం ఐరన్ సేఫ్ తెరవగానే మీ మీద పడి రివాల్వర్ తోనో, కత్తితోనో బెదిరించి మిమ్మల్ని బంధించి, మీ కళ్ళముందే సూట్‌కేసులో పదిలక్షలు సర్దుకుని వెళ్ళి పోయారు. ఐరన్ సేఫ్‌లో వున్న నగలుగాని, విలువయిన పత్రాలు, బాండ్స్‌గాని వాళ్ళసలు ముట్టుకోలేదు— అవునా?" సూటిగా నాయుడు కళ్ళలోకి గుచ్చి చూస్తూ అన్నాడు కిరణ్.

నాయుడి ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. కోపం

తగ్గిపోయి దాని స్థానంలో బెరుకు, నిజం తెలిసిపోయిం దన్న ఆందోళన చోటు చేసుకున్నాయి.

"మీరు చెప్పేది నిజంకాదు" అన్నాడు బలహీనంగా. అతని గొంతులో స్పష్టత, ఖండన లేవు. ఏదో అనాలని అన్నట్టుంది.

"నాయుడుగారూ! మా దగ్గర నిజం దాచటంవల్ల లాభంలేదు. మేము మీ కే విధంగాను సహాయపడలేం. మీరు మాతో నిజాయితీగా సహకరిస్తేనే దొంగల్ని పట్టి మీ డబ్బు మీకు వాపసు చెయ్యగలం.... ఇంత పకడ్బం దీగా కోటలా కట్టిన యింట్లోకి సామాన్యుడు ప్రవేశించ లేడు. అడుగడుగునా నౌఖర్లున్నారు. కుక్కలున్నాయి. వాళ్ళింతో బలమైన కారణం చూపిస్తేనే గాని గేటు కూడా దాటనిచ్చి వుండడు మీ గూర్ఖా.

లోపలికొచ్చాక అంత చనువుగా ధైర్యంగా మీ పడ గ్గదిలోకి ప్రవేశించే ధైర్యంకూడా ఎవరికీ వుండదు మీ అంతట మీరు తీసుకువస్తే తప్ప! ఇన్‌కంటాక్స్ వాళ్ళని మీరు పూర్తిగా నమ్మింతర్వాతే వాళ్ళకి ఇంట్లోనూ, మీ పడగ్గదిలోనూ ప్రవేశం దొరికింది.... ఏమై రైట్?" ఉరిమినట్టుంది కిరణ్ గొంతు.

నాయుడు తలూపాడు నీరసంగా.

"వ్యాపారమన్నాక యేదో చిన్న చిన్న లొసుగు లుండక తప్పదు. వాటిని కాచుకోవటానికి మేం అధికా రులకు చిరుతిర్ఫు తినిపించక తప్పదు. వారం రోజులుగా ఇన్‌కంటాక్స్‌వాళ్ల రైడింగ్స్ జరుగుతున్నాయి. స్పెషల్ స్క్వాడ్స్ వస్తున్నాయి. అందుకని పాతవాళ్లని తడి పినా లాభం లేక మా జాగ్రత్తలో మే ముంటు

న్నాము....

"తాము స్పెషల్ స్క్వాడ్ అని చెప్పగానే ఐడెంటిఫికేషన్ చూపించమన్నాను. అందులో ఓ యువకుడు చూపించాడు. ఫోటోతోబాటు అంతా ఖచ్చితంగా వుంది. నమ్మక తప్పలేదు. సెర్చ్ కనుమతిస్తే వాళ్ళు అనుమానమున్నచోట గడ్డపలుగుల్తో ఇల్లంతా తవ్వి పారేస్తారు. అందుకే వాళ్ళకు ముందుగానే డబ్బాశ చూపించాను. లొంగిపోయారు.

"నా గదిలోకి తీసుకువెళ్ళి డబ్బివ్వబోయాను—అదే నేను చేసిన పొరబాటు. నేను రహస్యంగా ఎక్కడో దాచిన కేష్ నన్ను భయపెట్టి నాచేతే తీయించారు. నిజానికి సేఫ్‌లో చాలా కొద్ది మొత్తం మాత్రమే వుంది. పది లక్షలు వాళ్ళే డిమాండ్ చేశారు. తప్పనిసరి పరిస్థితిలో ఇచ్చాను" చెప్పాడు నాయుడు.

కిరణ్ తనకు దొరికిన ఐడెంటిఫికేషన్ కార్డు చూపించి, "ఈ ఫోటోలో వున్న యువకుడు ఆ యిద్దరు డెకాయిట్స్‌లో ఒకడు. అవునా?" అన్నాడు.

నాయుడు కళ్ళు పెద్దవి చేసి దానివంక చూసి, "ఎగ్జాట్లీ! ఇదే కార్డు నాకతను చూపించాడు. రెండో అతను కూడా తన ఫోటో వున్న కార్డు చూపించాడు. దీన్నిబట్టే నమ్మేశాను. ఇలాంటి ఐడెంటిఫికేషన్ కార్డ్సు గతంలో ఓసారి రైడ్ జరిగినపుడు చూశాను...." అన్నాడు.

అంతలోనే యేదో గుర్తొచ్చి, "మీకీ కార్డెలా దొరికింది?" అన్నాడు నాయుడు.

"ఇంతకి కొద్దిక్షణాల క్రితం ఇదిక్కడే నాకు కనిపిం

చింది. దీన్నిబట్టే మీరు మొదట చెప్పిందంతా అబద్ధమని గ్రహించాను. ఏమైనా దోపిడి చేసిన ఇద్దరు యువకుల్లో ఒకడి ఫోటో అనుకోకుండా మనకు చిక్కింది. తక్కినదంతా మేము చూసుకుంటాము....ఇంకా మీరు చెప్పే ముఖ్యమైన సంగతులేమైనా వున్నాయా? ఐ వాంట్ ట్రూత్. కల్లబొల్లి కల్పనలు కాదు" కిరణ్ గొంతు కంచుగంటలా మోగింది.

నాయుడి ముఖం నల్లగా మాడిపోయిందా మాటతో. "సారీ!....ఇంకేం లేదు" అన్నాడు.

కిరణ్, శ్రీనివాస్ బయటికొచ్చి జీపెక్కారు.

"ఈ ఫోటోని బట్టి దొంగల్ని పట్టుకోవటం కష్టం కాదనే ధైర్యం కలిగింది నాకు" అన్నాడు శ్రీనివాస్ దార్లో.

"ఈ ఫోటోలో వున్నవాడు పాత కేడీ కాదు, మీ పోలీసు రికార్డుల్లో తేలిగ్గా దొరికెయ్యటానికి. ఈ నేరస్థులు ఇరవై మందిలో యే ఒక్కడూ పాత నేరస్థుడు కాదు—అందరూ క్వైట్ న్యూ కల్ప్రిట్స్!" అన్నాడు కిరణ్.

నిరాశగా చూశాడు శ్రీనివాస్.

"అంతలోనే దిగాలుపడిపోతావేం, మైడియర్ ఇనస్పెక్టర్! ఓ 'క్లూ' దొరికింది. తక్కిన వివరాలు మనం పరిశోధించి తెలుసుకోవాలి" అన్నాడు కిరణ్ మందహాసం చేస్తూ.

జీప్ క్రైమ్ బ్రాంచ్ చేరుకునేటప్పటికి కేసుల లెక్కన చివాట్లు పై ఆఫీసర్ల నుంచి శ్రీనివాస్‌కి యెదురుచూస్తున్నాయి.

# 5

"సమయానికి మీరు ఖర్చులన్నీ భరించి ఆపరేషన్ జరిపించి ఉండకపోతే నా బిడ్డ నిష్కారణంగా చని పోయి ఉండేవాడు బాబూ! ఈ లోకంలో నాకు మిగిలి వున్నది వీడొక్కడే. గవర్నమెంటాసుపత్రిలో రోగాన్ని మరింత పెంచి, బతకడు తీసుకుపొమ్మన్నప్పుడు నా ఆవేదన ఇంతా అంతా కాదు.

"సమయానికి మీరు దేవుడిలా వచ్చి ప్రయివేటు ఆస్పత్రిలో ఏభై వేలు పైగా ఖర్చుపెట్టి నా బిడ్డను నాకు దక్కించారు. నా చర్మంతో చెప్పులు కుట్టిచ్చినా మీ ఋణం తీర్చుకోలేను బాబూ!" శాంతమ్మ చేతులెత్తి మొక్కింది సతీష్‌కి.

సతీష్ ఆమె రెండు చేతులు తన చేతుల్లో పైకి లేవకుండా మధ్యలోనే ఆపి. "మనం దండం పెట్టుకోవాల్సింది భగవంతుడికమ్మా! నీ కొడుకు పెద్ద చదువులు చదివాడు. కాని పొట్టనింపే ఉద్యోగం దొరక్క రిక్షాలాక్కుంటూ బతకాల్సి వచ్చింది. చివరికా వృత్తిలోనే ప్రమాదానికి గురై ప్రాణాలు పోగొట్టుకోబోయాడు. ఇక నీ కష్టాలు గట్టెక్కాయి. రామచంద్ర త్వరలోనే ప్రభుత్వం స్వయంఉపాధి కింద ఇచ్చే డబ్బుతో తన కాళ్ళమీద తను నిలబడగలడు" అన్నాడు చిరునవ్వుతో.

తెల్లగా పాలిపోయి నీరసంగా వున్న యువకుడు రామచంద్ర లేచికూచుని "మీ మేలు ఈ జన్మకి...." అనిబోతుండగా అతన్ని వారించి, "త్వరలోనే కొత్త జీవితాన్ని ప్రారంభిస్తావు. నేను ఆ ఏర్పాట్లు పూర్తి

చేస్తాను" అంటూ హుందాగా నడుచుకుంటూ వె
పోయాడు.

* * *

ఈ అనాథాశ్రమానికి మీరిచ్చిన లక్షరూపాయల
తప్పకుండా సాయంకాగల సార్! ఒక పూట కూడా కడు
నిండా తిండిలేని ఈ అభాగ్యులు రేపట్నుంచి తిం
కరువు లేకుండా సుఖంగా వుంటారు. చక్కగా చదు
కొని ఆరోగ్యంగా పెరుగుతారు. మీ వితరణ అవధ
లేనిది" అన్నాడు శరణాలయం అధికారి చెమ్మగిల్లి
కళ్ళతో.

సతీష్ చిన్నగా నవ్వి, "చూడండి, ఈ లక్ష రూపా
యలు నేను మీకు సరాసరి ఇవ్వటంలేదు. శరణాలయ
పేరున ఎకౌంటు తెరిచి అందులో వుంచుతున్నాను. దా
మీద వచ్చే వడ్డీతో ఈ అనాథలకు కావలసినవన్నీ
సమకూర్చండి. అవసరాన్నిబట్టి మరికొంత సొమ్ము జ
చేస్తాను. ప్రతినెల నేనొచ్చి అన్నీ సక్రమంగా జరుగ
తున్నాయో లేదో వెరిఫై చేస్తాను" అన్నాడు.

శరణాలయాధికారి కృతజ్ఞతగా తలూపి "అదే ప
లక్షలు సార్! నాకేలాంటి అభ్యంతరం లేదు. నెలనెల
శరణాలయానికి విరాళాలు యిచ్చే దాతలు కూడ
వున్నారు. అవీ, ఇదీ కలిసి వీళ్ళ అవసరాలకి దివ్యంగా
సరిపోతాయి. ఇక మాకు నిశ్చింత. ఇక చెకింగ్ విషయం
మీకు సర్వాధికారాలుంటాయి. నెలకొకసారేకాదు
ఎన్నిసార్లయినా, నెలలో యెప్పుడైనా వచ్చి చెక్
చేసుకోండి. చేసుకోవాలి కూడా!" అన్నాడు.

* * *

"నా కూతురి జీవితం నిలబెట్టావు బాబూ! నువ్వే

ఆదుకోకపోతే కట్నానికి, పెళ్ళి ఖర్చులకి లేక నా కూతురు పెళ్ళి ఆగిపోయి వుండేది. సమయానికి అప్పు పుట్టలేదు. ముహూర్తం వాయిదా వేసుకునే సావకాశమూ లేదు! దేవుడిలా సమయానికి పాతిక వేలు సర్ది నా పరువు మర్యాదలు, నా బిడ్డ బతుకు నిలబెట్టావు. నా కంఠంలో ప్రాణముండగా నీ ఋణం తీర్చుకుంటాను బాబూ!"

రాఘవయ్య కళ్ళలో నీటిధార కదిలి చెక్కిళ్ళమీద జారింది.

"బాబాయిగారూ. నేనీ డబ్బు ఋణంగా ఇవ్వటం లేదు. ఓ అన్నగా ఆడపడుచుకి పసుపు కుంకుమలకింద యిస్తున్నాను. మీరు ఋణం, పణం అంటూ పెద్ద మాటలు వాడితే వెంటనే వెళ్ళిపోతాను" సతీష్ బెదిరించాడు.

"వద్దన్నయ్యా, నువ్వు వెళ్ళొద్దు. నా పెళ్ళి నువ్వు లేకుండా జరగదు. అక్షతలు వేసి ఈ నిర్భాగ్యురాలైన చెల్లెల్ని ఆశీర్వదించి వెళ్ళు!" సతీష్ కాళ్ళు తాకబోయింది నీరజ.

చటుక్కున ఆమెను వారించి, తలమీద ఆప్యాయంగా నిమిరి, "నీ పెళ్ళి చివరికంటా చూసే మరీ వెళ్తానమ్మా! నీ వైవాహిక జీవితం నిండు నూరేళ్ళు సుఖసంతోషాలతో వర్ధిల్లాలని నిండు మనసుతో భగవంతుని కోరుకుంటూ నిన్నాశీర్వదిస్తున్నాను" అన్నాడు సతీష్.

• • •

"ఇంటిల్లిపాదికీ వాడి ఉద్యోగం ఒక్కటే ఆధారం. వాడు బ్యాంక్‌లో డిపాజిట్ చేయబోయిన లక్షన్నర రూపాయల్ని దొంగలు దోచుకుపోతే సమయానికి ఆ

డబ్బు కట్టి వాడ్ని పోలీసుల బారినుంచి కాపాడావు. వాడి ఉద్యోగంపోకుండా కాపాడి, మా ఇంటిల్లిపాదినీ పస్తులతో చావకుండా బతికించావు. ఏ తల్లి కన్నబిడ్డవో నా ఆయుష్షు కూడా పోసుకుని వెయ్యేళ్ళు వర్ధిల్లు నాయనా."

"ఆమె ఆశీస్సులతో పునీతుడైపోతూ చిరునవ్వు చిందిస్తూ నిల్చున్నాడు సతీష్.

రఘు సతీష్ చేతులు పట్టుకుని కళ్ళకు హత్తుకుని, "మా నాన్నగారు పోయాక యెంతో కష్టపడి సంపాదించుకున్నా నీ ఉద్యోగం. నా దురదృష్టవశాత్తూ ఆఫీసు డబ్బు బ్యాంక్‌లో కట్టేలోపల మాయమైపోయింది. లక్షన్నర రూపాయలు తక్కువ మొత్తంకాదు. ఎలా తీర్చుకోగలనో అర్థంకావటంలేదు. నెలనెలా కొంత డబ్బు నా జీతంనించి తీసి నీకు కట్టేద్దామంటే నా జీతం తప్ప మా కుటుంబ సభ్యులు ఎనిమిదిమందికీ మరో దారి లేదు. నాకో దారి చూపించు అన్నా!" అన్నాడు కన్నీరు కారుస్తూ.

"నీకు చూపించాల్సిన దారేదో నిన్ననే చూపించాను. దాన్ని నాకు తిరిగి చెల్లించాలని వృథా ప్రయాసపడకు. ఎప్పుడో నేనే ఏదో రూపంలో వసూలు చేసుకుంటాను" సతీష్ పెదాలమీద ఆదే చెరగని చిరునవ్వు.

• • •

"పూర్ బాయ్స్ ఫండ్‌కి లక్షరూపాయలతో ట్రస్టు ఏర్పరుస్తూ నీ పేరు బయటపెట్టవద్దంటే ఎలా బాబూ! ప్రభుత్వానికి, స్కూలు మేనేజిమెంటుకీ మేము లెక్కలు చూపించాలికదా! పోనీ నీ పేరు కాకపోయినా, మరో పేరైనా సూచించు. లేదా ఏ సంస్థ పేరైనా

సూచించు."

హెడ్మాష్టరు చెప్పిందంతా విని మందహాసం చేశాడు సతీష్.

"మాష్టారూ! మీరు నాకు చదువు చెప్పిన గురువు. ఆ ట్రస్టు మీ పేరునే వుంచండి" అన్నాడు.

"నా పేరుమీదనా? వద్దు బాబూ, పాఠాలు చెప్పుకునే బడిపంతులికి అంత డబ్బు ఒక్కసారిగా యెలా వచ్చిందని ఆరావస్తుంది. అది నా వల్ల కాదు బాబూ!"

"మాష్టారూ! 'విద్య నిగూఢవిత్తం' అన్నారు. ఈ డబ్బుతో చదువుకునే స్తోమతలేక చదువు మధ్యంతరంగా ఆపివేసే యెందరో బీద విద్యార్థులు, ప్రతిభావంతులైన పేదవాళ్ళు చదువుకొని పైకొస్తారు ఇలాంటి మహత్కార్యానికి ఈ డబ్బు ఉపయోగపడేటప్పుడు ఇది యెవరిచ్చారన్న వివరాలెందుకు మాష్టారూ!....సరే, మీరంతగా బలవంతం చేస్తున్నారు కాబట్టి దీన్ని ఏ.పి. బాంధవ్ అన్న పేరుమీద నడిపించండి" అన్నాడు సతీష్.

హెడ్మాష్టరు తెల్లబోయి, "ఏ.పి. బాంధవ్ నా? అలాంటి పేర్లుకూడా ఉంటాయా?" అన్నాడు.

"ఎందుకుండవు మాష్టారూ! ఏ.పి. బాంధవ్ అంటే ఆపద్బాంధవుడని అర్థం" అన్నాడు సతీష్.

• • •

"హల్లో, ఎవరు మాట్లాడేది?" సతీష్ అడిగాడు ఫోన్లో.

"ఏ.పి. బాంధవ్ కావాలి" అన్నారవతలినుంచి ఎవరో.

"ఎస్—స్పీకింగ్!" అన్నాడు సతీష్.

"కలప రెండు లక్షలు."

"ఊఁ!"

"ఏస్ బెస్టాస్ షీట్సు పదిహేడు లక్షలు."

"ఓ.కే!"

"సిమెంటు, బ్రిక్స్ అదర్ ఎక్స్పెన్సస్ కోసం పదిహేడు లక్షలు."

"ఊఁ!"

"మందులు, ఏంటీ కలరా ఇనాక్యులేషన్స్ వగైరా మెడికల్ అండ్ హెల్తు సర్వీసెస్ కోసం లక్షలు."

"అలాగే! మరో విషయం మరిచిపోయావు. డ్రింకింగ్ వాటర్ ప్రొవైడ్ చెయ్యాల్సిన అ యెంతయినా వుంది. వాటర్ బోర్న్ డిసీజెస్ ( రావటానికెంతో స్కోప్ వుంది."

"అవును. టాంకర్ల ద్వారా నీరు సరఫరా చెయ్య ఇదివరకే ఏర్పాట్లు చేశాం కదా! అందుకోసం పాతిక వేలు ఖర్చవుతుంది."

"సరే! మొత్తం ఎమౌంట్ కి డి.డి. పంపిస్తాను. యేర్పాట్లు సక్రమంగా ఉండేలా మీరందరు ప్ర శ్రద్ధ తీసుకోవాలి."

"ష్యూర్, ష్యూర్!"

"థాంక్యూ!" రిసీవర్ క్రెడిల్ చేశాడు సతీష్.

"ఇప్పటివరకు పది దోపిడీలు జరిగాయి. ఒక్క కూడా పరిష్కరించలేకపోయినందుకు మా ఉద్యో లూడిపోయేలా వున్నాయి" శ్రీనివాస్ వాపోయా

కిరణ్ జాలిగా చూశాడతని వంక.

"ఒక్క కేసు కూడా....అంటున్నావు—ఒక కేసు పెటిలయితే తక్కిన తొమ్మిది పరిష్కారమయిపోయినట్టే కాదా?"

"ఆ ఫోటో నిజం ఫోటో నేనంటావా?"

"ఫోటో నిజం ఫోటోయే! కాని ఐడెంటిఫికేషన్ కార్డు, డిపార్టుమెంటు సీల్స్, సంతకాలు అన్నీ డూప్లికేట్. రాజానాయుడ్ని బుట్టలో వేయటానికి ఆ దొంగలు పన్నిన మాస్టర్ ప్లాన్!"

"మనకావలసింది ఫోటోలోని వ్యక్తి. అతనే రాజానాయుడ్ని దోచిన ఇద్దరిలో ఒకడు కాబట్టి అతన్ని ట్రేస్ చెయ్యగలిగితే మబ్బు విడిపోయినట్టే!"

"ఆ వ్యక్తి అంత నిర్లక్ష్యంగా, తన ఐడెంటిటీ గురించి ఏమాత్రం శ్రద్ధతీసుకోకుండా ప్రవర్తించాడంటే అతని కెంత ఆత్మవిశ్వాసముందో అర్థమవుతుంది. అంత తేలిగ్గా మనకి చిక్కడని నా నమ్మకం. ఎనీహౌ, మన ప్రయత్నాలు చేద్దాం. ఆ మాస్టర్ బ్రెయిన్స్‌ని మించిన వ్యూహం పన్నాలి మనం."

"చెప్పు బ్రదర్, నిప్పుల్లో దూకమన్నా, సముద్రంలో మునగమన్నా, పులిబోనులో తల పెట్టమన్నా—సిద్ధంగా వున్నాను."

"అంత కష్టపడనక్కర్లేదు. ఈ యూరచోరులు బాగా డబ్బున్న ఇళ్ళమీదే దాడిచేస్తున్నారు. అదీగాక ఆ ధనవంతులు అన్యాయంగా, దారుణంగా ఆర్జించిన వాళ్ళయి ఉంటున్నారు. దీన్నిబట్టి మనకర్థమైందేమిటంటే, ప్రజల్ని ఘోరంగా దోచుకుని కోట్లుగడించిన వాళ్ళ ఇళ్ళే దోపిడీ చేశారు, చేస్తున్నారు, చేస్తారు. కాబట్టి నగరంలో అలాంటి బడా బాబులెవరున్నారో

లెక్కదీసి వాళ్ళిళ్ళ దగ్గర మనం మాటువేసి వుంచాలి. అప్పుడు పిట్టలు సరాసరి వచ్చి వలలో చిక్కుతాయి" అన్నాడు కిరణ్.

"సాధారణంగా కోట్లు గడించిన వాళ్ళందరు దాదాపుగా ప్రజల్ని వంచించో, దోచుకునో, అక్రమంగా ఆర్జించినవాళ్ళే! అలాంటి వాళ్ళు నగరంలో వందల సంఖ్యంలో ఉంటారు. వాళ్ళందరినీ కవర్ చెయ్యాలంటే...."

"కష్టమంటావు. మీ డిపార్టుమెంటు చిన్నదేంకాదు. ఒక్కో యింటి దగ్గరా యిద్దరిచొప్పున నిఘా వేయించు. వాళ్ళందరికీ మినీ వైర్లెస్ సెట్స్ ప్రొవైడ్ చెయ్యి. వాటితో కంట్రోల్ రూంకి రిలేషన్స్ ఏర్పాటు చెయ్యి. అయితే మనమీ ఏర్పాట్లు చేస్తూన్నట్టు ఆ యువచోరుల కేమాత్రం తెలియకూడదు. అలా జరిగితే ముందే జాగ్రత్తపడిపోతారు. ఎన్నటికీ మనకు చిక్కరు" హెచ్చరించాడు కిరణ్.

శ్రీనివాస్ తలూపి, "ఇప్పట్నుంచీ ఆ అరేంజిమెంట్స్‌లో వుంటాను.... సరే, ఇంకేం చెయ్యమంటావో చెప్పు" అన్నాడు.

"ఓసారి తక్కిన తొమ్మిదిమంది కోటీశ్వరుల్ని కలిసి, వాళ్ళ కథనాల్ని కూడా విందాం. వాళ్ళు యువచోరుల రూపురేఖా విలాసాల్ని వర్ణించి చెపితే వాటిని మనం బాగా గుర్తుపెట్టుకుని మన వేట సాగిద్దాం."

"మనుషుల్ని చూసింది వాళ్ళు, మనమెలా గుర్తుపట్టగలం?"

"మెదడుతో. వాళ్ళు ఇరవైమందీ ఇప్పటిదాకా మారు వేషం వెయ్యలేదు. తమ ఒరిజినల్ రూపాల్లోనే

ధైర్యంగా నేరాలు చేశారు. వాళ్ళని మరోసారి చూస్తే ఈ మోసపోయిన కోటీశ్వ్రరావులందరు గుర్తుపట్టగల రంటావా, లేదా?"

"ఈ చోర శిఖామణులు లీలోపల దేశం వదిలి పారి పోతేనో....!?"

"ఓ.హో, ఇన్‌స్పెక్టర్. నీకు అన్నీ రాకూడని అను మానాలే వస్తాయేం? వాళ్ళు ఇప్పట్లో యెక్కడికీ పారి పోరు—బహుశా యెప్పటికీ పారిపోరనే నా నమ్మకం. మీవాళ్ళని ఈ క్షణంనించీ ఎలర్ట్ చెయ్యి. ప్రతి జంటకీ వైర్‌లెస్ సెట్స్ యివ్వటం మాత్రం మరిచిపోకు."

"అది మరిచిపోతానా? ఇప్పుడే హెడ్‌క్వార్టర్స్‌కి ఫోన్ చేసి అత్యవసర సమావేశం ఏర్పాటు చేస్తాను. మరి ఆ తొమ్మిదిమంది విక్టిమ్స్‌ని ఎప్పుడు కలుద్దాం?"

"ఇప్పుడే. ఆ సమావేశం కేవలం ఓ గంటలో ముగించుకునిరా! నేనిక్కడే యెదురుచూస్తూంటాను" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ హడావిడిగా వెళ్ళిపోయాడు.

సరిగ్గా అప్పుడే టేబిల్ మీద ఫోన్ గణగణ మోగింది. కిరణ్ రిసీవరందుకున్నాడు.

"హల్లో....క్రైం బ్రాంచ్....!" అన్నాడు.

"హల్లో, ఎవరు మాట్లాడేది?"

"ముందు మీరెవరో చెప్పండి" కిరణ్ గొంతు కంచులా మోగింది.

"ప్లీజ్, కోపగించకండి. నాకు డిటెక్టివ్ కిరణ్ గారు కావాలి. అక్కడుంటే కాస్త పిలవండి" అవతలి గొంతు అభ్యర్థించింది.

"ఎస్. కిరణ్ స్పీకింగ్. మీరెవరు?"

"నమస్తే కిరణ్ గారూ! మీ గొంతు గుర్తించలేక పోయాను. క్షమించాలి."

"ఆల్ రైట్, మీరెవరు, నాతో మీకేం పని?"

"అది చెప్పాలనే రింగ్ చేశాను సార్! నేను ఇప్పటి వరకు జరిగిన దోపిడీలకి మూలకారకుడ్ని...."

కిరణ్ ఉలిక్కిపడ్డాడు. అతని చేతిలోని రిసీవర్ బిగుసుకుంది. కణతలు పొంగాయి.

"నీ పేరు?"

"పేరుతో యేముంది సార్, మా కార్యక్రమం పూర్తయ్యాక మేమే స్వయంగా పోలీసులకు లొంగిపోతాం. దయచేసి మా టార్గెట్ పూర్తయ్యేవరకు మా కార్యకలాపాలకు అడ్డురాకండి."

"బెదిరిస్తున్నావా?"

"నో నో! అంత మాటనకండి సార్! మీ సామర్థ్యం, మేధాశక్తి, మీరు సాధించిన ఘనవిజయాలు—అన్నీ మాకు తెలుసు సార్! ఎన్నో క్లిష్టమైన కేసుల్ని సునాయాసంగా పరిష్కరించి, జాతీయ, అంతర్జాతీయ నేరస్తుల్ని మీరు చట్టానికి పట్టి అప్పగించటం కూడా మాకు తెలుసు.

"ఈ కేసులో మీరు పనిచేస్తున్నారని ఇంతకు కొద్ది నిమిషాల క్రితమే మాకు తెలిసింది. మీరు కలగజేసుకుంటే మా ఆట కట్టయిపోతుందని, మా లక్ష్యం నెరవేరకుండా పోతుందని భయపడుతున్నాము. మీకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. దయచేసి ఈ కేసునుంచి విరమించండి."

"మిస్టర్, చాలా తెలివిగా మాట్లాడుతున్నావో, అమాయకుడివో అర్థంకావటంలేదు. లక్షలకు లక్షలు

దోపిడీ చేస్తూ నగరంలోని ధనికవర్గాన్ని, పోలీసుల్ని అదరగొడుతూ విశృంఖలంగా స్వైరవిహారం చేస్తూన్న మిమ్మల్ని నేను క్షమించలేను. మిమ్మల్ని పట్టి బంధించే వరకూ విశ్రమించను. నాకు ఫోన్ చేసి చాలా శ్రమ తీసుకున్నావు. ఇప్పటికి నా మించిపోయిందిలేదు. స్వచ్ఛందంగా లొంగిపోదలచుకుంటే యూ ఆర్ మోస్టు వెల్‌కమ్! లేదా, మా పరిశోధనలో పట్టుబడక తప్పదు. ఇబ్బడిముబ్బడిగా శిక్ష అనుభవించక తప్పదు! బి కేర్‌ఫుల్!"

"కిరణ్ గారూ! మే మనుకున్న లక్ష్యం సగం మాత్రమే నెరవేరింది. తక్కిన సగం పూర్తయిన వెంటనే మేం స్వయంగా పోలీసులకు లొంగిపోతామని మరోసారి మనవి చేస్తున్నాను. మేం బీదవాళ్లని, అమాయకుల్ని, న్యాయంగా సంపాదించిన ధనవంతుల్ని దోచుకోవటం లేదు. ప్రజల్ని, ప్రభుత్వాన్ని మోసంచేసి అన్యాయంగా అక్రమంగా సంపాదించిన కొద్దిమంది కోటీశ్వరుల్నించి స్వల్పంగా పెనాల్టీ వసూలు చేస్తున్నాము, అంతే! మీ రీ పాటికే మా పద్ధతిని గ్రహించే వుంటారు. దయచేసి ఒక వారంరోజులపాటు మీరు జోక్యం చేసుకోకుండా వుంటే. ఈ లోపల మే మనుకున్నది సాధిస్తాం. తృప్తిగా సరెండరయిపోతాం."

"మిస్టర్, నీ ఉపన్యాసం ఆపు ...ఇంతసేపూ యేదో లక్ష్యమూ, టార్గెట్ అంటూ చెప్తూన్నావే. అదేమిటో నాకు చెప్పు. అది సమంజసమైనదీ, ప్రజోపయోగకరమైనదీ అని నా కనిపిస్తే నేను నీ కేదైనా సలహా యివ్వగలను. అంతేగాని మరొక్క దోపిడీకి కూడా అనుమతించలేను, క్షమించను" కిరణ్ గొంతు స్థిరంగా నిశ్చలంగా

పలికింది.

అవతలి వ్యక్తి కొద్ది క్షణాలసేపు మాట్లాడలేదు. తర్వాత గొంతు సవరించుకుని "క్షమించండి కిరణ్ గారూ! నా లక్ష్యం అసంపూర్తిగా మిగిలిపోయింది. దాన్నిప్పుడు వెల్లడి చెయ్యలేను. త్వరలోనే నేను స్వయంగా మిమ్మల్ని కల్సుకుని అంతా వివరిస్తాను. నా కోరిక మన్నించి ఒక వారంరోజులు మీరు అంతరాయం కలిగించరని విశ్వసిస్తున్నాను. మరోసారి చేతులు జోడించి నమస్కరిస్తున్నాను" అన్నాడు.

"సారీ, మిస్టర్!—సంఘవిద్రోహక శక్తుల గుండెల్లో నిద్రపోతాడీ కిరణ్. నువ్వూ, నీ సహచరులు చేస్తున్న ఈ దోపిడీలని నేను క్షమించలేను. మిమ్మల్ని శిక్షించక తప్పదు. మరోసారి, ఆఖరిసారి హెచ్చరిస్తున్నాను— మీ అంతట సరెండరయిపోయినా సరే, లేదా—త్వరలో అతి త్వరలో మీ అందర్నీ పట్టి చట్టాని కప్పగిస్తాను."

"సారీ, కిరణ్ సాబ్! ఆరంభించిన పనిని మధ్యలో వదలిపెట్టలేను. విష్ యూ బెస్టాఫ్ లక్!"

"విష్ యూ బాడ్ లక్!" అంటూ ఫోన్ క్రెడిల్ చేశాడు కిరణ్.

మరో అరగంట తర్వాత తిరిగొచ్చిన శ్రీనివాస్ వంక ప్రశ్నార్థకంగా చూశాడు కిరణ్.

"అన్ని యేర్పాట్లు పూర్తయ్యాయి. అన్యాయంగా అక్రమంగా ధనార్జన చేసిన కోటీశ్వరు లీ నగరంలో లెక్కకుమించి వున్నారు. అందరిళ్ల దగ్గర మఫ్టీలో మా వాళ్లని ఎరేంజ్ చేశాం. దొంగలకి అనుమానంగాకుండా రహస్యంగా, అతి సహజంగా మావాళ్ళు గస్తీ తిరిగే ఏర్పాట్లు చేశాం. ఇక ఆ డెకాయిట్స్ తప్పించుకు

పోలేరు" శ్రీనివాస్ గొంతులో ఆవేశం, కసి ధ్వనిం చాయి.

"నీ శత్రువుల్లో ఒకడ్ని ఇంతక్రితమే కల్సుకున్నాను" చెప్పాడు కిరణ్.

అదిరిపడి చూశాడు శ్రీనివాస్ అతనివంక. "ఏడి? ఎవడు వాడు?" అన్నాడు ఆత్రుతగా.

"ముఖ స్తంగా కాదు—ఫోన్‌లో."

"ఏమంటున్నాడు? అసలు ఎవడు వాడు?"

"ఎవడో తెలీదు—కాని త్వరలోనే మనం బంధించ గలం."

"వివరంగా చెప్పు బ్రదర్, సస్పెన్స్‌లో పెట్టక!"

"చెప్తాను. పద!" అన్నాడు కిరణ్ లేస్తూ.

శ్రీనివాస్ అయోమయంగా చూశాడు.

## 7

"హల్లో, ఏ. పి. బాంధవ్ స్పీకింగ్!" అన్నాడు సతీష్.

"నేనూ, భారత్‌ని మాట్లాడుతున్నాను. అర్జంటుగా పన్నెండు లక్షలు కావాలి. మెసంజర్ చేత పంపించు! డి.డి., ఎమ్.వోలు ఆలస్యమవుతాయి" అవతలి వ్యక్తి కంగారుగా చెప్పాడు.

"అలాగే పంపిస్తాను. కాని ఈ రోజు వీలుకాక పోవచ్చు."

"అలా అంటే ఎలా బాంధవ్! ఇంతవరకు వచ్చాక మనం వెనకాడితే ఎలా? ఇదే చాలా క్రిటికల్ పొజి షన్."

"అవును భారత్, కాని నా దగ్గర యిప్పుడు అంత క్యాష్ లేదు. ప్రస్తుతం నాలుగు లక్షలుంది. పంపిస్తు

న్నాను — రేపు ఉదయానికి తక్కినది పంపిస్తాను."

"సరే, అదేదో తొందరగా కానివ్వు. చాలా అర్జంటు."

"ఇప్పుడే పంపిస్తున్నాను. అక్కడ పరిస్థితు లెలా వున్నాయి? అదుపులో వున్నట్లేనా?"

"చాలా ఆశాజనకంగా వుంది. ఇప్పుడు మనం అర్థికంగా యెంతయినా అదుకోవాలి. అందుకే అర్జంటు అంటున్నాను."

"ఓ.కే! మరో అరగంటలో మన క్యాష్ బయలుదేరు న్నాడు. పెట్టేస్తున్నాను" అంటూ రిసీవర్ క్రెడిల్ చేశాడు సతీష్.

సరిగ్గా అప్పుడే ఓ యాభైయేళ్ళ వ్యక్తి లోని కొచ్చాడు. ప్రశ్నార్థకంగా చూశాడు సతీష్.

"బాబూ, ఓ పదివేలు సర్దగలవా? అల్లుడు అమ్మాయిని వేధిస్తున్నాడు. పెళ్ళికి అదుకున్నావు. మళ్ళీ అడగటానికి నోరు రావటంలేదు" అన్నాడాయన.

"చూడండి బాబాయిగారూ, పెళ్ళి ఆగిపోతుందన్న సమయంలో కట్నానికి, లాంఛనాలకి చాలా డబ్బిచ్చాం అల్లుడికి. మన మిస్తున్నాం కదా అని అతను పదే పదే డిమాండ్ చేయటం విచారకరం. పెళ్ళయి నాలుగురోజులు కాలేదు, అప్పుడే అమ్మాయిని వేధిస్తున్నాడంటే, ఇక జీవితాంతం డబ్బుకోసం రాచి రంపాన పెడతాడన్న మాట! ఇలాంటి వాడికెలా సమాధానం చెప్పాలో మేం చూసుకుంటాం. మీరు వెళ్ళండి."

"బాబూ! అలా అంటే ఎలా? ఎంతయినా అల్లుడు. మీరు కలగజేసుకుంటే దాని కాపుర మేమైపోతుందో?

ఒక పదివేలు పర్దితే అమ్మాయి సంసారం చక్కబడుతుంది. మీ కది ఓ లెక్కలోది కాదు. నేను ఎలాగో వీలునుబట్టి తీర్చేసుకుంటాను."

"బాబాయిగారూ, నేను డబ్బుకు వెనుతీసే మనిషిని కాదని మీకు తెలుసు. నన్నర్థం చేసుకోరేం? ఇలా అలవాటు చేస్తే మీరు చక్కబడుతుందనుకొంటున్న చెల్లాయి కాపురం అస్తవ్యస్తమైపోతుంది. చీటికి మాటికి డబ్బు కోసం పుట్టింటికి పంపేస్తాడు అల్లుడు. మీరలా చూస్తూండండి, డబ్బుతో నిమిత్తం లేకుండా అంతా మేము సరి చేస్తాము."

"బాబూ, అల్లుడిని కొట్టడం, అలాంటిదేమీ చెయ్యరు కదా....!?"

"మీరు వెళ్ళండి బాబాయి, యేం చెయ్యాలో మాకు తెలుసు."

"బాబూ! మీకు డబ్బివ్వకపోతే పోనీగాని దాని సంసారం రచ్చకెక్కించకండి. నేనే ఎక్కడో తంటాలు పడి సర్దుబాటు చేసుకుంటాను. మీ కిదివర కిచ్చిన సొమ్మును యెలాగో వీలువెంట తీర్చుకొంటాను...."

"బాబాయ్" సతీష్ గొంతులో ఆవేదన, బాధ తొంగిచూశాయి. "మీరు నన్ను చాలా అపార్థం చేసుకున్నారు. మీ వ్యక్తిగత విషయాల్లో తలదూర్చే అధికారం మాకు లేదు. అవసరానికి సహాయపడటం మా ధర్మంగా భావించాము, చేశాము. ఆల్ రైట్. ఇక మీ అమ్మాయి విషయంలో మేమెలాంటి జోక్యం చేసుకోము—మీరు నిశ్చింతగా ఉండొచ్చు." సతీష్ కణతలు రుద్దుకుంటూ కుర్చీలో శిలావిగ్రహంలా కూచుండిపోయాడు.

చివరికి తను చేసిందానికిదా ప్రత్యుపకారం? నిందలు, నిష్ఠూరాలేనా కడకు మిగిలేది? ఆపదలో సహాయపడినందుకు సంతోషించేది పోయి, ఇంకా యింకా సాయం చెయ్యాలని కోరటం, చెయ్యకపోతే యింతక్రితం చేసిందాన్ని కూడా తృణప్రాయంగా చూడటం—ఇదా తను కోరుకున్నది!? మనుషు లింత స్వార్థపరులా? చేసిన మేలు నింత త్వరగా మరచిపోయే కృతఘ్నులా?

సతీష్ మనసు వికలమైపోయింది.

"నీకు చేతనయిన సాయం చెయ్యి. ఆపదలో అడ్డుపడు. అంతేగాని కృతజ్ఞతలు, ప్రత్యుపకారాలు, గుర్తింపు కోరకు" అతని అంతరాత్మ హెచ్చరించింది.

సతీష్ మనసు క్షణాల్లో ప్రశాంతతను సంతరించుకుంది.

"అవును, నాకు చేతనైన సాయం, కష్టంలో ఉన్న వాళ్ళకి చేస్తూన్నాను. వాళ్ళ జీవితాలను చక్కదిద్దగలుగుతున్నాను. ఆ తృప్తి, మనశ్శాంతి చాలు తనకి! అంతకన్న తను కోరేదిలేదు!"

సతీష్ పెదాలమీద చిరునవ్వు మెరిసింది.

అప్పుడే శ్యామ్ లోపలికడుగు పెట్టాడు. సతీష్ ఐరన్ సేఫ్ వైపు నడిచాడు.

# 8

సికింద్రాబాద్ స్టేషన్ పక్కగా పోలీస్ జీప్ పోతోంది. కిరణ్, శ్రీనివాస్‌లు సరోజినీదేవి రోడ్‌లో వున్న మనీలాల్ యింటికి వెళ్తున్నారు.

అకస్మాత్తుగా కిరణ్ దృష్టి అప్పుడే టాక్సీ దిగి స్టేషన్‌లోకి వెళ్తున్న వ్యక్తిమీద పడింది. అతని చేతిలో చిన్న బ్రీఫ్ కేస్ మాత్రం వుంది.

"ఇన్‌స్పెక్టర్ జీప్‌ని సరాసరి స్టేషన్ ముందుకు పోనివ్వు. క్విక్!" అన్నాడు కిరణ్.

మరుక్షణం జీప్ స్టేషన్ ముందాగింది.

ఒక్క గెంతులో లాంజ్‌లోకి ఉరికాడు కిరణ్. సరిగ్గా అప్పుడే ఆ వ్యక్తి టికెట్ తీసుకోవటం, ట్రెయిన్ వైపు పరుగెత్తడం జరిగింది.

మద్రాసుపోయే ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్ అప్పుడే పెద్దగా అరిచి ముందుకి కదిలింది. అతను ఓ కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కాడు. ఆ వెనకే మెరుపువేగంతో కిరణ్ దూసుకుపోయి ఆఖరిక్షణంలో అదే కంపార్టుమెంట్‌లోకి ఎక్కాడు.

డోర్‌కు అడ్డంగా మహా ప్రవాహంలా జనం.... జనం....వాళ్ళు ఓ పట్టాన కిరణ్‌ని లోనికి చొరబడనివ్వలేదు.

కిరణ్ తన సూదంటురాయిలాంటి దృష్టిని లోపలికి ప్రసరించి ఆ వ్యక్తిని దృష్టిపథంనించి తప్పించుకోకుండా చూసుకుంటున్నాడు. మెల్లిగా జరుగుతూ అతన్ని సమీపించాడు.

అయితే, అప్పటికే ఆ వ్యక్తి కిరణ్‌ని చూసేశాడు. ఒక్కక్షణం అతని భ్రుకుటి ముడిపడింది. ఆ మరుక్షణం ఒక్కసారిగా కంపార్టుమెంటు ఆ చివరకు దూసుకుపోయాడు.

కిరణ్ ప్రమాదాన్ని గుర్తించాడు. జనాన్ని తప్పించుకుంటూ వేగంగా అతన్ని చేరుకున్నాడు—అప్పటికి ట్రెయిన్ వేగం పుంజుకుంటోంది. ప్లాట్‌ఫాం దాటేసింది.

"మిస్టర్, ఆగు!" అన్నాడు కిరణ్.

అయితే ఆ వ్యక్తి ఆగలేదు. ట్రెయిన్‌లోనుంచి కిందికి గెంతేశాడు.

అయితే అతను సరాసరి ట్రెయిన్ చక్రాల క్రిందకి వెళ్ళిపోయాడు. మరుక్షణం హృదయవిదారకమైన కేక వెలువడటం, కిరణ్ చెయ్యి అలారం గొలుసును బలంగా కిందికి లాగటం ఒకేసారి జరిగిపోయింది.

కీచుమంటూ చప్పుడు చేశాయి ట్రెయిన్ చక్రాలు. చిన్న జర్కుతో ట్రెయిన్ ఆగిపోయింది.

సరిగ్గా అప్పటికి శ్రీనివాస్ కూడా వేగంగా అక్కడికి దూసుకొచ్చాడు.

హృదయవిదారకమైన దృశ్యం చూపరులను కాసేపు దిగ్భ్రాంతిలో ముంచేసింది.

శవం తల మొండెంనించి వేరైపోయింది. బ్రీఫ్‌కేస్ మాత్రం దూరంగా పడిపోయివుంది. శ్రీనివాస్ దాన్ని బలవంతాన తెరిచాడు. దాన్నిండా కరెన్సీ నోట్లు! లెక్కించాడు శ్రీనివాస్. సరిగ్గా నాలుగు లక్షలు!

కిరణ్ గుండెనెవరో ఇపప పిడికిలితో నలిపినట్లు ఫీలయ్యాడు. దొరికిన ఒకే ఒక సాక్షి మృత్యుకోరల్లో నలిగిపోయాడు. డెకాయిట్స్ జాడ కనుక్కునే అవకాశం దొరికినట్టే దొరికి చేజారిపోయింది.

శ్రీనివాస్ ప్రశ్నార్థకంగా చూశాడు కిరణ్ వంక. కిరణ్ కోటుజేబులోనించి రాజానాయుడి ఇంటిదగ్గర దొరికిన ఐడెంటిటీ కార్డు చూపించాడు. అందులోని ఫోటోలోని యువకుడు వంక, శవం ముఖం వంక మార్చి మార్చి చూశాడు శ్రీనివాస్.

"మైగాడ్! డెకాయిట్" అప్రయత్నంగా అతని నోటినుంచి వెలువడ్డాయా రెండు మాటలు.

"ఈ ఫార్మాలిటీస్ అన్నీ యెవరికైనా అప్పగించు. మనం వెంటనే వెళ్ళాలి" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ స్టేషన్ మాస్టర్ రూంవైపు వేగంగా నడిచాడు.

మరో పదినిమిషాల తర్వాత ఇద్దరు స్టేషన్ బయటున్న జీప్ చేరుకున్నారు.

కిరణ్ స్టీరింగ్ ముందు కూచున్నాడు. జీప్ రోడ్ యెక్కుతుండగా వైర్ లెస్ సెట్ నించి బీప్....బీప్.... మంటూ సిగ్నల్స్ రావటం మొదలయ్యింది.

శ్రీనివాస్ అటెండయ్యాడు. వింటున్న అతని కళ్ళు మెరిశాయి. కిరణ్ జీప్ ని పక్కగా తీసి నిలిపాడు.

"శేఠ్ చందన్ లాల్ ఇంట్లో ఇంతకు కొద్దినిమిషాల కితం ఇద్దరు యువకులు ఓ సూట్ కేస్ తో ప్రవేశించారట. అక్కడ సెంట్రీలుగా వున్న మన ఏజెంట్స్ మెసేజ్ పంపారు" అన్నాడు శ్రీనివాస్ కిరణ్ వైపు టెన్షన్ తో చూస్తూ

కిరణ్ వెంటనే మెసేజ్ కి తను అటెండయ్యాడు.

"మీరు వాళ్ళని నిరాటంకంగా తమ పని పూర్తి చేసుకోనివ్వండి. వాళ్ళు బయటకొచ్చేవరకు మీరక్కడే ఉండండి. మేము పదినిమిషాల్లో చేరుకుంటున్నాం అక్కడికి. ఈలోపల వాళ్ళు బయటికొచ్చి వెళ్ళిపోతుంటే వాళ్ళని వెంటనే వెంబడించండి. ఏ రూట్ లో వాళ్ళు వెళ్తున్నదీ మాకు కంటిన్యూస్ గా మెసేజ్ పంపుతూ వుండండి. దాన్నిబట్టి మేం ఫాలో అవుతాం. ఎట్టి పరిస్థితుల్లోను వారినాపవద్దు....ఓవర్...." అన్నాడు కిరణ్.

తర్వాత శ్రీనివాస్ కి సెట్ నందించి, "హెడ్ క్వార్ట

ర్సుకి మెసేజ్ పంపు. ప్రస్తుతానికి చందన్‌లాల్ యింటి సమీపంలో వెయిట్ చెయ్యమని చెప్పు. తర్వాత ఎక్కడికి ఫాలో కావలసింది చెప్తామని చెప్పు" అన్నాడు.

శ్రీనివాస్ మెసేజ్ పంపుతుండగానే మెరుపు వేగంతో జీపుని ఆబిడ్స్‌లో వున్న శేఠ్ చందన్‌లాల్ నివాసానికి దూసుకుపోనిచ్చాడు కిరణ్.

దార్లోనే శ్రీనివాస్ తన ఖాకీ దుస్తులమీద మామూలు సివిల్ దుస్తులు తొడిగేశాడు. హేట్ తీసి పక్కన పెట్టాడు. జీపుని ఆబిడ్స్ పోలీస్ స్టేషన్ దగ్గర ఆపేశాడు కిరణ్. అక్కడ సిద్ధంగా ఉన్న అంబాసిడర్ కార్‌లోకి చాలా వేగంగా షిఫ్టు అయిపోయారు కిరణ్, శ్రీనివాస్‌లు—వైర్‌లెస్‌తో బాటు.

మరో రెండు నిమిషాల్లో కారు చందన్‌లాల్ నివాసానికి చేరుకొంది. కారుని దూరంగా పార్కు చేసి చందన్‌లాల్ ఇంటిమీదికి దృష్టిసారించాడు కిరణ్. సెంట్రీ లిద్దరు మఫ్టీలో పాన్‌షాప్ ముందు కూచుని ఉండటం కనిపించింది.

అంటే, లోపలికి వెళ్ళిన యువకులిద్దరు ఇంకా బయటకి రాలేదన్నమాట!

శ్రీనివాస్ కిరణ్ వంక ప్రశంసాపూర్వకంగా చూశాడు—సమయానికి స్పాట్‌కి చేర్చినందుకు.

మరో అయిదు నిమిషాలకు బరువైన సూట్‌కేస్‌ను మోసుకుంటూ యిద్దరు యువకులు బయటికి రావటం, యెక్కడ్నుంచో ఓ స్పోర్ట్సు కారు దూసుకురావటం, యిద్దరు యువకులు అందులో యెక్కి కూచోవటం, స్పోర్ట్సు కారు వేగంగా నాంపల్లివైపు దూసుకుపోవటం చాలా వేగంగా జరిగిపోయాయి.

కిరణ్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఇంజన్ స్టార్టుచేసి నాంపల్లివైపు ఉరికించాడు అంబాసడర్ని.

స్పోర్ట్సు కారు చాలా వేగంగా ఉరకలు వేస్తూ పోతోంది.

అప్పుడు సమయం, సాయంత్రం నాలుగున్నర గంటలు. పట్టపగలు కోటీశ్వరుల యిళ్ళలో ప్రవేశించి అంత ధైర్యంగా రాన్సమ్ మొత్తాల్ని రాబరీ చేస్తున్న ఈ డెకాయిట్స్ని చూస్తూంటే కిరణ్ శరీరం రోమాంచిత మయింది. ఏమిటి వీళ్ళ మొండి ధైర్యం? దీన్ని వాళ్ళ సామర్థ్యమనాలా, పోలీసుల వైఫల్యమనాలా?

స్పోర్ట్సు కారు లక్డీకాపూల్ మీదుగా సరాసరి సాగి పోతోంది. తమ వెనుక యేదైనా వాహనంగాని, మరెవ రైనాగాని అనుసరిస్తూన్నారో లేదో వాళ్ళు అనుమా నించినట్టులేదు.

అమీర్ పేట్ వరకు ప్రయాణం అలా పరుగుపందెంలా సాగిపోయింది.

కిరణ్ రియర్ వ్యూ మిర్రర్ లో సుదూరంగా పోలీస్ వాన్ అనుసరించటం గమనించి తృప్తిగా నిశ్వసించాడు. హెడ్ క్వార్టర్స్ నించి చందన్ లాల్ యింటికి చేరుకున్న వ్యాన్ తమని ఫాలో అవుతోంది. డెకాయిట్స్ స్థావరం లొకేట్ చేసిన మరుక్షణం దాడిచెయ్యటానికి సర్వసన్న ద్ధంగా వుంది రంగం.

స్పోర్ట్సు కారు యెక్కడా ఆగకుండా సంజీవరెడ్డి నగర్ మీదుగా కూకట్ పల్లి చేరుకుంది.

అంబాసడర్ని దానికి వందగజాల దూరంలో నడుపు తున్నాడు కిరణ్. సుదూరంగా పోలీస్ వ్యాన్ అనుస రిస్తోంది.

సాయంత్రం అయిదు గంటలయింది.

స్పోర్ట్సు కారు కూకట్ పల్లిలోని ఓ ఇంటిముందాగింది. కాలనీకి బాగా దూరంగా విసిరేసినట్టుందా ఇల్లు. అంబాసడర్ కాలనీ దాటి ఆ యింటివైపు యేమాత్రం సాగినా దొరికిపోతుంది.

కిరణ్ అంబాసిడర్‌ని కాలనీలోనే ఆపేశాడు.

"నువ్వు, నీ సిబ్బంది నేను ఓ అరగంటలో తిరిగిరాక పోతే ఆ యింటిని ముట్టడించు!" అన్నాడు కిరణ్ కారు దిగుతూ.

శ్రీనివాస్ తలూపాడు.

ఇప్పుడు స్పోర్ట్సు కారు ఆ ఇంటి లోపలకి తీసుకు పోబడినట్టుంది, కనిపించ లేదు.

కిరణ్ మెల్లగా ఆ ఇంటివైపు నడిచాడు. చుట్టూ ప్రహారీగోడ వుంది ఎత్తుగా. స్పోర్ట్సు కారుని ఇంటి వెనకవైపుకి తీసుకుపోయినట్టు టైరు గుర్తుల్నిబట్టి పసిగట్టాడు కిరణ్.

కిరణ్ ఇంటిని సమీపించి ఓసారి చుట్టూ కలియజూశాడు. నిర్మానుష్యంగా వుంది. వెనకవైపుకి మెల్లిగా జరిగాడు. అక్కడ పోర్టికో దాన్ని ఆనుకుని గరాజ్ కనిపించాయి. గరాజ్ తలుపులు మూసివున్నాయి. గరాజ్ పక్కనుంచి చిన్న తలుపుంది.

కిరణ్ ఆ తలుపు దగ్గర ఆగాడు. ఆ తలుపు పెద్ద గేటు కమర్చబడినట్టు గమనించాడు ఆ గేటులోపల్నుంచి ఇల్లు ప్రారంభమైంది.

కిరణ్ రెండుక్షణాలు అక్కడే నిల్చున్నాడు. తర్వాత వెనక్కి జరిగాడు. కాంపౌండ్ వాల్ యెక్కడానికి అనువుగా నాలుగైదు బండరాళ్ళను చేర్చ

మెట్లుగా పేర్చాడు. ఆ మెట్లమీదుగా ప్రహరీ ఎక్కాడు. అవతలవైపు బయటికన్నా ఎత్తుగా వుంది. చప్పుడు కాకుండా దూకాడు.

ఒక్క క్షణం ఊపిరి బిగబట్టి గోడకి చేరగిలబడి నిల్చున్నాడు. తర్వాత అడుగులో అడుగు వేసుకుంటూ వరండా వైపు జరిగాడు.

సరిగ్గా అప్పుడే వెనకనుంచి యిద్దరు యువకులు అమాంతం అతని మీదికి దుమికి వెనకగా వాటేసుకున్నారు. కిరణ్‌ని కదలకుండా అదిమిపట్టారు. కిరణ్ కుంచించుకుపోయి వాళ్ళ మధ్యనుంచి జారిపోయాడు. ఒక్కసారిగా లేచినిల్చుని ఇద్దర్ని రెండు చేతుల్తోను అదిమిపట్టి వాళ్ళ డొక్కల్లో తన్నాడు.

అర్భకుల్లా ఉన్న ఆ యిద్దరు నేలమీద లుంగచుట్టుకు పడిపోయారు. మళ్ళీ లేవకుండా మరోసారి పొట్టలో యెగిరి తన్నాడు కిరణ్. వాళ్ళిద్దరు లేవలేదు.

కిరణ్ మరో అరగంటవరకు వాళ్ళిద్దరు లేవరని నిర్ణయించుకుని వరండా దాటి లోపలకి నడిచాడు. అతని కెవరూ అడ్డు తగల్లేదు. అప్పుడే చీకట్లు ముసురుకుంటు న్నాయి.

వరండాని చేర్చివున్న గదిలోపల్నుంచి బయటకి సన్నగా వెలుతురు పడుతోంది. కిరణ్ ఆ గది పక్కకు జరిగి తలుపుకున్న కీహోల్లోంచి లోపలికి చూశాడు.

అది గదికాదు—విశాలమైన హాలు. ఆ హాల్లో పొడవాటి టేబిల్సు అమర్చబడి వున్నాయి. దాదాపు ఏభై మంది నవయువకులు కూచుని వున్నారు బల్లల చుట్టూ.

బల్లమధ్యలో అంతక్రితం ఆ ఇద్దరు యువకులు తెచ్చిన సూట్‌కేస్‌నించి నోట్లకట్టలు పైకితీసి లెక్కిస్తూన్నారు

నలుగురు యువకులు.

కిరణ్ ఏమాత్రం ఆలస్యం చెయ్యలేదు. తన షూ కిందినుంచి పొడవాటి ఏరియల్ రాడ్‌ని బయటికి లాగాడు. అది వైర్లెస్ సెట్‌తో కనెక్షన్ వున్న ఏరియల్. శ్రీనివాస్‌ని కాంటాక్ట్ చేసి వెంటనే ఆ ఇంటిని చుట్టుముట్టమని మెసేజ్ పంపాడు కిరణ్.

సరిగ్గా అప్పుడే అతని పక్కన శబ్దమయింది. తల తిప్పే సావకాశమివ్వకుండా నలుగురు యువకులు అతన్ని పెడరెక్కలు విరిచి పట్టుకున్నారు. హాలు తలుపులు తెరుచుకున్నాయి.

పొడవుగా దృఢంగా వున్న ఓ యువకుడు ఒక్కసారిగా కిరణ్ మీదికొచ్చాడు.

“కిరణ్ సాబ్ మీరా?” అన్నాడు ఆశ్చర్యంగా.

రివాల్వర్ అందుకునే అవకాశంకోసం తీవ్రంగా ఆలోచిస్తూన్న కిరణ్ అతని వంక తనూ ఆశ్చర్యపోయి చూశాడు.

“నువ్వు నాకు ఫోన్ చేశావు కదూ, ఉదయం!” అన్నాడు కిరణ్.

“అవును సార్, మా కార్యకలాపానికి అడ్డురావద్దని మిమ్మల్ని కోరాను. నా కార్యక్రమం లక్ష్యం ఏమిటని మీరడిగారు. ఇప్పుడు మీకు చెప్పినా ఫరవాలేదు. ఎందుకంటే ముఖ్యమైన నా లక్ష్యం సిద్ధించటానికి సమయం ఆసన్నమయింది....”

“ఏమిటా లక్ష్యం?” రివాల్వర్ సంగతి కూడా విస్మరించి కుతూహలంగా అడిగాడు కిరణ్.

“కిరణ్‌గారూ! మేము దొంగలం, దోపిడీదార్లం

కాదు. విద్యాధికులైన యువకులం. ఈ వ్యవస్థమీద, ఈ పెట్టుబడిదారీ గుత్తదార్లమీద అసహ్యం పుట్టి, కష్టాల్లో వున్న వాళ్ళను, అనాథులను ఆదుకుని మాకు చేతనైన సహాయం చెయ్యాలని సంకల్పించుకున్నాం.

మేము దాదాపు వందమందిమి ఒక సంఘంగా ఏర్పడ్డాం. అనాథశరణాలయాలకు విరాళాలు ఇచ్చాం. ఆగిపోయిన ఎన్నో పెళ్ళిళ్ళను ఉద్ధరించాం....బీదపిల్లల చదువులకు ట్రస్టులు ఏర్పరిచాం. ఏ ఆధారంలేని ఎన్నో కుటుంబాలకు ఆర్థికంగా సహాయంచేశాం.

అయితే ఇవన్నీ ఒక ఎత్తు, ప్రస్తుతం మేము తలపెట్టిన బృహత్కార్యం ఒకెత్తూ! వీటన్నిటికీ ఆర్థికంగా మాకెవరు సహాయం చేస్తారు? అందుకే ప్రజల్ని ప్రభుత్వాన్ని మోసంచేసి కోట్లు గడించిన ధనవంతుల్ని ట్రాప్ చేసి లక్షలు దోచుకున్నాం. మేం చేసింది మీ దృష్టిలో, సంఘం దృష్టిలో, చట్టం దృష్టిలో నేరమే కాదనను. కాని, మరో దారి లేదు. అందుకే ఈ నేరానికి పాల్పడ్డాం...."

"మీరు తలపెట్టిన బృహత్కార్య మేమిటి?" కిరణ్ అడ్డుతగిలాడు.

"అదే చెప్పబోతున్నాను కిరణ్ గారూ! రెండుసార్లు నెల్లూరు జిల్లాని తుఫాను రాకాసి తన కరాళ హస్తాల్లో నిర్దయగా నలిపి కాలరాచింది. దానివల్ల యెందరో జీవనోపాధి కోల్పోయారు; ప్రాణాలు కోల్పోయారు. పంటలు నష్టపోయాయి. ఇళ్ళు పోగొట్టుకుని నిరాశ్రయులయ్యారు. వీళ్ళ నాదుకోవటం మా కనీస ధర్మంగా భావించాం.

"వాళ్ళకి ఆహారపు పొట్లాలని అందించాం. రోగాలు

రాకుండా మందులు ఇప్పించాం. మంచినీటిని, కొన్నాళ్ళ దాకా ఆహారపదార్థాలని సరఫరా చేశాం. నిరాశ్రయులైన వారందరికీ ఇళ్ళు కట్టించటానికి సిమెంటు, కలప, రేకులు అన్ని కొనుగోలు చేస్తున్నాం. దానికి పన్నెండు లక్షలు తక్కువయ్యాయి. ఇంతక్రితమే నాలుగు లక్షలు ఓ మెంబరుద్వారా నెల్లూరు పంపించాం. రాత్రికల్లా వాళ్ళకా సహాయం చేరిపోతుంది.

“ఇక మిగిలింది రేపు పంపించి ప్రస్తుతానికీ దోపిడీల గురించి వాయిదా వేయాలనుకుంటున్నాను. ఇంతలో మీరు మా కార్యక్రమానికి అడ్డుతగుల్తున్నారని తెలిసి మిమ్మల్ని రిక్వెస్టు చేశాను....”

అతనేదో చెప్తున్నాడు. ఆ మధ్యాహ్నం ట్రెయిన్ కిందపడి ప్రాణాలు పోగొట్టుకున్న యువకుడు కిరణ్ కళ్ళల్లో మెదులుతున్నాడు. అయితే మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరిన మెంబరు ఆ యువకుడే అయ్యుండాలి. అతని బ్రీఫ్‌లో సరిగ్గా నాలుగులక్షలున్నాయి!

కిరణ్ తన భావాల్ని ప్రకటితంకాకుండా గంభీరంగా అన్నాడు. “మిస్టర్, ఇవన్నీ చూడటానికి ప్రభుత్వముంది. తుఫాను బాధితులకి ప్రభుత్వం అన్నివిధాల సహాయం చేస్తోంది....”

ఆ యువకుడు విరగబడి నవ్వాడు.

“కిరణ్ గారూ! పేపర్లలోను, రేడియోల్లోను ప్రభుత్వం వరదబాధితులకి తుఫాను బాధితులకి సహాయం చేస్తోందని వార్తలేగాని నిజానికి వాళ్ళకి జరుగుతున్న సహాయ కార్యక్రమాలు ఏ మూలకి? వాళ్ళ కంట తిరిగే రక్తాశ్రువుల్ని యెంతవరకు తుడవగలుగుతోంది ప్రభుత్వం? పైగా నిరాశ్రయులైన అభాగ్యులు పిల్లాపాపల్తో ఎక్కడ తల

దాచుకుంటున్నారు? వాళ్ళకేది ఆశ్రయం? వాళ్ళకి రైతులకి ఒనకూడిన నష్టాన్ని యెవరు పూరిస్తూన్నారు.

"కేంద్రాన్ని సహాయంకోసం అర్థించటం, కేంద్ర బృందాలు ఎప్పుడో ఆర్నెల్లకి తుఫాను పీడిత ప్రాంతాల్ని దర్శించి, నివేదికను తయారుచేసి వాళ్ళకి సహాయాన్ని ప్రకటించి—ఇవన్నీ జరిగేదెప్పుడు సార్! ఆ అభాగ్యుల్లో మరికొంతమంది చచ్చాక!

"అందుకే సార్, మేం నడుం బిగించి రంగంలోకి దిగింది! అందుకే సార్ ఈ దోపిడీలు చేస్తూ నేరస్తులుగా ముద్రవేసుకున్నది! కేవలం మానవతా ధృక్పథంతో మే మీ బృహత్కార్యంలో మా వంతు సేవ చేస్తూన్నాం. మాది తప్పయితే మనస్ఫూర్తిగా క్షమించండి సార్!"

కిరణ్ కళ్ళు చెమ్మగిల్లాయి. చుట్టూతనవంకే చూస్తూన్న ఆ యువకుల వంక ఆత్మీయంగా ప్రేమగా చూశాడు.

"మైడియర్ యంగ్ మాన్! నీ పేరేమిటి?" అన్నాడు ఆప్యాయంగా అతని చేయి నొక్కి.

ఆ యువకుడు ఆనందంగా చిరునవ్వు నవ్వి, "మీరు మమ్మల్ని అర్థంచేసుకున్నారని మీ ఆత్మీయత చెప్తోంది. నా పేరు సతీష్. అందరూ ఏ.పి. బాంధవ్‌గా వ్యవహరిస్తారు" అన్నాడు.

"ఏ.పి. బాంధవ్ అంటే....!?"

"ఆపద్బాంధవుడు" అతని పెదాలమీద ఆరని చెరగని చిరునవ్వు.

సరిగ్గా అప్పుడే పోలీసులతో శ్రీనివాస్ లోపలికొచ్చేశాడు.

# 159

కిరణ్ శ్రీనివాస్ వంక చూసి, "వీళ్ళని గాయపరచ వద్దు ఇన్‌స్పెక్టర్! వీళ్ళు స్వచ్ఛందంగా లొంగిపోతు న్నారు. వీళ్ళకి శిక్ష విధించే బాధ్యత నువ్వు తీసు కోవాలి!" అన్నాడు.

సతీష్‌తో బాటు అందరు చేతులు ముందుకు చాచి, చిరునవ్వుతో నిల్చున్నారు. ఆ చిరునవ్వులు పసిపాప నవ్వుల్లా వున్నాయి.

—:అ యి పో యిం ది:—

సీరియల్

# రాక్షసహేల

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

"ఈజిట్ హోమ్ మినిష్టర్స్ రెసిడెన్స్?" అడిగాడు కిరణ్.

"యస్. ప్లీజ్"

"హూ ఈజ్ స్పీకింగ్ ప్లీజ్?"

"పి.ఎ. స్పీకింగ్."

"ఐ వాంట్ మిష్టర్ కౌటిల్యరావ్."

"వాటీజ్ యువర్ గుడ్ నేమ్ ప్లీజ్?"

"రాజేంద్రకుమార్. ఐయామ్ క్లోజ్ ఫ్రెండ్ టూ కౌటిల్యరావ్?"

కొద్దిసేపటి తర్వాత కౌటిల్యరావు పలికాడు.

"హల్లో...." అన్నాడు.

"నేనూ రాజేంద్రకుమార్ని" అన్నాడు కిరణ్ పెదవులు బిగబట్టి.

"అరేయ్ నువ్వా! యెప్పుడొచ్చావ్ మెడ్రాస్ నుంచి?"

"ఇప్పుడే.... బాగున్నావా?"

"ఆఁ... ఏదో అలా వున్నాను. అదేంటి నీ గొంతు అలా బొంగురుగా వుంది."

"కోల్డు.....కోల్డుతో చస్తున్నాను" అని పొడిదగ్గు

దగ్గాడు.

"వెదర్ బాగా లేదులే."

"నీతో పనుండి వచ్చాను. ఎప్పుడు రమ్మంటావ్? ఇంటర్వ్యూ టైమ్ చెప్పు?"

"ఏడ్చావులే. నీకు ఇంటర్వ్యూ ఏమిటి? వెంటనే వచ్చేయ్. ఏమిటి పని?"

"మీవాడికి....అదే అమెరికాలో చదువుతున్నాడు చూడు సురేంద్ర....వాడికి ఒక మాచ్ తెచ్చాను. మనవాడే ఒకడు కోయంబత్తూర్‌లో సెటిల్ అయ్యాడు. బిజినెస్ మాగ్నెట్. స్పిన్నింగ్ మిల్స్ ఓనర్. ఫిఫ్టీలాక్స్ డౌరీ యిస్తాడు" చెప్పాడు కిరణ్.

"డౌరీ సరే! వాడి చదువు పూర్తి కాలేదుగా....! వాడేమంటాడో! నువ్వురా ఇక్కడికి మాట్లాడుదాం."

"సాయంకాలం వస్తాను. టై సిక్స్. ఈలోగా చిన్న చిన్న పనులు చూసుకొని బయలేరతాను. మనవాడు.... వాడేరా అవతార కృష్ణ, స్టీల్ బిజినెస్ చేసేవాడు.... వాడెక్కడ?"

"వాడా?....వాడు ఆ బిజినెస్‌లో దెబ్బతిన్నాడు. రెండు, మూడు సార్లు ఫైనాన్స్ హెల్ప్ చేశాను. ఎంత కని చేస్తాం? నా దగ్గరికి రావద్దని వార్నింగ్ ఇచ్చాను. ఇప్పుడు రావటంలేదు."

"అడ్రస్ తెల్సా నీకు?"

"కింగ్స్‌వేలో సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ అని ఉండేది మరి."

"సరే...! నేను చూస్తాలే! జేమ్స్‌గా డెక్కడ?"

"వాడా? స్మగ్లింగ్ బిజినెస్ చేస్తూ బొంబేలో

ఉన్నాడో? ఫారిన్‌లో ఉన్నాడో?"

"ఓ.కె. ఉంటాను."

"తప్పకుండా రా. నీకోసం ఎదురుచూస్తాను. కారు వుందా? పంపించనా? అసలు ఎక్కడ దిగావు?"

"టాక్సీ తీసుకున్నాలే. రిడ్జులో దిగాను."

కిరణ్ ఫోన్ పెట్టేశాడు.

"చెప్పాడా అడ్రస్?" అడిగింది విజయ.

"వాడికీ సరిగ్గా తెలిసినట్లులేదు" అన్నాడు కిరణ్.

"విన్నా తన ఫ్రెండ్ అని నమ్మేడా?"

"అనుమానం వచ్చింది. కోల్డ్ అని బోల్తా కొట్టే వాగా! షీట్లాక్స్ డోరీతో కొడుక్కి పెళ్ళిసంబంధం తెచ్చాననగానే వుబ్బిపోయి వుంటాడు. రాజేంద్రకుమార్ అనేవాడు మద్రాస్‌లో వుంటాడని మనకి తెలిసింది. అవతారకృష్ణ ఇక్కడే ఉండి వుంటాడు" అన్నాడు కిరణ్.

విజయ. కిరణ్ మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

భవానీదేవి మౌనంగా వుండిపోయింది.

# 9

స్కూటర్ మీద కింగ్స్‌వేలో రెండుసార్లు తిరిగాడు. ఎక్కువగా ఫిలిమ్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీలు కనిపిస్తున్నాయి. హైవ్స్, మోటార్లు, హార్డువేర్ షాపులు వున్నాయి. సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ అనే బోర్డు ఎక్కడైనా తగులుతుందేమోనని ఆశ.

సూర్యోదయ స్టీల్ కంపెనీ అన్న బోర్డు చూసి ఆగాడు.

కిరణ్ని చూసి సేల్స్‌మాన్ మందహాసం చేశాడు. మేనేజర్ సీటు ఖాళీగా వుంది.

ఇనుపరాడ్స్ కట్టలు పేవ్ మెంట్ మీద పడివున్నాయి. లోపల స్టీల్ బద్దీలు, పైప్లు, పలుగులు దగ్గిరా కనిపిస్తున్నాయి.

"ఏం కావాలి సార్?" అడిగాడు సేల్స్ మాన్.

"సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ ఎక్కడుందో కాస్త చెప్పగలరా?" అడిగాడు కిరణ్.

"సప్తగిరి స్టీల్ కార్పొరేషన్?"

"యస్....కింగ్స్ వేలో వుండాలి."

సేల్స్ మాన్ కొద్దిసేపు ఆలోచించాడు.

"కింగ్స్ వేలో లేదు సార్."

"బాగా తెలుసా మీకు."

"నేను పదేళ్ళనుంచి ఇక్కడ పనిచేస్తున్నాను. నేనెప్పుడు విన్లేదు ఆ పేరు" అన్నాడు అతను.

"పోనీ మీ మేనేజర్ కి తెలుసేమో?"

"కనుక్కోండి."

"ఎక్కడ ఆయన?"

"ఒక గంటలో వస్తాడు. కూర్చోండి."

కిరణ్ అసహనంగా కదిలాడు.

"ఐరన్ షాపులు ఇంకా ఎక్కడున్నాయి?"

"హిల్ స్ట్రీట్ లో, ఎక్కువ వున్నాయి సార్!"

"అదెక్కడ?"

"సరాసరి రాణిగంజ్ వెళ్ళండి. రైలు అండర్ బ్రిడ్జి దాటాక రైట్ సైడ్ కి తిరగండి. అదంతా హిల్ స్ట్రీటే. అటూ ఇటూ షాపులున్నాయి. కొంతదూరం పోయాక లెఫ్ట్ కి తిరగండి. మళ్ళీ రైట్ కి. ఆ రోడ్డు మళ్ళీ కింగ్స్ వే లోకి వస్తుంది. సరిగ్గా చౌరస్తా దగ్గర కలుస్తుంది" చెప్పాడు సేల్స్ మాన్.

కిరణ్ థాంక్స్ చెప్పి బయల్దేరాడు.

రాణిగంజ్ రైల్వే అండర్ బ్రిడ్జి దాటాక రైట్‌కి తిరిగాడు. రోడ్డు పక్కన స్కూటర్ ఆపాడు. అక్కడ చిన్న రెస్టారెంట్ వుంది. లోపలికెళ్ళి 'టీ' తాగాడు. కనిపించినంత దూరం బోర్డులు చూశాడు. 'సప్తగిరి' అనే అక్షరాలు కన్పించడంలేదు. బోర్డులు చూసుకుంటూ నడిచాడు. కొన్ని షాపుల్లో విచారించాడు. ఎవరూ చెప్పలేకపోయారు.

స్కూటర్ కింగ్స్‌వేలోకి వచ్చింది మళ్ళీ.

'సప్తగిరి స్టీల్ కార్పొరేషన్' నష్టంలో పడిపోయిందని హోమ్ మినిస్టర్ అనడం గుర్తుంది. డబ్బుకోసం వస్తే కొన్నిసార్లు హెల్ప్ చేశాడు. తర్వాత తన దగ్గరికి రావద్దన్నాడు. ఆ తర్వాత అవతారకృష్ణ, కౌటిల్యరావుని కలుసుకోలేదు. మళ్ళీ కలిసివుంటే చెప్పేవాడు కౌటిల్యరావు.

సూర్యోదయ స్టీల్ కంపెనీ వైపు చూశాడు. మేనేజర్ సీట్లో ఒక ముసలాయన కూర్చున్నాడు. ఆయనకి అరవై ఏళ్ళు దాటి వుంటాయి. కిరణ్ ఆగిపోయాడు.

చాలా పాత విషయం కాబట్టి ఈ ముసలాయనకి తెలిసి వుంటుంది అని ఆశకలిగింది.

కిరణ్ షాపులోకి వెళ్ళగానే సేల్స్‌మాన్ పలకరించాడు. "సార్! దొరకలేదా?"

తల అడ్డంగా వూపి "లేదు. చాలా తిరిగాను" అన్నాడు.

ముసలాయన అర్థంకానట్టు చూశాడు.

కిరణ్ నమస్కారం చేశాడు.

"చెప్పండి. ఏం కావాలి మీకు?" అడిగాడు ముస లాయన.

"సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ అని కింగ్స్‌వేలో వుండాలి. దాన్ని గురించి సమాచారం కావాలి" చెప్పాడు కిరణ్.

"ఎందుకు మీకు?"

"మా నాన్నగారికి జబ్బుగా వుంది. పాత స్నేహితుల్ని ఒకసారి చూడాలని కోరాడు. అందరూ వచ్చి వెళ్ళారు ఈయన తప్ప" చెప్పాడు కిరణ్.

"అవతారకృష్ణయేనా?"

కిరణ్ ముఖం వెలిగింది.

"యస్....ఆయనే? మీకు తెలుసా?"

"తెలియకపోవడం ఏమిటి? సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ ఈ షాపులోనే వుండేది, పదిహేడేళ్ళక్రితం."

"ఈజిట్?"

"అప్పుడు ఇనుము ధర పడిపోయి చాలామంది నష్టపోయారు. ముఖ్యంగా అప్పులు తెచ్చినవాళ్ళు. అవతారకృష్ణ పెద్ద ఎత్తున సరుకు తెప్పించాడు. ధరపడిపోయింది. అప్పులు కట్టలేకపోయాడు. షాపు మూసేశాడు. తర్వాత అమ్మేడు. మా ఓనర్ కొని సూర్యోదయ స్టీల్ కంపెనీ అని పేరు మార్చాడు" చెప్పాడాయన.

"అవతారకృష్ణ ఎక్కడున్నాడు? ఆయన్ని కలుసుకోవాలి."

"ఎక్కడున్నాడో?" ముసలాయన పెదవి విరిచాడు.

కిరణ్ నిరుత్సాహపడ్డాడు.

కుర్రవాడు 'టీ' తెచ్చి ముందు పెట్టాడు.

"ఇప్పుడే తీసుకుని వచ్చాను" అన్నాడు కిరణ్.

"ఫరవాలేదు తీసుకోండి" అన్నాడు ముసలాయన తను గ్లాసు చేతిలోకి తీసుకుంటూ.

కిరణ్ 'టీ' తీసుకుంటూ అడిగాడు "ఈ షాపు అమ్మేసిన తర్వాత అవతారకృష్ణ సిటీలో లేడా? ఏదైనా వూరెళ్ళాడా?"

"ఎక్కడికీ వెళ్ళలేదు. సినిమా డిస్ట్రిబ్యూషన్ కంపెనీలో పార్ట్‌నర్‌గా చేరాడని తెలిసింది. ఆ తర్వాత వాడూ కన్పించలేదు" అన్నాడాయన.

కిరణ్‌లో ఆశ కలిగింది మళ్ళీ.

"ఈ కింగ్స్‌వేలో వందల సంఖ్యలో వున్నాయి సినిమా కంపెనీలు. ఆయన యే కంపెనీలో చేరాడో ఐడియా వుందా మీకు?"

ముసలాయన తల అడ్డంగా వూపాడు.

"షాపు అమ్మేశాక అవతారకృష్ణ మిమ్మల్ని యెప్పుడైనా కలిశాడా?"

"రోడ్డుమీద కన్పించేవాడు. అప్పుడు మాట్లాడేవాడిని. ప్రత్యేకంగా మేము ఎప్పుడూ కలుసుకోలేదు. ఆ అవసరం లేదు."

"మీ మాటల్లో తనిప్పుడు ఏం చేస్తున్నాడో చెప్పి వుంటాడు. ప్లీజ్ గుర్తుకు తెచ్చుకోండి" కిరణ్ రిక్వెస్టు చేశాడు.

ఇంతలో ఎవరో కస్టమర్ వచ్చాడు.

ముసలాయన కస్టమర్‌తో మాట్లాడుతున్నాడు.

"సార్! నేను మళ్ళీ రేపు కలుసుకుంటాను. కొంచెం జ్ఞాపకం తెచ్చుకోండి ప్లీజ్" అన్నాడు కిరణ్.

ముసలాయన తల వూపాడు.

ఆయన మనసులో జ్ఞాపకాల పుటలు తెరుచుకోవ

డానికి కొంత సమయం అవసరం అని భావించాడు కిరణ్.

అతను చెప్పినట్లుగా మర్నాడు వెళ్ళలేదు కిరణ్. ఆ రోజుగూడా ఆలోచించుకోవడానికి టైమ్ ఇచ్చాడు. తర్వాత ఆదివారం వచ్చింది.

సోమవారం ఉదయం వెళ్ళాడు.

కిరణ్ని చూసి ముసలాయన నవ్వాడు పలకరింపుగా.

"సార్! ఏమైనా జ్ఞాపకం తెచ్చుకున్నారా?" ఆత్రతగా ప్రశ్నించాడు.

"ఎప్పటి సంగతో ఏం జ్ఞాపకం వుంటుంది? అయితే మా ఇంటి దగ్గర వెంకట్రావ్ అని డిస్ట్రిబ్యూటర్ వున్నాడు. ఎప్పట్నుంచో ముప్ఫైఏళ్ళుగా సినిమా బిజినెస్‌లో వుంటున్నాడు. ఆయన్ని కనుక్కుందామనుకున్నాను. కాని వూరెళ్ళాడు. ఈ రోజు వస్తారని చెప్పారు ఇంట్లో. వచ్చాడేమోగూడా!" చెప్పాడాయన.

"మీ పేరు అడగనే లేదు."

"నా పేరు ఏకాంబరం."

"నా పేరు కిరణ్."

"అయితే మీ నాన్నకి ఆయనకీ ఉత్తరాలు గూడా లేవా?" ప్రశ్నించాడు ఏకాంబరం.

"ఎవరి గొడవల్లో వాళ్ళుండిపోయారు" అని కిరణ్ యేదేదో కల్పించి చెప్పాడు.

"వెంకట్రావుగారు వచ్చారేమో కనుక్కుంటారా?" అడిగాడు కిరణ్.

ఏకాంబరం టేబులులోనుంచి కాగితాల బొత్తి పైకి తీశాడు. అందులో ఎప్పటివో రకరకాల కాగితాలు,

నలిగి, నల్లబడి, మడతలుపడి కన్పించాయి. వాటి మధ్య నుంచి చిన్న నోట్‌బుక్ బైటపడింది. అందులో వున్న టెలిఫోన్ నెంబర్ తీసి డైల్ చేశాడు.

"హాల్లో.... వెంకట్రావుగారా!"

"యస్. మీ రెవరు?"

"నేను ఏకాంబరాన్ని మాట్లాడుతున్నానండీ. మీతో కొంచెం పనిపడింది. ఇప్పుడు వీలౌతుందంటారా?"

"ఫరవాలేదు రండి" అన్నాడు వెంకట్రావు.

ఏకాంబరం రిసీవర్ పెట్టి "రమ్మన్నారు బాబూ! వెళ్దామా?" అన్నాడు.

కిరణ్ తల వూపాడు.

ఏకాంబరం టెలిఫోన్ బుక్‌లో తను ఫోన్ చేసిన నెంబర్ వేసి "బాబూ ఒక రూపాయి ఇవ్వు" అన్నాడు.

కిరణ్ ఇచ్చాడు.

"ఏమనుకోకు. నేను ఇటువంటి విషయాల్లో ఖచ్చితంగా వుంటాను. టెలిఫోన్ చేతిలోవుంది గదా అని నేను ఇష్టం వచ్చినట్లు వాడుకోను. ఎవరు ఫోన్ చేసినా రూపాయి వసూలుచేసి ఎకౌంట్‌లో జమచేస్తాను. ఆఖరికి నేను కాల్ చేసినాసరే!" అన్నాడు ఏకాంబరం.

"మీ పద్ధతి బాగుందండీ. గుడ్ ప్రిన్సిపల్" మెచ్చుకున్నాడు కిరణ్.

"సిన్సియారిటీ వుండాలి మనిషికి. అటువంటి వాడికి దిగులు వుండదు లోకంలో. నేనింత ముసలివాడినై పోయినా మా ఓనర్ నన్ను వదలడంలేదు. ఎందుకంటావ్ మరి?"

"మీ సిన్సియారిటీవల్ల" అన్నాడు కిరణ్.

ఏకాంబరం ముఖంలో తృప్తి కనిపించింది.

కిరణ్ స్కూటర్ మీద ఇద్దరూ బయలుదేరారు.

ద్వారకా ఫిలింస్ దగ్గర ఆగారు ఇద్దరూ.

ఆఫీసు లోపల చల్లగా వుంది. ఎయిర్ కండిషనర్ శబ్దం చేస్తోంది. వెంకట్రావు ఒక్కడే కూర్చున్నాడు. ఇంకా బిజినెస్ మొదలుకాలేదులా వుంది. స్టాఫ్ తప్ప యెవరూ లేరు.

కిరణ్ గోడలచుట్టూ తగిలించిన స్టిల్స్ చూశాడు. కొన్ని వాల్ పోస్టర్స్ కూడా వున్నాయి.

వెంకట్రావ్ ప్రక్కన రాక్ లో శందరోజులు నడిచిన చిత్రాల తాలూకు షీల్డ్సు వున్నాయి.

"చాలా ఆశ్చర్యంగా వుందే మీకు నాతో ఏదో పని పడడం. కొంపదీసి యేదైనా సినిమాతీద్దామనుకుంటున్నారా?" అని వెంకట్రావ్ నవ్వుతూ అన్నాడు.

"సినిమా తీసేవాడిలా కనిపిస్తున్నానా మీకు? భలే వారే! ఆ తాహతే వుంటే కొట్లో గుమస్తా నౌకరీ యెందుకు చేస్తాను" అన్నాడు ఏకాంబరం.

వెంకట్రావు లావుగా, నల్లగా వున్నాడు. తల తెల్లగా నెరిసిపోయింది. మనిషి ఆరోగ్యంగా దృఢంగా వున్నాడు. నవ్వుతూ, నవ్వించే తత్వం ఆయనదని పరిచయం అయిన వెంటనే తెలుసుకున్నాడు కిరణ్.

"ఎవరీ కుర్రాడు?" అడిగాడు వెంకట్రావ్.

"ఇతని పనిమీద వచ్చాను" చెప్పాడు ఏకాంబరం.

"సినిమాలో వేషం కోసమా?" నవ్వాడు వెంకట్రావు.

"మీ కళ్ళకి అందరూ సినిమా మనుషుల్లాగా కనిపిస్తారులాగుందే" అన్నాడు ఏకాంబరం నవ్వుతూ.

"కామెర్ల రోగికి లోకం అంతా పచ్చగా కన్పించి

నట్లు" అన్నాడు వెంకట్రావు.

"చెప్పండి" అన్నాడు ఏకాంబరం కిరణ్‌ని వుద్దేశించి.

"మా నాన్న, అవతారకృష్ణగారు చిన్నప్పటి ఫ్రెండ్స్."

"అవతారకృష్ణ ఎవరు?" ప్రశ్నించాడు వెంకట్రావు.

"ఒకప్పటి మా షాపు ఓనర్ ఆయన. సప్తగిరి స్టీల్ కార్పొరేషన్ అని నడిపాడు. లాస్‌లో అమ్మేశాడు" చెప్పాడు ఏకాంబరం.

"ఐ సీ...." అన్నాడు వెంకట్రావు.

"స్టీల్ షాప్ అమ్మేసిన తర్వాత ఆయన ఒక ఫిలిం డిస్ట్రిబ్యూషన్ కంపెనీలో పార్ట్‌నర్‌గా చేరానని చెప్పాడు. ఆ వివరాలు మీకు తెలుస్తాయేమోనని వచ్చాం."

"ఎన్నాళ్ళ క్రితం సంగతి మీరు చెప్పేది?" అడిగాడు వెంకట్రావ్.

"పదిహేను, పద్దెనిమిదేళ్ళు అయింటేమో?" అన్నాడు ఏకాంబరం.

"మీరు మూఫైఏళ్ళ నుంచి ఈ లైన్‌లో వున్నారని ఏకాంబరంగారు చెప్పారు. ఆయన గురించి మీకు తప్పకుండా తెలిసివుంటుందని వచ్చాం" కిరణ్ అన్నాడు.

"కరెక్ట్. మొదట్లో నేను బెజవాడలో రిప్రజెంటిటివ్‌గా వుండేవాణ్ని. ఈస్టిండియా కంపెనీ అని వుండేది. అక్కడ్నుంచి ట్రాన్స్‌ఫర్ మీద సికింద్రాబాద్ వచ్చాను. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక బిజినెస్ పెరిగింది. సీనియార్టీమీద ఇన్‌స్పెక్టర్‌గా, ఎకౌంటెంట్‌గా, తర్వాత కొన్ని కొత్త కంపెనీలలో మేనేజర్‌గా పని

చేశాను. ఫ్రెండ్స్‌తో కలిసి పార్టనర్‌షిప్‌లో ఒక కంపెనీ మొదలుపెట్టాం. అయితే కలిసిరాలేదు. విడిపోయాం. ప్రస్తుతం నేనొక్కడ్నే సోల్ ప్రొప్రయిటర్‌ని, నో పార్టనర్స్. హాయిగా వుంది ప్రాణానికి" వెంకట్రావ్ తన గురించి చెప్పుకు పోయాడు.

"అవతారకృష్ణగారు మీకు తెలిసే వుంటుంది" కిరణ్ గుర్తుచేశాడు.

"ఎక్కడో విన్నట్లే ఉందయ్యా పేరు. గుర్తురావడం లేదు" అని కొంచెంసేపు ఆలోచించాడు.

బజర్ నొక్కాడు.

బాయ్ వచ్చి నిల్చున్నాడు.

టీ తెమ్మని చెప్పాడు. అట్లాగే మేనేజర్‌ని పిలవమన్నాడు.

మేనేజర్ వచ్చాడు. ఆయనకీ అరవై ఏళ్ళు వుంటాయి.

"ఏవయ్యా! నీకేమైనా గుర్తుందా? పదిహేడేళ్ళ క్రితం అవతారకృష్ణ అని ఎవరైనా మన లైన్‌లో వున్నాడా? అప్పుడు పెట్టిన కొత్త కంపెనీలో పార్టనర్‌గా చేరాడట" అడిగాడు వెంకట్రావ్.

"అప్పుడు దివ్య ఫిలింస్ అని కొత్త కంపెనీ పెట్టారు సార్! అందులో పాతికమంది పార్టనర్స్ వుండేవాళ్ళు. మీకు గుర్తుండే ఉంటుంది" అన్నాడు మేనేజర్.

"అవునండీ ఏకాంబరంగారూ! కొన్ని కంపెనీల్లో మేనేజర్లు, కాస్త సంపాదించిన రిప్రజెంటేటివ్‌లు పాతికమంది కలిసి 'దివ్య' అని కంపెనీ పెట్టారు ఆ రోజుల్లో ఒక పెద్ద హీరోని నమ్ముకుని" చెప్పాడు వెంకట్రావ్.

"ఆ కంపెనీ యెక్కడుంది?" ఆతృతగా అడిగాడు

కిరణ్.

"ఇంకెక్కడుంది? ఏట్లో వుంది" అని పకపక నవ్వాడు వెంకట్రావు.

"ఇద్దరు, ముగ్గురు పార్టనర్స్ వుంటేనే లేనిపోని గొడవలు, తగాదాలు, మనస్పర్ధలు తగలబడి కంపెనీ ముక్కలు, చెక్కలై పోతుంది. సినిమా కంపెనీలే అంత. అందులోను పాతికమంది పార్టనర్స్ వుంటే చెప్పే పనేముంది. రెండు, మూడేళ్ళకే దివాలాతీసి, కంపెనీ బోర్డు తిప్పేశారు" అన్నాడు వెంకట్రావు.

"పార్టనర్స్ అంతా యేమైపోయారు?" అడిగాడు ఏకాంబరం.

"చెట్టుకొకళ్ళు, పుట్టకొకళ్ళు. అప్పులపాలైపోయి కింగ్స్ వేలో ఎట్లా తిరుగుతారు? ఎటుపోయారో? చిప్ప తీసుకుని అడుక్కుంటూ వుండివుంటారు" పకపక నవ్వాడు వెంకట్రావు.

"అందులో ఒక పార్టనర్ అయినా యిప్పుడు ఈ ఫీల్డులో లేడా?" అడిగాడు కిరణ్.

"వుండి వుంటార్లే! ఏమయ్యా! ఆ గుంపులో ఎవడన్నా బతికున్నాడా ఇప్పుడు?" వెంకట్రావ్, మేనేజర్ని అడిగాడు.

మేనేజర్ బట్టతల గోక్కున్నాడు.

కొన్ని క్షణాలు కళ్ళు మూసుకున్నాడు.

దెయ్యం పట్టినవాడిలా ముందుకూ, వెనక్కీ వూగాడు.

"లక్ష్మణ్ అని ఒకడున్నాడు సార్! ఏడుకొండలు కంపెనీలో రిప్రజెంటెటివ్‌గా పని చేస్తున్నాడు" చెప్పాడు మేనేజర్.

"అదెక్కడి కంపెనీ?" కొంచెం ఆశ్చర్యపోయాడు

వెంకట్రావ్.

"ఏడుకొండలని మీకు తెలుసుసార్! ఈస్టిండియాలో బాయ్‌గా పనిచేశాడు. వాడే ఇప్పుడు నాలుగు డబ్బాలు కొని నేషనల్ కంపెనీ మెట్లకింద గదిలో కంపెనీ ఓపెన్ చేశాడు" అన్నాడు మేనేజర్.

"వాడా? వాడు మా కంపెనీలో ఫాయిలు అందించేవాడు. వాడొక కంపెనీ పెట్టాడా? బాగుంది. బాయ్‌లు కంపెనీలు పెడుతున్నారు. కంపెనీ ప్రొప్రయిటర్లు బాయ్‌లైపోతున్నారు. చూశారా ఏకాంబరంగారూ సినిమాఫీల్డు మహిమ" అన్నాడు వెంకట్రావు.

"అంతేకదండీ మరి. బళ్ళు ఓడలు, ఓడలు బళ్ళు అవుతాయని పెద్దలు వూరికే అన్నారా!" అన్నాడు ఏకాంబరం.

"ఆ లక్ష్మణ్ యెవరో చూపించండి. నేను కనుక్కుంటాను ఆయన్ని" అన్నాడు కిరణ్.

"కింగ్స్‌వేలో సరాసరి వెళ్ళిపోండి. రైల్వే అండర్ బ్రిడ్జి వుందిగదా! అదే బైబుల్ హౌస్ దాటాక, కొంచెం ముందుకు వెళ్తే రైట్ సైడ్ మేడమీద నేషనల్ కంపెనీ ఉంటుంది. దాని మెట్లకింద వుంటుంది ఏడుకొండలు కంపెనీ. చాలా ఈజీ" చెప్పాడు మేనేజర్.

కిరణ్ థాంక్స్ చెప్పాడు.

## 10

మెట్లక్రింద గదికి 'ఏడుకొండలు మూవీస్' అని బోర్డ్ కనిపించింది.

కిరణ్ స్కూటర్ పార్క్ చేసి వెళ్ళాడు.

గదిముందు రెండుబోర్డులు అటు ఇటూ పెట్టివున్నాయి.

ఏభై ఏళ్ళనాటి చిత్రాలు రెండు అవి. 'దుశ్శాసన వధ' 'శ్రీలక్ష్మి వ్రత మహాత్యం' సినిమా పోస్టర్స్ బోర్డుకి అతికించి వున్నాయి. అందులో వున్న యాక్టర్స్ ఎవరో కిరణ్‌కి అంతుబట్టలేదు.

కిరణ్ గడపముందు ఆగాడు. లోపలకు వెళ్ళాలంటే గుహలోకి ప్రవేశించినట్లు వంగి వెళ్ళాడు.

లోపల టేబుల్ ముందు కుర్చీలో కూర్చున్న వ్యక్తి "రండి సార్!" అన్నాడు.

అతను పొట్టిగా, ఎర్రగా ఉన్నాడు. నోట్లో కిళ్ళీ ఉంది. నోరు ఎర్రగా పాము నోరులా కనిపిస్తోంది.

కిరణ్ వంగి లోపలకు ప్రవేశించాడు.

అదో రకమైన వాసన కొడుతోంది లోపల. తుప్పు పట్టిన డబ్బాలు, రాక్‌లో ఫిలిమ్ రీల్స్ ఉన్నాయి. షోకేస్‌లో మరికొన్ని చిత్రాల స్టిల్స్ కనిపిస్తున్నాయి.

"చెప్పండి ఏ సెంటర్ మీద?" అడిగాడు అతను.

"సారీ! నేను బిజినెస్ మీద రాలేదు" అన్నాడు కిరణ్.

అతను కొంచెం ఆశ్చర్యపోయినట్లు కనిపించాడు.

"లక్ష్మణ్ అనే ఆయన మీ దగ్గర పనిచేస్తున్నాడని తెలిసింది. ఆయన కావాలి."

అతను ఎగాదిగా చూసి "మీ చుట్టమా లక్ష్మణ్?" అన్నాడు.

"కాదు" అన్నాడు కిరణ్.

ఏడుకొండలు బెల్ కొట్టాడు.

ఎవరూ రాలేదు.

మళ్ళీ కొట్టాడు. రెండు మూడుసార్లు గట్టిగా కొట్టాడు.

"ఈ బద్మాష్ యెక్కడికి పోయాడో?" అని విసుక్కున్నాడు.

"కూర్చోండి. లక్ష్మణ్ ఎక్కడున్నాడో చూస్తా!" అని లేచి వెళ్ళాడు.

పావు గంట గడిచింది.

లోపల వుక్కపోతగా వుంది.

కిరణ్ అసహనంతో కదిలాడు. ఎంతకీ ఏడుకొండలు రావడంలేదు. ఇక ఆ గుహలో కూర్చోలేక బైటపడ్డాడు.

అప్పుడు కన్పించాడు ఏడుకొండలు. అతని ప్రక్కనే సన్నగా వున్న మనిషి లక్ష్మణ్ అని వూహించాడు కిరణ్.

"ఇతనే సార్ లక్ష్మణ్" అన్నాడు ఏడుకొండలు.

లక్ష్మణ్ ఎగాదిగా చూశాడు కిరణ్ వంక.

"నా పేరు కిరణ్! మీతో కొంచెం మాట్లాడాలి. రండి అలా హోటల్లో కూర్చుందాం" అన్నాడు.

లక్ష్మణ్ కి ఏభై ఏళ్ళుంటాయి. ఇంకా యెక్కువే ఉన్నవాడిలా కనిపిస్తున్నాడు. మాసిన లాల్చీ, పైజామా పెరిగిన గడ్డం, జీర్ణావస్థలో ఉన్న హవాయ్ చెప్పులు అతని దరిద్రాన్ని తెలియజేస్తున్నాయి. ముఖం పీక్కుపోయి, కళ్ళు గుంటలు పడ్డాయి. ఏదో జబ్బునపడ్డ మనిషిలా ఉన్నాడు.

కిరణ్ కి అతన్ని చూస్తే జాలివేసింది.

"నాతో ఏం పని?" అన్నాడు లక్ష్మణ్.

"చెప్తాను పదండి" అని ఇరానీ రెస్టారెంట్ లోకి దారితీశాడు కిరణ్.

బేరర్ వచ్చి నిల్చున్నాడు.

"ఏం తీసుకుంటారు?" అన్నాడు కిరణ్.

"చాయ్."

"సమోసా, బిస్కెట్స్ తీసుకురా" చెప్పాడు కిరణ్.

బేరర్ ప్లేటునిండా తెచ్చిపెట్టాడు.

"తీసుకోండి...." అని బిస్కెట్ నోట్లో పెట్టుకున్నాడు కిరణ్.

"లక్ష్మణ్ సమోసా తీసుకున్నాడు.

"చాలారోజుల క్రితం మీరు దివ్య ఫిలిమ్స్‌లో పార్టనర్ గా వుండేవారు కదూ!"

లక్ష్మణ్ కొంచెం ఆశ్చర్యపోయాడు.

"అవును. ఏం?" అన్నాడు.

"ఏంలేదు 'దివ్య' కంపెనీలో పాతికమంది పార్టనర్స్ వుండేవారు. రెండు మూడేళ్ళ తర్వాత అది దివాలా తీసింది."

"కరక్టే! ఎందుకు ఇవన్నీ అడుగుతున్నారు?"

"మీ పాతికమందిలో అవతారకృష్ణ వుండాలి. అతను ఇప్పుడు యెక్కడున్నాడు? మీకు తెలిసి వుంటుందని వచ్చాను" అన్నాడు కిరణ్.

"అతను ఇప్పుడు కన్పించడంలేదండీ" అన్నాడు లక్ష్మణ్.

కిరణ్ కి నీరసం ముంచుకొచ్చింది.

"సినిమా ఫీల్డులో మాత్రంలేదు. 'దివ్య' క్లోజ్ చేశాక అతను నాందేడ్ లో ఒక థియేటర్ లీజుకి తీసుకుని పిక్చర్ నడిపించాడు. అప్పుడు కనిపించేవాడు తరచుగా. ఆ తర్వాత అందులోగూడా కలిసిరాలేదని తెలిసింది."

"సో....మీకు కనిపించక ఎన్నేళ్ళయి వుంటుంది?"

"పన్నెండేళ్ళు పైనే."

"నాందేడ్‌లో ఏ థియేటర్ లీజ్‌కి తీసుకున్నాడు?"

"చాంద్."

ప్లేట్‌లో సమోసాలు, బిస్కట్స్ ఖాళీ అయ్యాయి. మూడొంతులు లక్ష్మణ్ లాగించేశాడు. ఆకలిగా అతను చితికిపోయాడు. తిండికిగూడా గడవడంలేదేమో? అనుకున్నాడు కిరణ్.

బేరర్ 'టీ' తెచ్చాడు.

'టీ' తీసుకున్నాక "థాంక్యూ వెరీమచ్ లక్ష్మణ్ గారూ" అంటూనే జేబులోనుంచి వందనోటుతీసి అతని చేతిలో పెట్టాడు.

"భలేవారే నాకెందుకు? నేను మీకేం చెప్పలేక పోయాను అతని గురించి" అన్నాడు లక్ష్మణ్ మొహమాట పడుతూ.

"ఫరవాలేదు. చెప్పింది చాలు" అన్నాడు కిరణ్ అతని గుప్పిట మూస్తూ.

లక్ష్మణ్ ముఖంలోకి కొంచెం కళ వచ్చింది. వంద నోటు చాలాకాలం తర్వాత జేబులో పడినందుకేమో? కిరణ్ తిరుగుముఖం పట్టాడు.

అప్పటికి రెండు కావొచ్చింది.

విజయ సోఫాలో కూర్చొని ఎదురు చూస్తోంది అతని కోసం.

"లంచ్ పూర్తయిందా?" అన్నాడు.

"లేదు. నీకోసం ఎదురు చూస్తున్నాను" అంది విజయ.

"ఎందుకు అనవసరంగా వెయిటింగ్?" అన్నాడు.

"అమ్మ ఇప్పుడే భోజనం చేసి రెస్టుతీసుకుంటోంది. పద మనం కబుర్లు చెప్పుకుంటూ కానిద్దాం" అని లేచింది

విజయ.

"అవతారకృష్ణగాడు అంత సులభంగా దొరికేటట్లు లేడు." అని జరిగిందంతా చెప్పాడు కిరణ్.

"అయితే నాందేడ్ వెళ్ళాలా ఇప్పుడు?" అంది విజయ.

"వెళ్ళకపోతే ఎలా మరి?" అని నవ్వాడు.

"నేను గూడా వస్తాను."

"ఎందుకు అనవసరంగా. ఈ పూట బయల్దేరి రాత్రికి అక్కడికి చేరుకుంటాను. రేపు పనిచూసుకుని వచ్చేస్తాను. అక్కడ చూసేందుకు మాత్రం ఏం వున్నాయి?" అన్నాడు కిరణ్.

"నాకు ఇంట్లో బోర్ గా వుంటుంది."

"భరించాలి తప్పదు. ఇకనుంచి నువ్వు బైటపడకుండా కార్యక్రమాలు నడిపించాలి. అసలు హోమ్ మినిష్టర్ కొడుకు విషయంలో గూడా అనవసరంగా బైటపడ్డావని పించింది. నాలుగు హత్యలు చేయదల్చుకున్నప్పుడు ఎంత సీక్రెట్ గా వుండాలో నీకు తెలీదు. పోలీసుల దృష్టి మనమీద యేమాత్రం వుండగూడదు."

"ఆల్ రైట్ కిరణ్. ఇక నువ్వు చెప్పినట్లు వింటాను సరేనా?" అంది విజయ.

"హత్య చేయాలి. చంపింది ఎవరో తెలియగూడదు. 'మిస్ ఎక్స్' అని గందరగోళం క్రియేట్ చెయ్యాలి."

"మిస్ ఎక్స్. వెరీగుడ్ కిరణ్. భలే పేరు సూచించావ్! రియల్లీ వండర్ ఫుల్. నాకు బాగా నచ్చింది."

"సరే ఆ పేరుతోనే హత్యలు చెయ్యి! విష్ యూ ఆల్ ద బెస్టు" అని నవ్వాడు కిరణ్.

# 11

నాందేడ్ వచ్చేసరికి పన్నెండు దాటింది.

అప్పటికి బాగా అలసిపోయాడు.

సినిమా హాలుకి వెళ్ళి ఎంక్వయిరీ చేసే టైమ్ లేదు. సెకండ్ షో ముగుస్తూ వుండొచ్చు.

ఆటో ఎక్కి లాడ్జింగ్ కి తీసుకెళ్ళమన్నాడు.

మమతా లాడ్జి అది.

ఆటోవాలా సూట్ కేస్ తీసుకుంటే కిరణ్ అన్నాడు "ఇది బాగుంటుందా? ఇంకా మంచి లాడ్జింగ్ కి తీసుకెళ్ళు దూరమైనా ఫరవాలేదు."

"ఏ అచ్ఛా లాడ్జి సాబ్. ఫస్టు క్లాస్" అన్నాడు ఆటోవాలా.

రిసెప్షన్ లో విజిటర్స్ బుక్ లో కాలమ్స్ పూర్తిచేసి వందరూపాయలు అడ్వాన్స్ ఇచ్చాడు కిరణ్.

ఆటో అతను అక్కడే నిల్చుని వున్నాడు ఫేర్ ఇచ్చేసిన తర్వాతగూడా.

కౌంటర్లో కూర్చున్న అతను ఐదు రూపాయలు చేతిలో పెట్టాడు. ఆటోవాలా 'సుక్రియా' చెప్పి వెళ్ళిపోయాడు. అతను మంచి లాడ్జి అని తెచ్చింది టిప్ కోసం అన్నమాట. కిరణ్ నవ్వుకున్నాడు.

రూమ్ ఫరవాలేదు. ఫోమ్ బెడ్, ఫాన్, అటాచ్డ్ బాత్ రూమ్ వున్నాయి. రెంట్ గూడా చీప్. లాడ్జి పాతది. మోడరన్ ఫిసిలిటీస్ లేవు.

కిరణ్ స్నానంచేసి రిలాక్స్ అయ్యాడు.

బెడ్ షీట్స్ తెల్లగా మల్లెపువ్వులా వున్నాయి. రూమ్ బాయ్ అతనిముందే మార్చాడు.

తలుపు తట్టిన చప్పుడైంది.

బోల్టు తీశాడు.

బెడ్ షీట్స్ మార్చిన కుర్రాడు.

"సార్ ఏం కావాలి? యేదైనా తెమ్మంటారా? డ్రింక్స్ గాని...."

"వద్దు. డిన్నర్ చేసే వచ్చాను" అన్నాడు కిరణ్.

"సార్...." ఆ కుర్రాడు యేదో చెప్పడానికి మొహమాట పడుతున్నట్లు అతనికి తోచింది.

"చెప్పు. ఏమిటి?"

"సార్! మీకు లేడీస్ కావాలా?" ఆ కుర్రాడు అడిగాడు.

కిరణ్ చురుగ్గా చూశాడు.

గది బైట వరండాలో ఇద్దరు అమ్మాయిలు 'షో' చేస్తున్నారు.

కిరణ్ కి అర్థమైంది. ఈ లాడ్జిలో బ్రోతల్ బిజినెస్ చేస్తున్నారు.

"అక్కర్లేదు" తలుపు మూసి బోల్టు పెట్టాడు.

'దర్టీ లాడ్జ్' గొణుక్కున్నాడు.

జర్నీవల్ల శరీరం అలిసిపోయింది. వెంటనే నిద్ర పట్టింది.

ఎవరో తలుపు తడుతున్న చప్పుడు.

నిద్రలో లీలగా వినిపిస్తోంది.

కలా? నిజమో? అర్థం కాలేదు.

డోర్ బాదుతున్నారు ఎవరో. చప్పుడు ఎక్కువైంది. కిరణ్ కి మెలకువ వచ్చింది, కళ్ళు తెరచి చూశాడు. తను లాడ్జిలో నిద్రపోతున్నాడు.

'ఛ....' ఎవరో తలుపు తడుతున్నాడు. చిరాకు కలిగింది. లైట్ ఆన్ చెయ్యకుండానే తలుపు బోల్టు

తీశాడు. బెడ్ లైట్ వెలుగు మసక మసకగా వుంది గదిలో.

ఎదురుగా పోలీసులు. ఇద్దరు కానిస్టేబుల్స్.

"ఎక్స్‌క్యూజ్ మీ సర్ ...." మర్యాదగా అన్నాడు ఒక కానిస్టేబుల్.

"ఏం కావాలి మీకు?" చిరాకుగా అన్నాడు కిరణ్. పోలీసులు రైడ్ చేశారని అతనికి అర్థమైంది.

"లోపల ఎవరైనా వున్నారేమోనని!" మరొక కానిస్టేబుల్ అన్నాడు.

ఇద్దరూ హిందీలోనే మాట్లాడుతున్నారు.

"ఎవరుంటారు?"

"చూద్దాం సర్. మా డ్యూటీ మేము చెయ్యాలిగదా సార్!"

"ఎవరూ లేరు." అన్నాడు కిరణ్.

"ప్లీజ్ లైటు వేయుండి." రిక్వెస్ట్ చేశాడు కానిస్టేబుల్.

ట్యూబ్ లైటు వెలుగు తెల్లగా గదిలో పరుచుకుంది.

"ఆ బెడ్ మీద పడుకున్నదెవరు?" అప్పటివరకు రిక్వెస్టింగ్ ధోరణిలో మాట్లాడిన కానిస్టేబుల్ గొంతు కఠినంగా పలికింది.

కిరణ్ అదిరిపోయాడు బెడ్ వైపు చూసి. అతని నిద్ర మత్తు దెబ్బకి ఎగిరిపోయింది.

అది రెండు బెడ్‌లు అనించిన విషయం చూడగానే గ్రహించాడు. తను ఒక్కడే పడుకున్నాడు. పక్క బెడ్ ఖాళీగానే వుంది.

కాని ఇప్పుడు చూస్తే ఎవరో ముసుగు కప్పుకుని నిద్ర పోతున్నారు.

"చెప్పండిసార్! ఎవరు?" రెట్టించాడు కానిస్టేబుల్.

కిరణ్ తల అడ్డంగా వూపాడు.

"నో....ఎవరో నాకు తెలీదు." అరిచాడు.

"భలే పెద్దమనిషివయ్యా!...." అని కానిస్టేబుల్ వెళ్ళి దుప్పటి లాగేశాడు.

కిరణ్ కళ్ళు జిగేలుమన్నాయి.

బెడ్‌మీద ఎవరో అమ్మాయి. మంచి వయసులో వుంది. నడుంపైన ఏమీ లేదు. తెల్లటి శరీరం. ఆమె గుండెలు కదులుతూ కిరణ్‌కి మతిపోగొట్టాయి. నడుము క్రింద లుంగీ చుట్టుకుంది. గుండ్రటి మొఖం. చూడ్డానికి చదువు, సంస్కారం వున్న అమ్మాయిలా కనిపిస్తోంది.

కానిస్టేబుల్ దుప్పటి లాగెయ్యగానే ఆమె కెవ్వున కేకవేసి చేతులు గుండెలకు అడ్డం పెట్టుకుని ఒక్క గెంతు గెంతింది బెడ్‌మీదనుంచి. హేంగర్‌కి వ్రేలాడుతున్న తెల్లటి షర్టు వేసుకుంది.

"వాట్ హేపెండ్ డార్లింగ్? ఎవరు వీళ్ళంతా?" ఆందోళనగా అడిగింది ఆమె.

కిరణ్‌కి బుర్ర వేడెక్కిపోయింది. మనస్సు మొద్దు బారినట్లయింది.

ఎవరీ అమ్మాయి?

గదిలోకి ఎలా ప్రవేశించింది?

ఏమిటీ మోసం?

అతనికి ఏమీ అంతుపట్టడంలేదు. రాత్రి ఈ అమ్మాయి తన బెడ్‌మీదనే పడుకుందా? తన ప్రక్కనే నిద్ర పోతోందా?

"వాటీజ్ దిస్ మిష్టరీ?"

కిరణ్ బుర్రలో ప్రశ్నలు పుట్టుకొస్తున్నాయిగాని

ఒక్కదానికీ సమాధానాలు దొరకడంలేదు.

"ఎవరు నువ్వు? ఏమిటి నీ నాటకం?" గట్టిగా అరిచాడు కిరణ్.

"నేనెవరా? నాటకమా? వాట్ నాన్సెన్స్ యూ ఆర్ టాకింగ్?" ఆమె ఇంగ్లీషు దంచేస్తోంది.

"రాత్రి బస్టాండ్‌లో కలిశావు. రాత్రంతా గడిపితే రెండు వందలు ఇస్తానన్నావు. సగం రాత్రి అయిపోయిందిలే అని ఒప్పుకున్నాను. లేకపోతే నైట్‌కి ఐదొందలు వసూలు చేసేదాన్ని."

కిరణ్‌కి కేసు అర్థమైంది. ఈ లాడ్జివాళ్ళు, పోలీసులు, కలిసి తనను బ్లాక్ మెయిల్ చెయ్యడానికి కుట్ర పన్నుతున్నారు.

లాడ్జి మేనేజర్ వచ్చాడు "ఏం జరిగింది?" అంటూ, పోలీసులు అతనిమీద మండిపడ్డారు.

గదిలోకి ఎవరెవరో వస్తున్నారు. ప్రక్క రూమ్స్‌లో దిగిన పాసింజెర్స్ గూడా నిద్రలేచి తమాషా చూస్తున్నారు.

కిరణ్‌కి మండిపోయింది.

మరీ ఇంత అన్యాయమా?

ఇంత మోసమా?

లాడ్జి మేనేజర్ అతన్ని ప్రక్కకి తీసుకెళ్ళి చెవులో చెప్పాడు "సార్! ఐదొందలు ఇవ్వండి. పోలీసులతో రాజీ చేస్తాను."

"నో...." అరిచాడు కిరణ్. "ఆ అమ్మాయి ఎవరో నాకు అసలు తెలియదు. నా గదిలోకి ఎట్లా వచ్చిందో అనూహ్యంగా వుంది."

టైమ్ తెల్లవారుజామున నాలుగున్నరయింది.

ఈ గొడవలో అరగంట గడిచిపోయింది.

ఆ అమ్మాయి తను బ్రోతల్ అని ఒప్పుకుంటోంది. కాని అతనే మొండిగా వాదిస్తున్నాడు.

"మాష్టారూ! పోలీసులకు యేదొకటి ఇచ్చి వదిలించుకోండి లేనిపోని న్యూసెన్స్." మరొక పాసింజర్ సలహా ఇచ్చాడు.

"ఇదేం అన్యాయమండీ? ఆ అమ్మాయి నాకు తెలియదు మొర్రో అంటుంటే." అన్నాడు కిరణ్.

"మీకు తెలియకుండా మీ రూమ్‌లో, మీ పక్కలో పడుకుందా ఆ అమ్మాయి? భలే వారండీ మీరు? మీ కథలు ఎవరు నమ్ముతారు చెప్పండి."

"రెడ్ హేండెడ్‌గా దొరికి పోయాక కూడా దబాయిస్తారేమిటండీ! భలే ఘరానాగా వుందే మీ వ్యవహారం."

"తొందరగా తేల్చండి వ్యవహారం. టైమ్ వేస్టు. బంగారంలాంటి నిద్ర తగలబడిపోయింది."

తలా ఒకమాట అంటున్నారు.

"మీరు ఎంత గొడవచేసినా నేను నయాపైసా ఇవ్వను. మీరేం చేసుకుంటారో చేసుకోండి. ఐ విల్ ఫేస్ ది సర్కమ్‌స్టెన్స్." దృఢంగా అన్నాడు కిరణ్.

"అయితే పదండి స్టేషన్‌కి." ఒక కానిస్టేబుల్ కోపంగా అరిచాడు.

"పదరా....పద...." మరొకడు నెట్టాడు.

"బీ కేర్‌ఫుల్. డోంట్ టచ్ మీ!" పిచ్చివాడిలా అరిచాడు కిరణ్.

అందరూ అదిరిపోయారు ఆ కేకకి.

"నాకు రూల్స్ తెలియవనుకున్నారా? లాడ్జింగ్

రెయిడ్ చెయ్యడానికి కానిస్టేబుల్స్‌కి పవర్స్ ఉన్నాయా? ఐ విల్ స్పీక్ విత్ డియస్పీ, ఆర్ విత్ సర్కిల్ ఇనస్పెక్టర్. కమాన్ మేనేజర్." అని రిసెప్షన్ కౌంటర్ దగ్గరికి పరిగెత్తాడు కిరణ్.

"మేనేజర్ గివ్ మీ టెలిఫోన్ నంబర్స్ ఆఫ్ డియస్పీ, సర్కిల్ ఇనస్పెక్టర్!" కిరణ్ ముఖం జేవురించింది.

పోలీస్ కానిస్టేబుల్స్ ముఖాలు మాడిపోయాయి. లాడ్జి మేనేజర్ కంగారు పడిపోతున్నాడు.

"సర్కిల్ ఇనస్పెక్టర్ రెయిడ్ చేస్తే బాగుండేదా నీకు. మేం చేసినా ఆయన చేసినట్లే డైరీ రాస్తారు. నీకు తెలుసో లేదో ఆ సంగతి" ఒక కానిస్టేబుల్ అన్నాడు.

"అదంతా ఇప్పుడే తేల్చుకుంటాను. ఐ వోంట్ లీవ్ యూ! మేనేజర్ గివ్ మీ నెంబర్స్ ఆర్ గివ్ మీ టెలిఫోన్ డైరెక్టరీ" అన్నాడు కిరణ్ కోపంతో వూగిపోతూ.

మేనేజర్ "మే.. మే.." అంటున్నాడు.

కథ ఇలా అడ్డం తిరుగుతుందని అతను కలలోగూడా అనుకోలేదు.

కిరణ్ లాడ్జి మేనేజర్ చొక్కా పట్టుకున్నాడు.

"యూ! రాస్కెల్. నేను కొత్తవాడినని, నన్ను మోసం చేసి, బెదిరించి, భయపెట్టి డబ్బు లాగాలనుకున్నావా? నేనెవరో నీకు తెలీదు. ఇప్పుడే చూపిస్తాను. నీ లాడ్జి మూయిస్తాను" కేకలు పెట్టాడు రెచ్చిపోతూ.

దాదాపు అన్ని గదుల్లోని పాసింజెర్స్ లేచిపోయారు అతని కేకలకి.

"చూడండి ఫ్రెండ్స్ ఈ లాడ్జి మేనేజర్ మోసం. నేను అర్ధరాత్రి పన్నెండు గంటలకు వచ్చి రూమ్ తీసు

వున్నాను. నీవా రూమ్ ఆక్యుపై చెయ్యకముందే బెడ్ క్రింద ఒక అమ్మాయిని దాచాడు. పోలీసులతో లాలూచీ పడి ఇంత నాటకం ఆడాడు. మనం భయపడాల్సిన పని లేదు. గదిలో అమ్మాయి వున్నంత మాత్రాన వ్యభిచారం చేసినట్లుకాదు. గవర్నమెంట్ హాస్పటల్లో డాక్టర్‌తో చెకప్ చేయించితే నిజం బైటపడిపోతుంది. నేను అందుకు సిద్ధంగా వున్నాను. పిలిపించమనండి సర్కిల్ ఇనస్పెక్టర్ని....”

కిరణ్ మాటలకి మేనేజర్ గడగడ వణికిపోయాడు. కానిస్టేబుల్స్ జారుకున్నారు.

అమాంతం కిరణ్ కాళ్ళు పట్టేసుకున్నాడు లాడ్జి మేనేజర్.

# 12

అర్ధరాత్రివరకు జర్నీ, పర్వాత లాడ్జిలో జరిగిన న్యూసెన్స్‌వల్ల నిద్రసరిపోలేదు కిరణ్‌కు.

కళ్ళు మండుతున్నాయి. మత్తుగా వుంది. ఇంకా నిద్రపోవాలనిపిస్తోంది. కళ్ళు మూస్తే ఎప్పుడు మెలకువ వస్తుందోనని బద్ధకం వదలడానికి రెండుసార్లు 'టీ' తీసుకున్నాడు. స్నానంచేసి డ్రెస్ చేసుకునేసరికి పది దాటింది. ఇడ్లీ, దోసెవంటి సౌత్ ఇండియన్ డిష్‌లు దొరకవని చెప్పారు. పూరీ తీసుకుని చాంద్ టాకీస్‌కి ఆటోలో వెళ్ళాడు.

థియేటర్ దగ్గర నిర్మానుష్యంగా వుంది. మెయిన్ గేటు తీసేవుంది. స్వీపర్లు ఆవరణంతా వూడుస్తున్నారు. 'బాంబే టూ గోవా' అనే సినిమా మార్నింగ్ షో 11-30కి అని బోర్డుమీద రాసి వుంది. 'సంతోషిమా' కూడా మూడు ఆటలు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసిన

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**



'సంతోషిమా' విగ్రహం వుందక్కడ. విగ్రహానికి పూల దండలు, పసుపు, కుంకుమలతో పూజలు చేస్తున్నారన డానికి నిదర్శనంగా కలిపిస్తున్నాయి.

మేనేజర్ రూమ్ తీసి ఉంది.

అరవై ఏళ్ళపైన ఉన్న ముసలాయన కూర్చుని టిక్కెట్ బుక్స్ కట్టలు లెక్క పెడుతున్నాడు. ప్రక్కనే బీరువా తీసివుంది,

నెత్తిన రూమీ టోపి, చిన్నగడ్డం, షేర్వాణీ, కళ్ళ జోడుతో సన్నగా ఆరోగ్యంగా ఉన్నాడు.

"గుడ్ మార్నింగ్ సాబ్" అన్నాడు కిరణ్ గుమ్మంలో నిల్చుని.

అతను ఉలిక్కిపడ్డాడు.

తలెత్తి చూసి లేచి నిలబడ్డాడు.

"గుడ్ మార్నింగ్. ఆయియే! బైఠియే...!" అని ఆహ్వానించాడు.

అతను ఉర్దూ ధారాళంగా మాట్లాడుతున్నాడు.

కిరణ్ కి హిందీ వచ్చు.

"నా పేరు కిరణ్. హైదరాబాద్ నుంచి వచ్చాను" అని తనను పరిచయం చేసుకున్నాడు. అతను తన పేరు అబ్దుల్ సత్తార్ అని చెప్పాడు.

"అచ్ఛా! బోలియే" అన్నాడు అతను.

"మీరు ఈ థియేటర్ ప్రొప్రయిటరా?"

సత్తార్ నవ్వాడు.

"ప్రొప్రయిటర్ని అయితే ఈ ఖర్మ ఎందుకు భాయ్! హాయిగా కారులో తిరిగే వాడిని. ఎప్పటినుంచో ఇక్కడ పని చేస్తున్నాను. మొదట్లో బుకింగ్ క్లర్కుగా

పని చేసేవాడిని. తర్వాత ఆపరేటర్ పని నేర్చుకున్నాను, అసిస్టెంట్ మేనేజర్ చేశాను. మేనేజర్ చనిపోయాడు. ఇక అప్పట్నుంచి నేనే మేనేజర్‌గా ఉంటున్నాను."

"అయితే మీరిక్కడ చాలాకాలం నుంచి వుంటున్నారన్నమాట."

"ఆఁ.... దాదాపు ముప్పై ఏళ్ళు దాటింది."

"సత్తార్ భాయ్! నాకొక సహాయం చేసి పెట్టాలి."

"చెప్పు భాయ్! నాకు వీలైతే తప్పకుండా చేస్తాను."

"పదేళ్ళ క్రితం సంగతి. అవతారకృష్ణ అని హైదరాబాద్ వాలా! ఈ థియేటర్ లీజ్‌కి తీసుకుని నడిపాడు. గుర్తుందా?"

సత్తార్ వెంటనే అన్నాడు.

"గుర్తులేకపోవడం ఏమిటి భాయ్! వాడుట్టి బద్మాష్. తన్నులు తినిపోయాడు ఈ వూరునుంచి. పచ్చి మోసగాడు."

కిరణ్‌కి ఆనందం కలిగింది.

'హమ్మయ్య' అని తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు.

"వాడు ఇప్పుడు ఎక్కడున్నాడో కావాలి భాయ్! ఇక్కడ్నుంచి యే వూరు వెళ్ళాడో మీకు తెలిసి వుంటుంది."

సత్తార్ చెప్పాడు.

"కొన్నాళ్ళు మా థియేటర్‌ని వీక్లీ హైర్‌కి తీసుకుని నడిపాడు. బొమ్మలు హైదరాబాద్ నుంచి తెచ్చుకునేవాడు. చిన్నిడిస్ట్రిబ్యూషన్ కంపెనీపెట్టి దెబ్బతిన్నాడని అక్కడ కాస్త కన్సెషన్ రేట్‌లో బొమ్మలు ఇచ్చేవాళ్ళు. ఆరుదారు నెలలు బాగానే బుద్ధిగా వున్నాడు. కాస్త డబ్బు కూడా సంపాదించాడు. తర్వాత దురాశ

పుట్టింది. చిట్ ఫండ్ కంపెనీ అని పెట్టాడు, అదైనా జాగ్రత్తగా నడుపుకుంటే బాగానే వుండేది. హై సర్కిల్లో పరిచయాలు యేర్పడ్డాయి. అక్కడ్నుంచి యేవుంది? ఖానా, పీనా, బజానా! దివాలా తీశాడు. చాలామంది దగ్గర అప్పులు చేశాడు వడ్డీ ఇస్తానని. బద్మాష్ నా దగ్గర రెండు వేలు తీసుకున్నాడు.

సత్తార్ చెప్పిన దాన్ని బట్టి అవతారకృష్ణ ఈ వూరు వచ్చిన కొత్తలో బాగానే సంపాదించాడని, తర్వాత వ్యసనాల పాలై అంతా పోగొట్టుకుని ఫకీర్ అయ్యాడని అర్థం చేసుకున్నాడు.

"వాడితో మీకేం పని భాయ్?" అడిగాడు సత్తార్.

"వాడీ అదే కేసు మా నాన్న దగ్గిర పదివేలు అప్పుతీసుకున్నాడు. అప్పుడు నేను చిన్నవాడిని ఇదుగో ఇప్పుడు, అప్పుడని తిప్పాడుగాని డబ్బు ఇవ్వలేదు. మా నాన్న చచ్చిపోయాడు. ఇక నేనే వసూలు చేసుకోవాలి" చెప్పాడు కిరణ్.

సత్తార్ నవ్వాడు. "ఆశ వదులుకో భాయ్! వాడు ఇస్తాడని నాకు నమ్మకం లేదు."

"ట్రై చేస్తాను."

"ఖర్చులు దండగ."

కిరణ్ నవ్వి వూరుకున్నాడు.

"వాడి బావగారు వచ్చి తీసికెళ్లాడు. లేకపోతే ఇక్కడే చిప్పతీసుకుని ఫకీర్ లా అడుక్కుంటుండే వాడు" అన్నాడు సత్తార్.

"ఎవరు వాడి బావ? ఏ వూరు తీసుకెళ్లాడో కొంచెం గుర్తుతెచ్చుకో భాయ్."

(ఇంకా వుంది)

